# TAILAPA

## The Rastrakuṭa Kulantaka

(A Historical Romance)



BY

A. N. VENKATESWARUDU GARU.

# తైలప

## ష్ట్రకూటకులాంతకుడు



ప్రకాశకులు:

ఎ. ఎన్. ఎస్. మూర్తి బ్రదర్సు.

తిరువల్లిక్కేణి.

---

సం: ౧

1928.

[illegible]కము]

[వెల. ౧—౪—.

# పీఠిక

ఈ చిత్రాఖ్యాయిక యత్యద్భుత కథా సంవిధానముగలది. ఇందలి యితివృత్తము పదియవ శతాబ్ద్యంతమునందుండిన నూర్మడి తైలప చక్రవర్తిని సంబంధించినది ; ఇతఁడు పశ్చిమ చాళుక్యశాఖను జేరినవాఁడు. మొట్టమొదటఁ జాళుక్యరాజులు, అహిచ్ఛత్రనగరము ముఖ్యపట్టణముగా సపాదలక్ష మండలము నేలుచుండిరి. ఈప్రదేశము 'సవలాక్ కొండలదాపున నున్న'దని డాక్టరు-బండార్కరుగారు నిరూపించెదరు. పిదప, ఆతెగనుజేరిన చాళుక్యులు, అయోధ్యను జయించి యేలఁదొడఁగిరి. అనంతరము, రాజ్యసంపాదనార్థము దక్షిణదిశను గూర్చి దాడివెడలి గంగాతీరప్రాంతములను గెలిచి పాలించిరి. ఇటులే యుత్తర దిశనుండి వచ్చి, దక్కనులోని దేశములను జయించి యేలసాగిరి. వారిలో విజయాదిత్యుని పుత్రుఁడు, కాంచీపురాధీశ్వరుఁడైన పల్లవుని కూఁతును బరిణయమాడి జయసింహుఁడను నన్వర్థబిరుదము వహించి వెలసెను. ఆతని మనుమఁడైన మొదటి పులకేశి, ప్రకృతము బిజపూరను పేరఁ బరఁగుచున్న మండలములోని వాతాపి (బాదామి) నగరము స్వాధీనపఱచుకొని యశ్వమేధయాగము చేసి రాజ్యము విస్తరింపఁ జేసెను. క్రీ. శ. 550 సం॥ముల ప్రాంతమందు నితని ప్రతాపము మధ్యందిన మార్తండుని మాడ్కి పుడమి నలువలంకులఁ బ్రజ్వరిలుచుండెను. ఆతనికిఁ గీర్తివర్మ మంగళేశ్వరులని యిరువురు కొడుకులు పుట్టిరి. కీర్తివల్లభుఁడు వనవాస్యాది మండలములను జయించి ప్రఖ్యాతిచెందెను. మంగళేశుఁడు కొంకణాధిపతియగు మౌర్యుని జయించి రాజ్యము చేకొనెను. ఈనవలలో వ్యాఘ్రేశాలయ ముద్ధరించినట్లు చెప్పఁబడిన మంగళేశుఁ డతఁడే. ఈయిరువురకుఁ బిమ్మట కీర్తివల్లభుని కొడుకు రెండవపులకేశి రాజ్యమునకు వచ్చెను. ఆతఁడు సత్యాశ్రయుఁ డన్న బిరుదము వహించి పెక్కురాజ్యములను జయించెను. ఆతనికాలమునఁ జాళుక్య ప్రతాపాగ్ని చక్కఁగాఁ బ్రజ్వరిల్లి రాణ్మండలమును దపియింపఁ జొచ్చెను. అతఁ డశ్వమేధాధ్వర మొనరించి మహాఖ్యాతి నార్జించెను. రాజ్యతృష్ణ మిక్కుటముగఁగల శ్రీహర్షవర్ధన చక్రవర్తిని రణరంగమున జయించి నర్మదానదికి దక్షిణమున నడుగిడనట్లు తరిమి మహేశ్వర బిరుదము సంపాదించిన ఘనుఁడతఁడే. ఈనవలయందు మల్లప దళపతి తైలప కొసఁగినట్లు చెప్పఁబడిన ఖడ్గ మతని బాహు వలంకరించుచుండినదే. ఆసత్యాశ్రయవల్లభుఁడే పశ్చిమచాళుక్యులకుఁ గూటస్థుఁ డయ్యెను. ఆతనితమ్ముఁడు కుబ్జ

ష్ణువర్ధనుఁడు పూర్వచాళుక్య వంశమునకు మూలపురుషుఁడు ; ఇతనివంశజులే తులయిన బాదప దానార్ణవాదులు.

రెండవ పులకేశికిఁ బిమ్మట నాఱేడు తరములవఱకుఁ జాళుక్యరాజుల పాలనము చక్కఁగాఁ గొనసాగి, రెండవ కీర్తివర్మ కాలమున నశించెను. దంతిదుర్గుఁడను రాష్ట్రకూట నాయకుఁడు కీర్తివర్మతోఁ బోరి జయించెను. అది మొదలుచేసి రెండు శతాబ్దులకంటె నధిక కాలము, ఈశాఖ ప్రఖ్యాతి సెడి యుండినది. జైనులైన రాష్ట్రకూట ప్రభువులు ప్రబలిరి. వీరి పరిపాలనము, క్రీ. శ. 750-972-వ సంవత్సరము వఱకుఁ గొనసాగివచ్చెను. క్రీ. శ. 965-వ సం॥ ము ఖొట్టిగుఁడు రాజ్యమునకువచ్చి యాఱేడు సంవత్సరములు పట్టపాడిని పాలించెను. అట్టియెడ మాళవరాజయిన శ్రీహర్షుఁడను పరమారరాజు, మాన్యఖేటముపైఁబడి రాష్ట్రకూట దళములఁ గెడపి కూల్చి నగరము కొల్లఁగొట్టి చక్రవర్తిని దుర్బలునిఁ గావించెను. ఖొట్టిగుని మరణానంతరమున కక్కలుఁడు సింహాసన మధిష్ఠించెను. ఆతఁడు రాష్ట్రకూట రాజులలోఁ గడపటివాఁడు. అప్పుడు సామంతుఁడై యున్న కక్కలుని యల్లుఁడగు, తైలప అదియే తగిన యదనని, మామను నిర్జించి సామ్రాజ్యము గైవసము చేసికొనెను. రెండువందల సంవత్సరములకంటె నెక్కుడుగఁ బ్రాభవము చెడియున్న చాళుక్యవంశమునకుఁ దైలప ప్రఖ్యాతి యొనగూర్చెను.

చాళుక్యు లాంధ్రులనుట చరిత్ర ప్రసిద్ధాంశము. ప్రాచీనాంధ్రుల బుద్ధికౌశలము శౌర్య స్థైర్యములు మున్నగువానిని సాద్రూప్యముగఁ దెలుప నుంకించి గ్రంథకర్త తైలపను కథానాయకునిగ గ్రహించుట యెంతయుఁ బ్రశంసింపఁ దగినది. దేశచరిత్రాదుల నాధారపఱచికొని తొంటిరాజుల జీవితకాలము నిర్ణయించుట కష్టమైన పనికాదు; కాని, ఆయారాజుల కాలమునందలి దేశస్థితి, మతవ్యాప్తి, సాంఘికపరిస్థితి, రాజకీయపద్ధతి, నాగరకాభ్యున్నతి, ప్రభువులకుఁ బ్రజలయందనురక్తి, ప్రజలకుఁ బ్రభువునందలి భక్తి, జనులలోని మానసికతత్త్వము మున్నగు నంశములను దెలుప వలసి వచ్చినయెడల వాఙ్మయాభిజ్ఞాన మత్యంతావశ్యకము. ఈకథా కాలమున, అనఁగా నన్నయభట్టారకున కఱువది డెబ్బది సంవత్సరములకుఁ బూర్వమున్న యాంధ్రవాఙ్మయము మనకు లభింపదు. దీనివిషయమై గ్రంథకర్త యీనవలలో నిరువదియేడవ ప్రకరణమునందు విపులముగఁ దెలిపెను; ఇదియే యీగ్రంథమునకు హృదయమని నామతము. కావునఁ

గథాప్రస్థాన సంపాదనార్థ మాకాలమం దేర్పడిన యితరభాషా గ్రంథములను బర్యాలోకించుట యత్యావశ్యక మగును. తైలపకు సమకాలీనుఁడై తైలప యాస్థానమందే వెలయుచుండిన రన్నకవి వ్రాసిన 'సాహస భీమ విజయము' మున్నగు గ్రంథములను, ఆకాలమం దేర్పడిన శాసనములను బరిశోధించి నానారస తుందిలముగ నీగ్రంథము సముద్ధరింపఁబడి యున్నది.

ఇంతియకాదు; గ్రంథకర్త గుహాలను గూఢమార్గముల నీ నవలయందుఁ బొందికగాఁ జేర్కొనెను. ఇప్పటివారి కివి కల్పనలనెడి సందియము పొడకట్టక తప్పదు. ఇవి కల్పనములేయన్నను, ఆకాలమునం దిట్టివి సర్వసాధారణములు. రామాయణమందు వింధ్యగిరిలోని నిగూఢ గుహాముఖోపేత రమణీయోద్యానమున స్వయంప్రభ వసించుచుండెననుట మనకుఁ దెలిసినయంశమే. అంధకార బంధురమైన తద్గుహాంతరాళమున సీతాన్వేషణ పరులయిన హనుమదాదు లొక మాసము దనుక తొట్రిలు చుండిరనుటయుఁ బ్రసిద్ధాంశమే. బౌద్ధమతము హిందూ దేశమందు వ్యాపకమొంది యున్నపుడు, గుహాలయములు, బౌద్ధవిహారములు మున్నగునవి ప్రబలియుండెను. అజంతా గుహాలయాదు లిందుకు నిదర్శనములు. వానిలోఁ గొన్ని క్రమముగా వైదికమతము ప్రబలిన కాలమునందు దేవాలయములుగమారెను. ఈ నవలాకారుఁ డీ యుదాహరణ నాధారపఱచుకొని క్రీస్తుశకము పదుఁబూర్వము ప్రకృతికిఁ దోడుగా శిల్పి నాకర్షణీయమైనకూర్చి వ్యాఘ్రఘోషారణ్యమందలి పెక్కు రహస్యమార్గముల కిక్కయైన గుహాలయోద్యాన మొకదాని సృజించి కథానాయకున కొసఁగెను.

ఈకథాసంధి కాలమందు దక్షిణ హిందూస్థానమందలి యనేక విషయములలో జైనమతము రాజమతమై యొప్పుచుండెను. వైదికుల తెగలోని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులవలెనే జైనులలోను నాలుగు వర్ణములవా రుందురు. కన్నడమం దాదిపురాణము వ్రాసిన పంపకవి జైనబ్రాహ్మణుఁడు; రాష్ట్రకూట రాజులు జైనక్షత్రియులు; అజితపురాణము వ్రాసిన రన్నకవి జైనవైశ్యుఁడు. ఈరెండు తెగలకును బాంధవ్యములు జరుఁగుచుండెను. కాని, ఈయిరు తెగలవారిలో నప్పుడప్పుడు మతవైషమ్యము లొనఁగూడి కలహముల క్రింద మునిగి యుచుండెను. ఈయంశము నీనవలలో రెండవ మూఁడవ ప్రకరణములందుఁ జూడనగును. జైనమతమును ఖండింపఁ గుమారిలభట్టు, శంకరాచార్యులు మిక్కుటముగఁ బ్రయత్నించిరి; కాని, తైలప పట్టపాడిని జయించిన పిమ్మటనే దాని

వ్యాప్తికి క్షీణత గలిగెను. శైవ వైష్ణవ మతములు ప్రబలిన కాలమందు దాని యున్నతి బొత్తిగ నశించెను.

నవలాకారుఁ డీ కథానైపథ్యమునందుఁ బ్రవేశపెట్టిన పాత్రములు దమకు నిర్ణీతములయిన కార్యములను జక్కఁగా నిర్వహింపఁ గలిగిరి. ఆయాపాత్రము దన మెలఁకువచేతనే గౌరవమునో లాఘవమునో పొందుచున్నట్లు చమత్కరింపఁ బడియున్నది ; కాని గ్రంథకర్త యేపాత్రమునుగాని శ్లాఘించుటయు లేదు ; దూషించుటయు లేదు. ఈనవలయందుఁ జెప్పఁబడిన దొంగలనాయకుని ముఖ్య పాత్రములలో ముఖ్యునిగఁ బరిగణింప వలయును. కోరుమిల్లిశాసనమందు "దానార్ణవుఁడు మూఁడు సంవత్సరములు రాజ్యమేలిన పిదప, ఇరువది యేడేండ్లు అనఁగాఁ జాళుక్యచంద్రుఁడు రాజ్యమునకువచ్చుపర్యంతము వేఁగిమండలమరాజక స్థితి యందుండె"నని చెప్పఁబడియున్నది. ఈకాలమున దానార్ణవుని జ్ఞాతిసోదరుఁ డగు బాదప పాలించెనని, శ్రీరాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక పుట 13. పూర్వచాళుక్యుల చరిత్రమునందున్నది. ఈయాధారముఁ గొనియే గ్రంథకర్త మిగులఁ జమత్కారముగ నిందు వేఁగిమండలమునకు బాడపసంబంధమును జిత్రించెను. అన్నిఁటికంటెఁ బ్రశంసార్హమయినది వ్యాఘ్రయుద్ధము. గ్రంథకర్త కథానైపథ్యమం దొక వ్యాఘ్రమును స్వభావాతిరక్తము గానియనువున బ్రవేశపెట్టి, నాయకుని యుద్యమమునకును తైలప యదృష్టమునకును సహకారిగా గ్రహించుట యత్యద్భుత సందర్భమైనది. దానినే యహోయశూరుని మాడ్కి వీరమండలమున బోరుసల్ప సంఘటించినది యంతకంటె వింతయైనది. పలుమాటలేల ? ఇట్టివి సానలుదీరిన జాతిరత్నములై యెన్నఁటికిని విలువ గలిగి వెలయును.

ఇట్లు

సుజనమిత్రుఁడు,

A. V. NARASIMHAM PANTULU,
LECTURER IN TELUGU,
QUEEN MARY'S COLLEGE, MADRAS.
MEMBER, BOARD OF STUDIES,
UNIVERSITY OF MADRAS.

# విషయసూచిక

# తైలప



శ్రీ

## మొదటి ప్రకరణము

గోదావరీప్రాంతభూములు మిగుల సారవంతములును జనాకీర్ణములు నైనవి. గోదావరీనదికిని తుంగభద్రానదికిని నడుమనున్న ప్రదేశమంతయును రట్టపాడివిషయ మను పేరితో నొప్పుచుండెను. దీనినే ప్రాచీనులు కుంతలదేశ మనుచుండిరి. ఈదేశమును క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దివఱకుఁ బ్రతాప వంతులయిన చాళుక్య చక్రవర్తులును, పిదప, పదియవశతాబ్దాంతము దనుక రాష్ట్రకూట సార్వభౌములును బరిపాలించిరి. వారిలో, చాళుక్యులు వైదిక మతానురక్తులై పరమబ్రహ్మణ్యులై యనేకాధ్వరకర్తలై వెలసిరి. రాష్ట్రకూటులు, జైనమతావలంబులై, కర్ణాట భాషాపరిపోషకులై ప్రఖ్యాతి గాంచిరి. మాన్యఖేటము, రాష్ట్రకూటరాజులకు రాజధానీ నగరమై యొప్పుచుండెను. ఆకాలమందు, రట్టపాడి విషయము భూలోకస్వర్గముగాను, మాన్యఖేటము, అమరావతీ నగరముగా నెసఁగుచుండె ననుట యతిశయోక్తి గాదు. కాఁబట్టి యారాజ్యము, ఉత్తరమందున్న మాల్వము చేది ఉత్కలము అనెడి దేశములకును దక్షిణమందున్న పల్లవ చోళ పాండ్య దేశములకును గంటిలో నెరసయి మెఱయుచుండెను.

పదియవ శతాబ్దాంతమందు రట్టపాడి సామ్రాజ్యమును నిత్యవర్షుఁడనుచక్రవర్తిపాలించెను. జను లతనిని సాధారణముగా ఖొట్టిగుఁడనియును జెప్పుచుండిరి. మాలవమేలుచుండిన హర్షదేవుఁడు ఖొట్టిగుని సమకాలీనుఁడే. ఖొట్టిగుఁడు పగవారిగుండెలు బల్లెమై, దుర్ధర్షప్రతాపనిధిగ వెలయుచుండినను సంతానహీనుఁడు. అతని మేనల్లుఁడు కర్కలుఁడు యువరాజై చక్రవర్తికిఁ గుడిభుజమును బోలి మెలఁగుచుండెను.

మాన్యఖేట నగరముచుట్టునున్న ప్రాకారదుర్భేద్యమైనది. ఆనగరము, దాదాపు పది కోసుల వెడలుపును పదునైదు కోసుల నిడివియునుగలది. ఆనగరమునకు వెలుపల, భుజబల సమగ్రులయిన భటులు నివసింపఁదగిన వసతు లేర్పడియుండినవి. నగరములోనున్న కోటవంటి దాకాలమునఁ బ్రపంచమునందెచ్చట నుండలేదనియే చెప్పవలయును. రాచనగరు కోటలోనే యుండెను. నగరునకుఁ గుడిప్రక్క నుపవనమును దానితోఁ జేరినట్లు రాజకాంతలు నివసించు నంతఃపురసౌధములు నుండినవి. ఉద్యానమునకు మఱియొకవైపునఁ బొడవైన చుట్టుగోడలతో నొక ప్రదేశముండెను. ఆగోడలలో నొకదానియందు మిగుల దృఢమైన యినుప తలుపొకటి బిగింపఁబడి యుండెను. దానిదిగువనే యొకదిడ్డివాకిలియు నుండెను. మదపుటేనుఁగులను ఢీకొలిపి మోఁదినప్పటికి నాయయఃకవాటము ఛేదించుటకుఁగాదు. అయినను, పాలగచ్చుతో నిర్మింపఁబడి స్నిగ్ధకాంతులచేతఁ గన్నులు మిఱుమిట్లు గొలుపుచున్న హర్మ్య మొకటియుండెను. ఆమేడ యింటికిఁ జుట్టుపక్కలఁ బలువిధములైన భూరుహములు పోఁడిగాఁ బెరిఁగి పక్షివర్గములకు నిలయములై యొప్పుచుండినవి. అచ్చటనే

యొక ప్రక్కఁ జంద్రకాంత శిలావినిర్మిత సోపానపరంపరలతో నొకపద్మాకరము నేత్రస్నాని యొనరించుచుండెను. పలుమాట లేల ? ఎట్టిమానవునిగాని పరవశునిఁజేసి వాని పంచేంద్రియములను దనవశమునకుఁ దెచ్చుకొను పటిమగల వస్తువులన్నియు నచ్చట నమరియుండినవి.

ఆస్థలమందు వసించువారి కా ప్రదేశమే ప్రపంచమును బోలి, వెలుపలివారితో నెంతమాత్రము జోక్యము గలిగించుకొనుటకు వీలు లేదు. వారు, కూపమండూకములను బోలియుండురనుట కేమియు లోపముండదు. ప్రతిదిన మచ్చట మెలఁగుచున్న రాజకీయోద్యోగులు కొందఱను దప్ప నితరులను దర్శించు యోగము వారి కెంతమాత్ర మేర్పడదన్నను, ప్రక్కననే యున్న యుద్యాన హర్మ్యపరిస్థలమునుండి, తమ్ముఁ జూచువారిని దలయెత్తి చూడవచ్చును. వారును, మేడపైనుండి దిగువనున్న వారిని గనుఁగొనవచ్చును. కావుననే రట్టపాడిని బరిపాలించు చక్రవర్తులు, యుద్ధరంగములందుఁ దమకోడిపోయిన వారిని, తమ యాజ్ఞలను ధిక్కరించి మెలఁగు సామంతులను గారవముతోఁ జూచుచు మిక్కుటముగా నిర్బంధింపక, రాజపురుషులకు వలసియున్నన్ని సౌకర్యము లొసఁగి యవరుద్ధస్థితియందునుంచుట కా ప్రదేశమే యుపయోగార్హమయ్యెను. ఆగ్రహపాత్రులయిన యా ప్రభువులు, సర్వదా తమదృష్టిపథమందే యుండఁగోరి, అందలి చక్రవర్తులాస్థలము నిర్మించిరి.

క్రీ. శ. 972–వ సం॥ మే నెల 5–వ తేది యం దీ చరిత్ర యా ప్రదేశమందే ప్రారంభించుచున్నది.

పైనిఁజెప్పిన యవరోధప్రదేశమందుఁ గోనేటియొడ్డున
నున్న తరువరచ్ఛాయను స్ఫటికశిలావేదికపై నొకయువకుఁడు
గ్రీఁజూపులు చూచుచుఁ గూర్చుండి యుండెను. నేల త్రొలుచు
కొని పోవునట్లు వాఁడు చూచు చూపులలో ననేకభావము లిమిడి
యుండినవి. మూర్తీకరించిన శౌర్యరసమోయనఁదగిన యాయావ
నవంతుని మోమెఱ్ఱపాఱి క్రోధాగ్నిజ్వాలలు కనులనుండి వెలికి
నిర్గమించుచునే యుండెను గాని, దైన్యముఁ గాన్పించు చిహ్న
మొక్కింతయు గోచరింపదయ్యెను. విశృంఖల వృత్తితో నరణ్య
మంతయుఁ దన బొబ్బరింతలచేఁ బ్రాణివర్గము గుండెలకదురు
పుట్టించు సింహకిశోరము నొకబోనులో నుంచినప్పు డెట్లుండు
డునో యట్టి యవస్థ యా యువకుని నాశ్రయించి యుండెను.
కాని, వాని యెదలో భీతి కెంతమాత్ర మవకాశము
గన్పట్టలేదు.

వసంతర్తువులోని యాదినము, సర్వప్రాణిమనోరంజకమై
యొసఁగుచుండెను. తరు లతా వితానములు పల్లవితములై
కుసుమితములై నూత్నకాంతులతో నొప్పారుచుండెను. పిక
ములు, జగ్గునిగ్గు లెసలారు మేనికాంతులతోఁ బల్లవఖాదులై
లలితకూజితములు సలుపుచుఁ జెవులకు విందొనఁగూర్చుచుం
డినవి. బాలభానుఁడు, ప్రాచీదిఙ్ముఖమున సగము పొలిచి
చూచువారి కనులకు నింపొనఁగుచుండెను. కుసుమవితతులపైఁ
బ్రసరించి, వాని పరిమళముల గ్రహించి, తద్భారవశమునఁ
మందమందముగ నలసగతులతో దక్షిణానిలము వీచుచుండెను.
ఈసమయ శోభలలో నేదియు నాయువకునకు నెమ్మది యొసఁ
గూర్చినది లేదు.

ఇవ్విధముగా, ఆయువకుఁ డొకముహూర్తకాలము క్రీఁజూపులతో నేకాగ్రహృదయుఁడై యాలోచించి యొక విధమైన తీర్మానమునకు వచ్చెను. దానివలన నతనిమనస్సునకూఱట గలిగి మెల్లఁగ లేచి నిలిచెను ; మోమెత్తి నలువలంకులు చూచెను ; ఏవంకఁజూచిన నెత్తైయిన గోడలు ! గోడలపై వాడియలుగుముక్కలు పొదుగఁబడి యుండినవి. ఒకఁడు తన జీవితకాలమంతయుఁ బాటుపడినప్పటికి నాగోడలనుభేదించుకొని వెలుపలికి వచ్చుట కష్టము ; గోడనెక్కి దుముకుటకును వీలు లేదు. అంత నాయువకుఁడు, చేయునది తోఁచక మఱియొక వంకఁ జూడఁగా నుద్యానహర్మ్యపరిభాగమునందు మోహనమైన మనోహర స్త్రీ విగ్రహము ! సంచారశీలమైన కనకశలాక ! లావణ్యనిధియైన సుందర యువతీస్వరూపము ! తనవంకకే దృష్టినిగిడించి, భూమి కవతరించిన కమలవాసినియో యనఁ దేజరిలుచుండెను. యువకుఁడా యువతీమణి సుందర వదనారవిందము సందర్శించెను; ఆముదిత చిఱునవ్వుతోడి చిన్నిమోముఁ ద్రిప్పి నాపోవక చూచెను ; ఆబిడ వాలారుచూపులఁ గన్పట్టు కరుణారస లహరిని గనుఁగొనెను.

యువకుఁ డాయువతిని సందర్శించు నప్పుడే యాబిడ జగన్మోహన స్వరూపము వానిహృదయ ఫలకమందు బాగుగా ముద్రితమయ్యెను. అది, ఎప్పటికి నెట్టిరసోద్ధతికిఁ జెడునదిగాదు. వానియెదలోఁ బెక్కుభావము లుప్పతిల్లి ముఖసీమ నర్తించి నాటుఁగుచు వచ్చెను. కాని, మిక్కిలి గాటముగ నాటియున్న క్రోధము దీనివలనఁ దొలఁగలేదు. దురాసదమైన కాంతారత్నము, తన్నిట్టియవస్థకుఁ దెచ్చిన పగవాని ప్రాణమునకుఁ బ్రాణమైన

పడఁతుల మిన్న, తనకెట్లు లభింపఁగల దనుతలంపు వాని కణు
మాత్రమైనను లేదు. అయినను, ఆకాంతారత్నమును జెట్ట
వట్టినవాఁడు త్రిలోకాధిపత్యమును వహించిన యింద్రునికంటె
ధన్యుఁడని వాఁడు భావించెను. ఆధన్యతకుఁ దానే పాత్రుఁ
డనియు నిశ్చయించుకొనెను; వెంటనే వాఁడాచోటువిడిచి
కదలెను. ఆయన్నులమిన్నయు నిట్టూర్పునిగిడ్చి తానున్నస్థలము
నుండి తొలఁగెను.

---

## రెండవ ప్రకరణము

### వాదప్రతివాదములు

పైనిజెప్పినవిధమున యువతీయువకుల యంతఃకరణముల
యందు రసాస్వాదనమున కనువైన దర్శన ప్రతిదర్శనములు
జరిగిన దినమునకు మఱునాఁడు తోఁటలో రాజు కొలువుదీరి
యుండెను. అమాత్యులు మంత్రులు సేనాపతులు సామంతులు
రాయబారులు మున్నగువారు వారివారి స్థానము లలంకరించి
యుండిరి. సంస్కృతాంధ్ర కర్ణాటభాషలయం దారితేఱిన కవి
చంద్రులును దమకుచితములయిన యాసనములం దాసీనులై
యుండిరి. జైనదర్శనములం దసాధారణులైన పండితోత్తము
లును, ఆమ్నాయాదులం దసమానప్రజ్ఞగల వైదిక బ్రాహ్మణు
లును రాజుమ్రోల వాదప్రతివాదములు సలుపుచుండిరి.

వాదులు జైనులు; ప్రతివాదులు వైదికులు. జైనవైదిక
మతములలో నెది శ్రేష్ఠమైనదని సిద్ధాంతీకరించుట వారి వాదాం
శము. వాదమందు జితులగువారు జేతలకు దాసులు గావల
యును. కాఁబట్టి, ఆసభలోనివారిదృష్టిని వారివాద మాకర్షించి

యుండెను. రట్టపాడివిషయములోని వైదికమతస్థులయిన హిందు
వులందఱును జైనులగుటయో, లేక యాదేశములోని జైను
లెల్లరు వైదికమతావలంబులగుటయో వారివాదము నాధారము
చేసికొని యుండెను.

ఉభయమతముల వాదిప్రతివాదులు గొప్పపండితులు;
నిశ్చలులు. అటు లున్నను, జైనులకు స్థానబల మధికము.
భట్టిగ చక్రవర్తి జైనుఁడై జైనులను మిక్కుటముగ నభిమా
నించుచుండెను. అంతేగాక, వైదికులను ద్వేషించుచు వచ్చెను.
కావున నాచోట వైదికు లేమిసేయఁగలరు. మఱియు, వాద
మందు జైనులు వేదాదులను ప్రమాణములుగ గ్రహింపమని
మొండిపట్టు పట్టిరి. ప్రత్యక్ష ప్రమాణములను లౌకికోదాహర
ణములనుబూని వాదము కొనసాగింపవలసియుండెను. ఈకారణ
ములనుబట్టి, తమకనువుగానిచోటఁ దమకుఁ బరిచితములైన
యనుమానాది ప్రమాణములను త్యజించి నిగ్రహములతో వాద
మునకుఁ బ్రతిఘటింపవలసిన దురవస్థ బ్రాహ్మణులకుఁ దటస్థించెను.
తమ దుస్స్థితి తెలిసియుండియును వెనుదీయక వారు వాదించిరి.
వాదార్భటి ముదిరెను. జైనుల సిద్ధాంతముల నన్నిఁటిని వైది
కులు పూర్వపక్షముచేసివైచిరి. జైనపండితులు, మోములు వెల్లఁ
బోయి కర్తవ్యముదోఁచక దీనులై తుదకు భట్టిగునివంకఁ
జూపులు నిగిడ్చిరి.

చక్రవర్తి యేమిసేయుటకును దోఁచక నిస్తేజుఁడయ్యెను.
అయినను, అధికారసూత్ర మతనిచేత నున్నది. కాఁబట్టి,
మిక్కిలి చాకచక్యముతో, వైదికమతవాదులలోఁ బ్రముఖుఁ
డైన విశ్వేశ్వరభట్టునుజూచి, 'అయ్యా ! జీవహింస పాప

మునకు మూలమనుటను మీరొప్పుకొనెదరా?" అని రాజు ప్రశ్నించెను.

విశ్వే—సార్వభౌమ! జీవహింస పాపమనుట యొప్పుకొనఁదగిన యంశమే; కాని, ప్రాణివధము పాపకార్యమని యొప్పుకొనుటకుమున్ను; ఆత్మహత్య యంతకంటె ఘోరమయిన పాపమని మీరొప్పుకొనక తప్పదు.

ఖొట్టి—యదార్థము. హత్యసేయుట ఘోరకృత్యము. అంతకంటె ఘోరమైనది యాత్మహత్యయనుట నొప్పుకొనెదను. అదియుండనిండు; మీరు యజ్ఞముల పేరఁ బశుహింస చేసెదరు. ఇది పాపకార్యము గాదా!

విశ్వే—ఔను, జనించునప్పుడే మరణమన్నది యున్నది. మఱియును, మేము మాంసమపేక్షించి పశువులను యజ్ఞకాలములందుఁ జంపుటలేదు. మే మాపశువులను కర్తబ్రహ్మమైన యగ్నిభగవానునకు సమర్పించెదము; దానివలన నాపశువున కుత్తమగతులు లభించును. కాని, మీరు సల్లేఖనము పేరఁ బవిత్రకార్యమని యుద్దేశించి నిజశరీరములనే శుష్కింపఁజేసి పరిత్యజించెదరు. ఇదెట్టి కృత్యము! 'జీవన్భద్రాణిపశ్యతి' అను నీతి కెంతదూరము!

ఖొట్టిగుఁడు బదులుచెప్పుట కేదియుఁ ద్రోవ దొరకక మౌనము భజించుచు మిన్నకుండెను.

విశ్వేశ్వరభట్టులేచి, "సార్వభౌమ! మా ప్రతినచొప్పున జేతలగు మాకు జైనులు లోఁబడవలసిన దావశ్యకమయ్యెను, మామిత్రులయిన జైనులను మేమట్టిస్థితికిఁ దెచ్చుటకు సాహసింపము. వారియెడ మాకు ద్వేషబుద్ధి యెంతమాత్రము లేదు;

కాని, మేమే జితులమై యుంటిమేని, దేవర మమ్మును రట్టు పాడిలోని మా తెగవారైన హిందువులను నేటిస్థితికిఁ దేఁదలఁ తురో మేము మందలింపవలసిన యావసరము లేదు. అటులుం డియు, మీరలు మా సాహసోద్యమమునకుఁ గారణము దెలిసి మా యభీప్సితమును నెఱపఁ బ్రార్థితులు. రాజరాజ! ప్రాచీ నాంధ్రసార్వభౌముల వంశాంకురమును, హితబృందకల్పక మును, చాళుక్య వంశాలంకారమును, పరమబ్రహ్మణ్య కులాం కురము నవరోధస్థితినుండి తొలఁగింపుఁడు. మా వైదికమతమున కతఁడే మూలకందమనుట మీకు విదితము.

ఖట్టి—సరి సరి; 'జైనమతము నెడల మాకు మైత్రికల' దని మీ రేయొప్పుకొంటిరి. మీ యుదారబుద్ధికి సంతసిల్లెదను. మఱి మీరు గొప్ప చేసి చెప్పిన చాళుక్యబాలుని గుణములే యతని నిర్బంధమునకుఁ గారణమని తెలియుఁడు.

విశ్వే—హా, రాజేంద్ర! ఎట్టిక్రౌర్యము! ఆలోచింపుఁడు. రాజధర్మమును విస్మరింపకుఁడు. మందలించెదను; చిత్తగింపుఁడు. విషయమహారణ్యమందు దిక్కు తెలియక స్వేచ్ఛగాఁ బరిభ్రమిం చునట్టి మనస్సును దెలివి తోడ్పాటునఁ దనవశముఁ గావించు కొనిన రాజునకు రాజ్యమెన్నఁటికిని జెడక స్థిరముగనుండును. నీతి చేతనే రాజు కీర్తి దిగంతములకు వ్యాపించును.

"రాజోత్తమ! లోకమంతయును మీకు లొంగునట్లు సేయు వివేకమును విడిచిపెట్టకుఁడు; సమత, శాస్త్రపఠనము వలని ప్రయోజనము. సమత, రాజనీతికిఁ బీఠమువంటిది; ఇం ద్రియములను దనకు వశపఱచునట్టి సామర్థ్యము సమతకుఁ గలదు. సమతకొఱకు రాజు మిక్కుటముగఁ బ్రయత్నింప

వలయును. ఇట్టిమెలఁకువచేత, రాజు తానొకఁడే కాక తనరాజ్య
ములోని ప్రజలందఱితో నభ్యుదయ పరంపరాభివృద్ధిఁ జెంది
సుఖించును. ఇట్టినీతితో రాజ్యమేలుట రాజుయొక్క పనియగును.
కావున, ధర్మమార్గమునఁ దప్పు నన్యమందు రాజు పక్షపాత
ముంచరాదు.

"రాజరాజ! మీకుఁదెలియని నీతిగలదా! యోగము
తప్పినది. కాని, మీరధిష్ఠించియుండు గద్దియ నలంకరింపవలసిన
వాఁడతఁడేకదా!" అనుచునే, సభ కలవరముచూపట్టి కలసి
పోయి చెన్నచెదరి యున్నందున నాసందడిలో విశ్వేశ్వరభట్టు
మెల్లఁగ జాఱి తప్పించుకొనెను.

చక్రవర్తి, కోపమాఁగలేక, "ఈయలసుఁడా నన్ను
మందలించువాఁడు! చేఁప పిల్లకీఁత నేర్పినట్లు నాకా వీఁడు రాజ
నీతులు గఱపుట! వీనిని వీనితోడివారిని దీసికొనిపోయి కారా
గారముఁ జేర్పుఁడు" అని పటపట పండ్లు గీటుచుఁ బలికెను.

విశ్వేశ్వరభట్టు దక్కఁ దక్కిన వైదికపండితులందఱకుఁ
జక్రవర్తి యొసఁగిన శిక్షతగిలెను. ఇప్పుడు విశ్వేశ్వరభట్టెక్కడ
నున్నాఁడో యెవరికిని దెలియదు. కారాగారమునందు వైదిక పం
డితు లుంచఁబడిరి.

---

## మూఁడవ ప్రకరణము

### మరణదండన

విశ్వేశ్వరభట్టు, నాఁడు సభలో రగులఁబెట్టిన యగ్గిబాగు
గాఁబొగిసి మండి హిందువులయొక్కయు జైనులయొక్కయు
హృదయములను దహించుచుఁ బ్రజ్వరిల్లఁ దొడఁగెను. ఆకాల

మందు జైనమతము, దక్షిణాపథమునఁ జోళరాజ్యముతప్పఁ నక్కినరాజ్యములలో దిట్టముగ వ్యాపించియుండెను. దాని యభివృద్ధి యితరమండలములకంటె రట్టపాడిలో నెక్కుడుగఁ గన్పట్టుచుండెను. ఆమతము, రాజాశ్రయము వహించిన యంశమటుండఁగా జనులలో మిక్కుటముగ వ్యాపించి వారియభిమానము సంపాదించియుండెను. తాముప్రేమించిన జైనమతమునకు విశ్వేశ్వరభట్టువలన నపవాద మొనఁగూడుటచేత జైనులకందఱకుఁ దలవంపులయ్యెను. "వైదికమతము నిస్సారమయి యుండిన నట్టి దుస్థ్సితి సంభవింపదు గదా; వైదికులందఱు నాశమొందినచో, వారివెంబడినే యామతము సైతము నశించియుండునే" అను తలంపు వారిడెందములలోఁ దలచూపసాగెను. దేశములో వైదికులసంఖ్య మిక్కుటముగా లేకున్నను, నిత్యవర్షనిసామంతులలో ననేకులును, దళపతులలో నధికసంఖ్యాకులును, భటవర్గమందుఁ బెక్కండ్రును వైదికమతస్థు లుండిరి. ప్రజలలో వైదికులు కొంచెమేయున్నను వారందఱు గొప్పవర్తకులును ప్రభువులునై యుండిరి. ఇదివఱకు సంబంధబాంధవ్యములు నిరంతరాయముగాఁ గొనసాగివచ్చుచున్న యీ యుభయమతములలో వైరస్యము వొడమి, యైకమత్యమెడలించెను. వారిలోని పొందిక చెడి యొకరి మో మొకరు చూడనొల్లక యంతస్తాపము చెందిరి.

వైదికమతమునుగూర్చి యట్టిపట్టుదలతో వాదించిన విశ్వేశ్వరభట్టునుగూర్చి పర్యాలోచింతము. ఆతఁడు, పాండిత్యమం దసదృశుఁడు; మహాప్రతిభాశాలి; కాని, ఆతఁడు నతనితోడివారు నేమండలమువారో కనిపెట్టుట కష్టసాధ్యమై యుండెను. రట్టపాడివిషయమునం దేమండలవాసియును గాఁడు; ఒకవేళ,

చాళుక్య యువకుని విడుదలకై పాటుపడుటచేత నతనిని జేరిన వాఁడా యని సందేహించుటకును గారణములేదు. ఎనిమిదవశతాబ్దిని జాళుక్యులు రట్టపాడిని బరిపాలించుచుండి, తమరాజ్యము రాష్ట్రకూటులకుఁ గోలుపోయి, అప్పటివఱకు వారికి సామంతులయి కల్యాణపురమందే నివసించుచుండిరి ; విశ్వేశ్వరభట్టు కల్యాణనగరము వాఁడు గాఁడు. ఆతనిని గూర్చి యానగరవాసులలో నెవ్వరికిని దెలియదు. ఆతఁడు, నిత్యవర్షునితో సంభాషించినప్పుడు, "ఆంధ్ర సార్వభౌముల వంశాంకురమును" అని యాంధ్రత్వము గొప్పచేసి పలుకుటచేతఁ దప్పక యతఁడాంధ్రుఁడే యనుటకుఁ గొంత హేతువున్నది. ఆంధ్రు నెడలఁ గన్పట్టు వాగ్మిత్వము, ధీరత్వము, సాహసము మున్నగు గుణములన్నియు నతనియందొక్కటఁ బుంజీభవించి యుండెను ; విగ్రహస్ఫూర్తియు నాంధ్రుఁడనుటకుఁ బ్రబలసాక్ష్యమై యొప్పెను. అట్టి యుత్కృష్టాంధ్రులకు నివాసభూమి వేంగీమండలమగుటచేత నతఁ డామండలవాసియో యని సందేహింపవలసి యుండెనుగాని, వేషముచేత సారస్వతబ్రాహ్మణుని బోలుటవలనను విశాలవక్షము, ఆజానుబాహువులు, ఉదారస్వభావము, అనుపమాన క్షాత్రతేజము వెలసి యుత్తమక్షత్రియునిఁ బోలుటవలన నతని నిట్టివాఁడని నిర్ణయించి పలుకుటకు వీలులేకుండెను.

రాజభటులు, పట్టువడిన పండితులను నిర్బంధించి విశ్వేశ్వరభట్టును గుఱించియు, వారియూళ్లను పేళ్లను గూర్చియు నడిగిరి. వారేమియుఁ బదులుపలుకక గాంభీర్యముతో మిన్నకుండిరి. జైనులు విశ్వేశ్వరభట్టును, అతనితోడి వైదికపండితులనుగూర్చి యెట్టియభిప్రాయము వహించి యున్నప్పటికిని, వైదికమతము

వారు,విశ్వేశ్వరభట్టు, సాక్షాత్ కాశీవిశ్వేశ్వరస్వామియనియును క్షీణించి నశించుచున్న వైదికమతముద్ధరింప నట్లు ప్రత్యక్షమయి జైనులతో వాదించి జయించి తిరోహితుఁడయ్యెననియును, ఇది యాప్రభువు లీలలలో నొకటి యనియు గట్టిగ నమ్మిరి. రట్టపాడిలో వైదికులసంఖ్య యత్యల్పముగా నున్నప్పటికిని దమకీశ్వరబలము మిక్కుటముగఁ గలదను విశ్వాసముచేత నెట్టి యిడుమలకు జంకక ధైర్యసమగ్రులయి యుండిరి.

విశ్వేశ్వరభట్టు, ఎట్టివాఁడైననేమి ? శాంతినెలకొని, విద్యావ్యాసంగముగల జనులతో నొప్పుచున్న రట్టపాడిదేశమందు, ఆతని వలనఁ గక్షలేర్పడి వైషమ్యము దలచూపెను. మొదటిప్రకరణమందుఁ జెప్పిన యువకునకు గోరుచుట్టుపై రోఁకటి పోటన్నట్టులవరోధవృత్తితోనే మానక యెక్కుడు శ్రమకుఁ గారణమయ్యెను.

మతవైరస్యము, దావాగ్నిబోలి దేశమంతటను వ్యాపించి శోభ చెఱచి జనులలో క్షోభనించెను. నిత్యవర్షసార్వభౌముఁడు, రహస్యాలోచన సభఁజేర్చి, రాజ్యములోని ఛిద్రముల నణఁచి వేయుట కుపాయము లాలోచించెను. తనచెఱకుఁ జిక్కియున్న యువకునిఁ గడతేర్చినఁగాని దేశోపద్రవములు మాని శాంతి తలచూపదని తీర్మానించెను.

మఱునాడు, రాజు కొలువుదీరి యుండెను. రాజ్యములో విప్లవకారు లను నేరము మోపి తెచ్చిన కొందఱు వైదికులు శిక్ష నిరీక్షించుచు నిలువఁబడియుండిరి. రాజు, వారి నేరము విచారింపక బగ్గున మండిపడి, "వీరిని గానుఁగలోవైచి యాడుఁడు" అని దండనవిధించెను. మఱియును, "ఇట్టి ఛిద్రములకు చిర కాలము

ండి కారణముగా నెగడుచున్న చాళుక్యవంశమును నిర్మూలిం
చఁగాని సామ్రాజ్యమునకు మేలొనఁగూడదు. ఇపుడు, మన
బంధమునకుఁ జిక్కియున్న చాళుక్యయువకుని నీ నీచులతోఁడఁ
మార్చునది. ఋణశేషమువలెనే శత్రుశేషమపాయకరమై
ను" అని యానతిచ్చి, చివాలున సభనుండి లేచెను. నాఁటి
నయు సంతటితోఁ గలిసిపోయెను.

ఈవిధమైన రాజు ఘోరపారుష్యమునకు సభ్యులలో ననే
లేవగించిరి. జైనులగు దళపతులకే రాజు చైదము రుచింపద
య్యెను. నిరపరాధులగు పండితులను కారాగృహమున కంపుట;
దునకుఁ జాళుక్యయువకుని రావించి, అతనియందే యపరా
ము కనుఁగొనక, హృదయస్థైర్యము లేమిచే నవగోధగృహ
ందుంచుట, అంతటితో మానక మరణదండన విధించుట;
దికులు విప్లవకారులని భటులనుటచేతనే క్రూరదండన విధిం
చుట రాజునకుఁ దగునా?" యని సభలోని వారెల్లరుఁ దల్లడిల్లిరి.
నదళవాయి మల్లప, "హా! ఏమి క్రౌర్యము! రాజున కిట్టిపారు
ష్యముతగదు" అనుచు నాస్థలమువిడిచి తొలఁగెను.

---

## నాల్గవ ప్రకరణము

### మిత్రుఁడు

ప్రాతఃకాల గంధవాహాంకూరములు నలువలంకుల మంద
ందముగఁ బ్రసరింపఁజొచ్చెను. శుకపిక శారికాది పక్షినికరము
ంజుల నిస్వానములఁజేసి చెవికింపు సంపాదించుచుండెను.
ిరాజు వెల్లఁబోయి పశ్చిమ సముద్రమునఁ బడి యంతరింప

నుంకించుచుండెను. కుముదినీసముదయము, తమయొడయుని యెడఁబాటునకు విన్ననై వికాసము దక్కెను. ప్రాచీదిశాగ్ర భాగమందు నరుణారుణ కాంతులతో దిననాథుఁడు తోతెంచి, జంతు సంతానముల డెందముల కనుందానంద మొనఁగూర్చుచు నెసక మెసఁగెను.

ప్రపంచమును సంతోషమగ్నమగునట్లు చేయుచున్న భాసురమైన యావసంతర్తువులోని వాసరము చెఱయందున్న యువకునకు నీరసమై యుండెను. నాఁటి వేఁకువను వాఁడు పద్మాకరము చెంతనే మసలుచుండెను. తొంటివలెనే నేల గాడి పాఱు నట్లు చూచుచుండెను. ఒకవంకఁ దన్నాశ్రయించిన దుస్థితి యును మఱియొకవంకఁ దాను వలచియున్న యువతీవతంసమును వానిడెందమును బంచుకొని పలువగల వెతఁ గొలుపుచుండ నేమి సేయుటకును దోఁచక యుండియుండి వాఁడు నిట్టూర్పులు నిగు డ్చుచుండెను. నాలుగైదుదినములకుమున్ను సార్వభౌమునిసభలో జరిగిన మతవివాదముగాని, తొలినాఁడు రాజు తన్నుఁగూర్చి విధిం చిన మరణదండనగాని వానికిఁ దెలియదు. తెలియుటకుఁ దగిన కారణములును లేవు. తొలిదినము వాఁడు సందర్శించిన యువతీ రత్నమును జూచుయోగము వానికి మరలఁ గలుగలేదు. ఆసుం దరిని జూడవలయునని వాఁడుకోరిన నాఁడును గాఁడు; ఆబిడ సమ్మోహన సుందరవిగ్రహము వాని హృదయ ప్రదేశమున సాక్షాత్కరించి యున్నది కదా!

నాఁటి యుదయము, పమనైదు పదునాఱు గడియలుకా వచ్చినప్పటికి నాయువకుఁడా చోటునుండి కదలక దీర్ఘాలోచ నకుఁ జిక్కియుండెను. ఆవేళ, భటులుమువ్వురు వేత్రపాణులై

నుండి కారణముగా నెగడుచున్న చాళుక్యవంశమును నిర్మూలిం చినఁగాని సామ్రాజ్యమునకు మేలొనఁగూడదు. ఇపుడు, మన నిర్బంధమునకుఁ జిక్కియున్న చాళుక్యయువకుని నీ నీచులతోడఁ బరిమార్చునది. ఋణశేషమువలెనే శత్రుశేషమపాయకరమైనది" అని యానతిచ్చి, చివాలున సభనుండి లేచెను. నాఁటి సభయు నంతటితోఁ గలిసిపోయెను.

ఈవిధమైన రాజు ఘోరపారుష్యమునకు సభ్యులలో ననేకులేవగించిరి. జైనులగు దళపతులకే రాజు చైదము రుచింపద య్యెను. నిరపరాధులగు పండితులను కారాగృహమున కంపుట; విందునకుఁ జాళుక్యయువకుని రావించి, అతనియందే యపరాధము కనుఁగొనక, హృదయస్థైర్యములేమిచే నవరోధగృహమందుంచుట, అంతటితో మానక మరణదండన విధించుట; వైదికులు విప్లవకారులని భటులనుటచేతనే క్రూరదండన విధించుట రాజునకుఁ దగునా?" యని సభలోని వారెల్లరుఁ దల్లడిల్లిరి. జైనదళవాయి మల్లప, "హా! ఏమి క్రౌర్యము! రాజున కిట్టిపారుష్యముతగదు" అనుచు నాస్థలమువిడిచి తొలఁగెను.

## నాల్గవ ప్రకరణము

### మిత్రుఁడు

ప్రాతఃకాల గంధవాహాంకూరములు నలువలంకుల మందమందముగఁ బ్రసరింపఁజొచ్చెను. శుకపికశారికాది పక్షినికరము మంజుల నిస్వానములఁజేసి చెవికింపు సంపాదించుచుండెను. రేరాజు వెల్లఁబోయి పశ్చిమ సముద్రమునఁ బడి యంతరింప

నుంకించుచుండెను. కుముదినీసముదయము, తమయొడయని యెడఁబాటునకు విన్ననై వికాసము దక్కెను. ప్రాచీదిశాగ్ర భాగమందు నరుణారుణ కాంతులతో దిననాథుఁడు తోతెంచి, జంతు సంతానముల డెందముల కానందానంద మొనఁగూర్చుచు నెసక మెసఁగెను.

ప్రపంచమును సంతోషమగ్నముగునట్లు చేయుచున్న భాసురమైన యావసంతర్తువులోని వాసరము చెఱయందున్న యువకునకు నీరసమై యుండెను. నాఁటి వేఁకువను వాఁడు పద్మాకరము చెంతనే నుసలుచుండెను. తొంటివలెనే నేల గాడి పాఱు నట్లు చూచుచుండెను. ఒకవంకఁ దన్నాశ్రయించిన దుస్థితి యును మఱియొకవంకఁ దాను వలచియున్న యువతీవతంసమును వానిడెందమును బంచుకొని పలువగల వెత గొలుపుచుండ నేమి సేయుటకును దోఁచక యుండియుండి వాఁడు నిట్టూర్పులు నిగు డ్చుచుండెను. నాలుగైదుదినములకుమున్ను సార్వభౌమునిసభలో జరిగిన మతవివాదముగాని, తొలినాఁడు రాజు తన్నుఁగూర్చి విధిం చిన మరణదండనగాని వానికిఁ దెలియదు. తెలియుటకుఁ దగిన కారణములును లేవు. తొలిదినము వాఁడు సందర్శించిన యువతీ రత్నమును జూచుయోగము వానికి మరలఁ గలుగలేదు. ఆసుం దరిని జూడవలయునని వాఁడుకోరిన నాఁడును గాఁడు; ఆబిడ సమ్మోహన సుందరవిగ్రహము వాని హృదయ ప్రదేశమున సాక్షాత్కరించి యున్నది కదా!

నాఁటి యుదయము, పదునైదు పదునాఱు గడియలుకా వచ్చినప్పటికి నాయువకుఁ డావోటునుండి కదలక దీర్ఘాలోచ నకుఁ జిక్కియుండెను. ఆవేళ, భటులుమువ్వురు వేత్రపాణులై

యాప్రదేశము చుట్టుగోడయందలి దిడ్డివాకిలి తెఱచికొని లోనికివచ్చిరి. వారివెంటఁ బదుగురు పనివాండ్రు ఖనిత్రాది సాధనములను బట్టుకొని వచ్చిరి. వారు, చూటిగా యువకుఁడున్న చోటుఁజేరి, దాపుననేయున్న యొక రసాలవృక్షమును దానిపై నల్లిబిల్లిగ నల్లికొనియున్న లతావితానమును నఱికిత్రోసిరి. పిదప, దానిబోదెను గూఁకటివేళ్లతోఁ బెరికివేయుటకుఁ ద్రవ్వుచుండఁగా మఱియు మువ్వురాయుధపాణులా దిడ్డితలుపు దెఱచికొని యటకువచ్చి నిలిచిరి. అంతకుఁబూర్వ మటకువచ్చి గోయి త్రవ్వించుచున్న భటులు, క్రీఁగంటిచూపులతో నాయువకునిఁ జూచుచు వానిను ద్దేశించి యేమోయనుకొనుచుండిరి, కాని వాని మాటలవంకఁగాని, కృత్యమువంకఁగాని వానిచిత్తము చెల్లలేదు. ఆయుధపాణు లటకువచ్చినప్పుడు సరిగా నిరువదిగడియల ప్రొద్దెక్కియుండెను. అదివఱ కేదియు పుఱివోకయున్నందున యువకుఁ డాలోచనా మగ్నుఁడై తొంటివలెనే క్రీఁగంటిచూపులతో నుండెను.

పల్లము త్రవ్వినదియైనది; కూలివారు మిగులసామర్థ్యముతోఁ దమకుఁజెప్పిన ఘనకార్యమును బూర్తినొందించినట్లు లొంగి నిలిచి, తమ యజమానులవంకఁ జూచుచు, నిఁకఁ జేయవలసియున్న పనులనుగూర్చి ముదలఁ గనిపెట్టియుండిరి. ఆయుధపాణులు మువ్వురలో సౌందర్య సమగ్రుఁడైన యువకుఁడొకఁడుండెను. వాఁడు, చాళుక్య యువకునిఁ జూచినది మొదలు వానిదృష్టి మఱియొకదానిపై మరలలేదు. ఆహా! ఈ యౌవనవంతుని సౌందర్యమెంత శ్లాఘాపాత్రమైనది! దానికిఁ దగినటులే యనుపమాన క్షాత్రతేజము! వీఁడిట్టి కష్టమునకుఁజిక్కి సొంపఱియుండియును, వీని నెమ్మోమెట్లు కళకళలాడుచున్నది! ఏమి

వీని గాంభీర్యము! కావుననే యాసుందరి, ఆ యసాధారణ రూపగర్విత, ప్రథమదర్శనమందే వీనియెడ ప్రణయిని యైనది. కారణములేని కార్యముండునా? కానిమ్ము, వీఁడు నావాఁడు; వీనిని బోఁగొట్టుకొనుటకంటె బేలతన ముండునా? చూతము" అని తనలో నేమేమో తలపోసి కొనుచుండెను. ఇటులే యొక రొకరి చందమునం దొక్కొక్క విధమైన తలంపు తలచూపి చిందులు త్రొక్కుచుండఁగా నా ప్రదేశమందు సద్దణఁగి పదిపదు నైదు నిముసములు గడిచెను.

అటుపిమ్మట, రూపసియైన యాయుధపాణి తనతోడ వచ్చియుండిన తక్కిన యిరువురనుజూచి రహస్యముగ వారితో నేమోచెప్పెను. వెంటనేవారాచోటు విడిచిపోయిరి. వారు, ముం దునకుఁ గొన్ని యడుగులిడఁగానే, 'మీరును వారికిఁదోడ్పడుఁ'డని యాభటులతోఁజెప్పఁగా నా ముగ్గురు భటులు వారివెంటఁ బోయిరి. అటుపిమ్మట నాపనివారిని జూచి "మీ రొక మూల దవ్వులఁ దొలఁగియుండి నేను బిలిచినప్పుడు రండు" అనెను. వారు తొంటివారివలెనే పనివినిరి.

"యౌవనవంతుఁడా! ఇందుండి కదలుము. ఇప్పుడే కద లుము. ఇది నీకు క్షేమకర మగుచోటు కాదు" అనుచు వాని హస్తమును దన కుడిచేతితోఁ బట్టుకొనెను. వాని స్పర్శచేత నావీరయువకుని యంతఃకరణము చెప్పశక్యముగాని సౌఖ్యాను భూతినొంది యానందించెను. ఆనందపారవశ్యముచేత మఱి పలుకలేక వాని ముఖచంద్రునిపై దనదృక్చకోరములను బఱపి యాపోవక వాని సౌందర్యామృత మనుభవించెను. కాని, పూర్వ స్థితి జ్ఞప్తిరాఁగా నావీరయువకుఁడు, చాళుక్యయువకునిఁజూచి

"మిత్రుఁడా, ఈచోటువిడిచి కదలుము" అని మఱియొక తడవకు
చెప్పెను. అప్పుడా చాళుక్యయువకుఁడు, "ఏల యీచోటువిడువ
వలె" ననియు, "విడువనిచో నేమి కీడు మూడు" ననియు,
"ఎక్కడకుఁ బోవలె" ననియు నిత్యాది ప్రశ్నలడుగ నుంకించి
యును, వాని మోముఁ జూచుటచేతనే వానియం దవ్యాజ
సౌహార్ద మొనఁగూడినందున, బదులు మాటాడక, వాఁడు
పిలుచుకొనిపోయినచోటునకుఁ బోయెను. ఆవీరయువకుఁడు వాని
నాభవనములోని యొకగదికిఁ బిలుచుకొనిపోయి, అచట వానిని
దాఁచి, "ఓయువకుఁడా! ఉత్తరక్షణమందే నీపైఁ బిడుగువలెఁ
బడనున్న మరణమునుండి తప్పితివి. ఇంక భయములేదు ; తరు
ణము తెలిసి వచ్చి నిన్నుఁ గలసికొనెదను. అందాఁక నీవిచ్చట
నుండుము. మిత్రుఁడా! నన్ను నమ్ముము" అనుచునే తలుపు
మూసి తాళమువేసి బీగము జాగ్రత్తపఱచికొని యటనుండి
గోయి త్రవ్విన చోటుఁ జేరెను.

తదనంతర మావీరయువకుఁడు తొందరగా గట్టున నున్న
మంటిని గోతిలోఁ ద్రోయఁజొచ్చెను. దవ్వుల మసలుచున్న పని
వాండ్రు వీరయువకుని చర్యఁజూచి పరుగిడివచ్చి, దబ్బుదబ్బున
మన్నుద్రోసి గోతినిబూడ్చి గట్టించుచుండిరి. అట్టియెడ వెలు
పలికిఁ బోయియున్న యాయుధపాణు లిరువురును భటులు
మువ్వురును పాశాదులఁగొని యటకు వచ్చిచేరిరి. వారచట
జరిగిన పని కచ్చెరువొంది, ఆవీరయువకునిఁ జూచి, "ఏమి, ఇం
తలోఁ బనులన్నియుఁ దీఱెనవా?" అని యడిగిరి. అందుల
కావీరుఁడు, "హా, పల్లెత్తుమాట యిటఁ బలుకుట కవకాశము
లేదు ; ఇంక సార్వభౌము నొద్దకుఁ బోయి సర్వకార్యములు

నిర్వహించితిమని విన్నవింపుఁడు. వారిచ్చు బహుమతులను మీరే పొందుఁడు ; పొండు" అని తొందరపెట్టి వారిని బంపివేసెను. తానును వారికిముందే యాచోటు విడిచి వెలుపలికి వచ్చెను.

భటులును బనివాండ్రును ఘనకార్యము నిర్వహించిన వారివలెఁ దనివిసెంది రాజునొద్ద గొప్పబహుమానములు పొందుట కేమిచెప్పవలయునో యాలోచించుకొనుచు వెడలిపోయిరి. వారికంటె ముందుగ వెళ్లిపోయిన వీరయువకుఁడు తన యునికి పట్టుఁ జేరెను. తక్కినవారు వానినిగూర్చి, "రాజమన్ననలకుఁ బాత్రుఁడైన సేనాధిపతియో సామంతరాజపుత్రుఁడో" యని భావింపఁగలిగిరేకాని యంతకంటె మిక్కుటముగ వారికేమియుఁ దెలియదు.

---

## అయిదవ ప్రకరణము

## విముక్తి

చాళుక్యరాజపుత్రుఁడు గదినిజేరి మైదాలు గడియలు గడిచెను. అదివఱ కాతని బన్నముదీఱుటకు సూచనలు గన్పట్టవయ్యెను. గదిలో గాలియు వెలుతురును బ్రసరించుటకుఁ దగిన గవాక్షములు లేవు; కాఁబట్టి, ఆచోటు మిక్కుటమైన యుక్కకు నిక్కమైయుండెను. ఆవేళకు యువకున కూపిరి దిరుగుటయుఁ గొంచెము కష్టముగానే యుండెను.

"ఉన్నటులుండి నాకిట్టి దుర్గతి యేలకలిగెను? నన్ను భూపాలుఁడు మిగుల గౌరవముతో రావించి చెఱనుంచుటకేది ప్రబలకారణమో కన్పట్టకున్నది. ఏదో కుత్సితుల దుర్మంత్ర

విశేషముచేత నాకిట్టి యిక్కట్టు కలిగినదనుకొన్నను, ఆయుధ
పాణియగు యువకుఁడు నన్నీగదికిఁ బిలుచుకొనివచ్చి, "మిత్రుఁ
డా! నీకు మరణము దప్పినది" అని వాక్రుచ్చెను. వాఁడు
చెప్పిన చొప్పుననే నాకు మేలుగలిగెనని యూహించెదను పో,
నాకు మరణము గలుగు నంతటి సందర్భ మేమి గలిగెను?
మరణదండన విధించిన వారెవరు? ఏల యట్టిదండన విధింపవల
యును? అందులకు నేను జేసిన యపరాధ స్వరూప మెట్టిది?
ఇట్టి యాపత్సమయమున నావీరబాలుఁడు నాకేల యుపకరిం
చెను? అతఁడు నన్ను మిత్రుఁడా యని సంబోధించెను గద;
ఆమైత్రి నిర్దుష్టమైనదని యెట్లనప్పుట? ఆతని మైత్రి నిర్దుష్టమే
యనుకొందము; నన్నీగదిలో నడఁచియుంచి యూపిరి యాడని
విధమున హింసకుఁ బాల్పఱచి యెటకుఁబోయెను? ఎప్పుడు
వచ్చి నాకెటు లుపకరించును? నిజముగా వాఁడు వంచకుఁడు.
నాచావుకొఱకు వాఁడిట్టి యుపాయము పన్నెను. హా!
అట్టి సుందరుఁ డీ ఘోరకృత్యమునకు సాహసింపఁడు. కారు
ణ్యము స్ఫురించు వాని చూపులందును మాటలందును క్రౌర్య
మించుకంతయుఁ గన్పట్టదు. వాఁడు నన్నుఁ జంపుటకే యత్నించు
చున్నాఁ డనుకొందము; దానివలన వాఁడు పొందునట్టి లాభ
మేమి?" అని తలపోయఁ జొచ్చెను.

ఆయదనున నాయువకుఁడున్న గదితలుపు తెఱచికొని,
వీరయువకుఁడు లోపలికి వచ్చెను. తాను జేతఁబట్టుకొనివచ్చిన
మూట నటనుంచి, "ఓ యౌవనవంతుఁడ! ఏమి సేయుదును?
విధిలేక నిన్నీయవస్థకు లోఁబఱచవలసివచ్చెను. నీవు నన్నెంతో
సందేహించి యుందువు; నీయెడ పలువగ లనుభవించి చెన్నఱి

యుండుటను నీముఖమే తెలుపుచున్నది. గాలి సైతము చొఱ
లేని యీగదిలో నీవు ప్రాణవియోగస్థితి యందుంటివని నాకుఁ
దెలియును. "అక్కటా! ఇంతకంటెఁ దొందరగా రాలేనైతిని.
ఇది యటుండనిమ్ము. ఆహారము దెచ్చియున్నాను; దీనిని స్వీకరించి
కొంత సేదదీఱుము" అనుచు నొకపాత్రము దీసికొనిపోయి
కోనేటి నీరు దెచ్చి వాని మ్రోల నుంచెను.

ఆయువకుఁడు తలుపు తెఱచునప్పుడే చల్లనిగాలి గదిలోఁ
బ్రసరించి యువకునకుఁ గొంత సొమ్ము దొలఁగుటకు వీలుగలిగెను;
వాని చల్లనిపలుకులు చెవిసోఁకఁగానే బాహ్యతాపముతోడ
వాని యంతస్తాపమును గొంతతొలఁగెను. వాఁడు తెచ్చి యెదుటఁ
బెట్టిన నీటితో నాయువకుఁడు మోమును గాలుసేతులును గడిగి
కొని, పూర్తిగా సొమ్ముదీఱి తొంటిసత్త్వమును బొందెను;
ఆవీరయువకుని బుజ్జగింపులకు సమ్మతించి మితముగ భుజించెను.

తదనంతరము, ఆవీరబాలుఁడు, "మిత్రుఁడా! నీకది క్షేమ
కరమగు ప్రదేశము కాదని యింతకుఁబూర్వమే చెప్పియుం
టిని. ఇప్పటికిని నుందలించెదను. ఈచోటు విడిచి వెలుపలఁ
జేసునంతవఱకు నాయిచ్చచొప్పున మెలఁగుదువని నమ్మెదను.
ఇదిగో! ఈవస్తువులు తొడిగి యీయాభరణములు ధరించి
యిప్పుడే యువతీమణివి కమ్ము; నాప్రాణమిత్రుఁడనఁదగిన నీవు
నాప్రాణేశ్వరివై చూపట్టుము. నీవెట్టి పురుషవరేణ్యుఁడవైనను
ఇప్పటికీ వేసమే వజ్రకవచమై నిన్ను రక్షింపఁగలదు" అని
వస్త్రాభరణములమూట నతనికిచ్చెను. యువకుఁడును, అవ్యాజ
కారుణ్యముతోఁ దనకుపకరింపవచ్చిన యుపకర్తకు మాఱాడక,
వాఁడు చెప్పినటులే వేషము వేసికొనెను.

పిదప, చాళుక్యయువకుఁడా మిత్రునిఁజూచి, నెయ్యుఁ
డా! నీ యకృత్రిమానురాగమునకుఁ బదివేలవందనములు! నీ
యవ్యాజప్రేమాతిశయమునకుఁ బెక్కువేల నమస్కారములు!
ఇఁక నేనేమి సేయవలయునో యానతిమ్ము; నేను, పందనుబోలి
చావునకుఁ బరితపించుట లేదు; కాని, నాయందుఁ బ్రీతియుంచి
నామేలునుద్దేశించి యిట్లు పాటుపడుచున్న నీకు, మనస్సు చిన్న
పుచ్చి వెగటు గలిగింప సాహసింపను. చెప్పుము! మిత్రుఁడా,
నేనెట్లు మెలఁగవలయునని కోరెదవో ధారాళముగఁ జెప్పుము!
నేనటులే నడుచుకొని నీకమందానంద మొనఁగూర్చెదను"
అనెను.

"యౌవనవంతుఁడా! అటులైన సరి; మౌనము వహించి
నాతోడరమ్ము" అని యావీరయువకుఁడు బదులు పలికెను.

"మిత్రమా! నీయాచర్యకుఁ గృతజ్ఞుఁడనై మఱియొక
తడవ వందనములు సమర్పించుటకుఁ బూర్వము నీకారుణ్యము
నకుఁ గారణ మిట్టిదని సూచించి పుణ్యము గట్టుకొందువా?"

"నెయ్యుఁడా! అట్టి కారణమేదియుఁ గన్పట్టదు; సుఖదుః
ఖములు మాఱిమాఱి మానవుల నాశ్రయించుట సర్వసా
ధారణము. కావున, కష్టములకుఁ జిక్కి పరితపించువాని కెవ్వఁడు
తోడ్పడునో, వాఁడు దేవుని దయకుఁ బాత్రుఁడై తాను గష్టము
లనుభవించువేళ నితరులవలన నుపకృతిని బొందును. అది కార
ణముగా, మనుజుఁడు శక్యమైనంత నితరులకు మేలునే చేయు
చుండవలయును; అది యటుండ నిమ్ము; నే నిదివఱకే చెప్పి
యుంటిని; మనము క్షేమప్రదమగు నొకస్థలము చేరునంతదనుక

మానముద్ర వహింపుము. ఇఁక నిందుండి కదలుము" అని వానిని బిలుచుకొని పోయెను.

వారిద్దఱును దిడ్డివాకిలిఁ జేరునప్పటికె మధ్యందినగతుఁడై చండకిరణుఁ డపరదిక్కువంకఁ గొంత యొరగియుండెను. ఉష్ణాతపమునకు భీతిల్లి పక్షినికరము గూళ్లలోను, జెట్లతొఱ్ఱలలోను దాఁగియున్న విధముననే మానవులును దమయిండ్లనుండి వెలికి నిగుడ సాహసింపరైరి. అది వారి కనుకూలవేళయగుటచేత, దిడ్డివాకిలిఁ దెఱచికొని తిన్నఁగా వెలుపలకువచ్చి తొంటివలెఁ దలుపు మూసి, వీధిఁ జేరినప్పుడు వారి నెవ్వరును జూడలేదు.

వారావీధివెంబడినే కొన్నియడుగులు నడచిపోవఁగా నచట గుఱ్ఱముకట్టిన కంచర మొకటి సిద్ధముగనుండెను. యువకు లిరువురు దానియందుఁ గూర్చుండిరి. వెంటనే శకటచోదకుఁ డా బండిని వేగముగాఁ దోలికొనిపోయి యొకహర్మ్యమునొద్ద నిలిపెను. యువకు లిరువు రాకంచరమునుండి దిగి మెఱపు మెఱసి మెయిలు మఱుఁగుఁజొచ్చిన విధమున నాయింటఁదూఱిరి. ఆభవనము, ప్రభువులు నివసింప నర్హమైనదిగాదన్నను, సాధారణముగా నాయిల్లు ధనికులు వసింపఁ దగినదిగానే యుండెను. నాలుగైదంకణములు గల యాయింటిలో నలుగురైదుగురు యువతులు మాత్రమే మెలఁగుచుండిరి. వారాయువకుల నిద్దఱను జూడఁగానే, మిగుల సంభ్రమముతో నెదురేగి పిలుచుకొనివచ్చి యుచితాసనములఁ గూర్చుండఁబెట్టిరి.

వీరయువకుఁ డా చేడెలను జూచి, "చెలులారా! మీరీ యువతీ మణిని రేయి తలచూపునంతవఱకుఁ గనిపెట్టియుండవలయును; నాయందెట్టి యక్కటికము గాన్పించుచుంటిరో యట్టి

ప్రేమనే యీబిడయందును వహింపవలయును. ఈయువతి కడు బడలియున్నది. ఈమె స్నానముసేయుటకు శీతలోదకములు సిద్ధపఱచి పిలుచుకొనిపొండు'' అనెను. వెంటనే, చేడియలు బదులు పలుకక యావీరబాలుని వీడ్కొని, స్నానమునకువలయు నేర్పాటులుచేసి యటకువచ్చిరి. చాళుక్య యువకున కేమియుఁ దోఁచలేదు; జంత్రగాని చేతి కీలుబొమ్మవలె నావీరయువకుని యిష్టానుసారము మెలఁగఁజొచ్చెను. అంత, వాఁడా చేడెలవెంబడిఁబోయి స్నానాగారముఁజేరి తనివిదీఱఁ జల్లనినీట స్నానముచేసి తడియొత్తికొని, వారచ్చట మున్నే సిద్ధపఱచియుంచిన స్త్రీలు ధరించువస్త్రాదులను ధరించి మనోహర మగు తన స్త్రీత్వమునకు మదిలో నచ్చెరువొందుచు వీరయువకుఁడున్నస్థలముఁ జేరెను.

వీరయువకుఁడు, చిఱునవ్వు మోమునకు వింత సొయగమునఁగూర్ప నాయౌవనవంతునిఁజూచి, "నెయ్యుఁడా, బాగు బాగు! నీమనోహర సుందరీ విగ్రహము స్త్రీలనే మోహింపఁజేయుచున్నది. ఇట్టి గారవము నేఁడు వింతగా నీకలవడినందులకు నీవెంతయును గర్వింపవలయును. ఇంక, నీకొఱకు స్వయంవరము చాటించుట యొక్కటే యవశిష్టము. అదియుండనిమ్ము; నేఁడు రేయి పొడసూపునంతవఱకు నీవీయలంకారమునే పూనియుండవలయును; పిదప, సమయమునకుఁ బోలినట్లు చూచుకొందము. ఈస్నానముచేతనే నీబాహ్యాతాప మంతయును దీఱియుండదు; కొంతరసాయనాది పానీయములు త్రావి వడదీఱుము. అటులే, నిన్ను నే నచ్చటనుండి యిటకుఁ బిలుచుకొని వచ్చి చేర్చినంత మాత్రాన ముప్పుదప్పి యంతస్తాపము బొత్తిగఁ దొలఁగిన దనుకొనకుము. ఇదియు నీకు క్షేమకరమైన ప్రదేశముగాదు.

ఇంక, నీవిటనుండియుఁ దొలఁగవలసి యున్నది. యౌవనవంతుఁడా! ఆపదలు ముందువెనుకల సూచనలు లేకయే పిడుగులను బోలి నెత్తిపైఁ బడును. తెలివిగలవా రందులకుఁ జలింపక పుట్టలోని పాములవలె నణఁగియుందురనుట నీకు వింతగాదు. చింతిల్లకు; రేయి కన్పట్టునంతవఱకు నీవిట దాఁగియుండి నాచెలులలోనొక తె తోడఁ బయనమయి, ఆయింతి పిలుచుకొనిపోవు చోటుఁ జేరుము. అచ్చట నారేయిగడిపి మఱునాడు నేనుండు ప్రదేశమును జేరుము. అదియును నీకుఁ దగినచోటు గాదేని మఱియొండెడకు నిన్నంపెదను" అని పేరయువకుఁడు చెప్పి, "మిత్రుఁడ, మఱచిపోవని నమ్మెదను" అనెను.

వాని మోము రెండు నిముసములవఱకు కాపోవక చూచి యాపేరయువకుఁడు పారవశ్యము చెందెను.

యువకుఁడు, "హా! నెయ్యుఁడ, ఏల యిట్లనెదవు? ప్రాణము లున్నంతదనుక నిన్నుఁగాని నీయుపకారమునుగాని విస్మరింపను. ఒకవేళ, నీవు నన్నుమఱచుటకు హేతువులున్నవి. కాఁబట్టి, సర్వదా నేను నీజ్ఞప్తియందుండు నిమిత్తమీ ముద్రయుంగరము నీవ్రేలికిఁ దొడఁగికొనుము" అని తనయుంగరము పీడ్చి పేరయువకున కిచ్చెను.

ఆపేరుఁడు మిగులనాదరముతో నాయుంగరము దీసి, తన వ్రేలికిఁ దొడిఁగి కొని, "మిత్రమా! ఉపకారమును దలఁచి పలుమాఱుఁ బలికితివి. లోకమం దుపకర్తలకుఁ దక్కువలేదు; కృతజ్ఞు లరుదనియే నాయభిమతము" అని చిఱునవ్వుతోఁ బలికి యామాటలకు వానిమెదలో నెట్టియభిప్రాయము తలచూపునో యని తెప్పవాల్పక వాని మోముఁ జూచెను.

యువకుఁ డామాటలకు "వివేకహీనుల నడవడియట్టిది ; వారినిగూర్చి ప్రశంసించుట కిచ్చట ప్రసక్తిలేదే" అనెను.

"ఈయంశము నీయందు నన్వయించుటకుఁ బ్రస్తావింప లేదు ; లోకస్థితినిగూర్చి నుడివితిని" అని వాఁడు బదులుపలికి మిత్రునియొద్ద సెలవు దీసికొని యాచోటుఁ బాసెను. అందున్న చేడెలు, యువతీమణిని మిగుల జాగ్రత్తతో నరయుచుండిరి.

## ఆఱవ ప్రకరణము

## సత్రము : పెద్దిభట్టు.

దినమంతయును బాటుపడిన ప్రాణికోటులు నెమ్మదిగా విశ్రమింపఁగోరి తొలఁగుచున్నాఁడో యన దిననాథుఁ డస్తగిరిఁ జేరెను. సంధ్యారాగముగ్రమ్మి క్రమక్రమముగాఁ దొలఁగుచు రాఁగా, చీఁకటులు నలువలంకుల నావరింపనాగెను. ఆకసము నిండుగ నక్షత్రసముదాయము మెండుకొనెను. ఆఁడువేసమూనిన చాళుక్యయువకుఁడు, తాను దొడగియున్న యుడుపులు వీడ్చి వైచి పాంచాలదేశపుఁ బ్రభు కుమారులుధరించునట్టి దుస్తులను దొడిగికొనెను. నడుమునందొక జలతారు పట్టముఁజుట్టి దానిలో నొక కటారిఁ జెరవికొనెను. అప్పుడు వానిని జూచినవారు, వీఁడు తప్పక మూర్తీభవించిన మన్మథుఁడే యనకమానరు. ఆవేళకు వాఁకిట పల్లకీలు రెండు సిద్ధమైయుండినవి. ఆతరుణమునం దొక చేడియ యతనియొద్దకువచ్చి, "ప్రభుకుమారా! ప్రయాణమగుటకు సిద్ధముగనున్నావు గదా!" అని మందలించెను.

యువకుఁడంత నాయువతి వెంబడి వెలుపలకు వచ్చెను. వారిద్దఱు రెండు పల్లకీలలోఁ గూర్చుండఁగానే, బోయ లాలస్య

ము సేయక యందలము మూపుల పైనిడుకొని వేగముగా నడువఁ జొచ్చిరి. అంతకుమునుపే వారికి గమ్యస్థానము దెలిసియుండెను గనుక, నగరమునకుఁ బశ్చిమోత్తర దిశగా నేర్పడియున్న బాట వెంబడి రమారమి రెండు కోసులు నడిచిరి. వారియానములే కాక, ధనవంతుల పల్లకీలును వర్తకుల కంచరములు మున్నగు నవియుఁ గొన్ని ముందు వెన్కలుగాఁ బోవుచుండెను. ఎదుటి నుండియుఁ గొన్ని యానములు పురాభిముఖములై వచ్చుచుండి నవి. కాలినడకతోఁ బోవుచు వచ్చుచు నున్న జనుల సంఖ్య యును మిక్కుటముగానే యుండెను. ఉత్తర దేశములనుండి రాజ ధానీనగరమైన మాన్యఖేటమును జేరుట కదియే రాదారి యగును. యువతియొక్కయు యువకునియొక్కయుఁ బల్లకీలు గవనును జేరెను. అచట సుంకపుఁ జావడి యొకటి యుండినది.

అందలి యుద్యోగస్థులు, ప్రయాణికులకు రాదారి చీటు లిచ్చుట, సుంకపుధనము రాఁబట్టుట, మున్నగుపనులందు మెలఁగు చుండిరి. పురములోఁ బ్రవేశించువారి విషయమున రాదారి చీటులు కోరుచుండిరి గాని, పురము నిర్గమించి పోవువారి కట్టి నిర్బంధమేమియు లేదు. కావున, యువతీయువకుల మేనాలు గవ నును దాఁటి ధారాళముగా వెలుపలుకుఁబోయి చేరినవి. ఆవిధ ముగాఁ గొంతదవ్వేగి, అచటనున్న సత్రము వాకిట బోయలు తమపల్లకీలు దించిరి.

ఆసత్రాధికారి పెద్దిభట్టు. వాఁడు, ప్రభువులు వచ్చిన యెడల, వారికి వలసియున్నన్ని సౌకర్యము లొనఁగూర్చి, వారిచ్చుధనమును గూడఁబెట్టి కాలక్రమమునఁ గోటీశ్వరుఁ డయ్యెను. వాఁడు ధనవంతుఁడగుట కప్పిపుచ్చి, బీదవానివలెనే

మెలఁగుచుండెను. చేడె పల్లకీదిగి సత్రాధికారి యొద్దకుఁబోయెను; యువకుఁ డాబిడకుఁ గొంత యెడఁగలిగి నిలిచెను. సత్రాధికారి యాచేడె వచ్చుట దెలిసి జాగుసేయక యెదురేగి, "అమ్మా, అమ్మా, రండు, రండు; అమ్మాయి గారెక్కడ" అని కుశల ప్రశ్న పూర్వకముగా స్వాగతము పలికెను.

చేడె—స్వామీ! వారిప్పుడు రారైరి; నేనొక్కతెనే వచ్చియున్నాను. పనిపడినచో వారును వత్తురు. ఈ ప్రభుకుమారునిఁ బిలుచుకొనివచ్చితిని. ఈ రేయియంతయును రేఁపు రేయితల చూపునంతవఱకును వీరిని మీయొద్ద జాగ్రత్తగా నుంచుకొని యేయుపచారములందును గొఱఁత రానీక కనిపెట్టి యుండవల యునని యాజ్ఞయైనది. రేఁపు, మాలో నెవరైనను వచ్చి, వీరిని బిలుచుకొనిపోదుము.

పెద్ది—ఆలాగే, తల్లీ! మీయానతిని శిరసావహించి యితనిని గుండెలలోఁ బెట్టుకొని రక్షించి మరల మీకర్పించెదను.

చేడె—ఔను; మాకుఁదెలియును. కాని, మానఘని భంగపెట్టుటకు సంతరాయములు పలువిధములఁ గనిపెట్టియుం డును. మీకుఁ బనులు మిక్కుటముగఁ గలవు; ప్రమాదము గలుగునేమోయని సందేహించెదను.

యువకుఁడు మహాశూరుఁడు; చేటిపలుకులు విని సామాన్యునివలె నేమియుఁ బలుకక ముసిముసి నవ్వులు నవ్వుచు నిలువఁబడి యుండెను.

పెద్ది—అమ్మా, పనులకేమొ తక్కువలేదు; కాని, మీయాజ్ఞ చిన్నపుచ్చను; అట్లు మెలఁగితినేని రేఁపటికి నన్ను విశ్వసింతురా?

చేడె—సరి, ఇదిగోయని తన నడుమునఁ జెరవికొని యున్న పట్టుసంచి దీసి పిడికిలి నిండుగ మొహరీలు వానిదోసిటఁ బోసి, "అయ్యా, యీపైకము మీ వెచ్చమునకుఁ జాలియుండు నని నమ్మెదను" అనెను.

పెద్ది—తల్లీ, చాలకేమి? మా వెచ్చమునకుఁ గావలసి యున్నంతకంటెఁ బెక్కు రెట్లెక్కువ గానే యున్నది; ఒకవేళ కావలసి వచ్చిన దనుకొనుఁడు; లోపమును సవరించుకొన కుందునా ?

చేడె—"అటు లెన్నఁటికిని జేయరాదు; లోపమను మాట స్మరణకుఁదేకుఁడు" అని మఱియొక పిడికెడు మొహరీలు వాని దోసిటఁబోసి మరలెను. ఆబిడ పల్లకీనెక్కఁగానే బోయలు మోసికొని యెటకో వెళ్లిపోయిరి. యువకుఁ డెక్కివచ్చిన యందలమును గూడఁ దీసికొని వెళ్లిరి.

ఆసత్రమందు విడిసియున్నవారిలో నొకరిద్ద ఱాయువతి వచ్చుటయును సత్రాధికారిచేత బంగారుటంకములు పోయుట యును జూచిరి. ఆబిడ, విలువగల యాభరణములు దొడిగి యుండుటనుగాంచి, ఆజోటి రాజపుత్రికయో, లేక గొప్పధన వంతుని తనూజాతయోయని భావించిరి. కాని, ఆబిడ మెఱపు మెఱసినవిధమున నాచోటుఁబాయుటయుఁ బల్లకీనెక్కుటయు నెవ్వరును గుర్తింపరైరి. ఆసంపన్నురాలితో నాయువకుఁడు వచ్చినవాఁడనియు నెవరికిని దెలియదు.

పిదప, పెద్దిభట్టా యువకునిఁ బిలుచుకొనిపోయి సత్ర ములోని యొకగదిలో బసచూపెను. సత్రమునందు మొదటి మూఁడంకణములలో బ్రయాణికులు క్రిక్కిరియు చుండిరి.

కాని, ఆస్థలమందు జనుల రాకపోకలసందడి యంతగాలేదు. యువకుఁడాగదిలోఁ బ్రవేశింపఁగానే పెద్దిభట్టు, వానిని జూచి, "ప్రభుకుమారా, ఈచోట బుద్ధిని స్తంభింపఁజేయు జనుల కలకలముండదు. ఇందు, మీరు మజ్జనముచేయుటకును భోజనముచేయుటకును శయనించుటకును తగిన వసతి గలదు. విహారమునకుఁ దప్ప మీరీగదిని విడువవలసిన యవసర మేదియులేదు. విహరింపఁ గోరుదురేని మీరీతలుపు తెఱచికొని పోయినయెడల—దొడ్డిలోఁ బెద్దతోఁటయున్నది. అందు కొంతవిహరింపవచ్చును. ఇది మీవంటి ప్రభువుల యుద్యాన వనములను బోలినది కాకున్నను, ఈస్థలమందు దీనినే నందనో ద్యానమనవలయును. మార్గాయాసముదీఱ నీయాసనముపైఁ గొన్నినిముసములు విశ్రమింపుఁడు. మీమజ్జన భోజనముల నిమిత్తము పరిచారకులను బంపెదను" అనిచెప్పి యాచోటు విడిచి వెళ్లెను.

యువకుఁడాగదిలో నొక యాసనముమీఁదఁ గూర్చుండెను. పేరికి గదియేకాని యది మిక్కిలి విశాలమైనది. దాని కిరు ప్రక్కల గవాక్షములుండఁబట్టి గాలి ధారాళముగాఁ బ్రసరించుచుండెను. ఆగదిలో నొకవంక స్నానముచేయుట కనువుగాఁ బలకలుకొట్టి యొకచిన్నగది నిర్మించియుండిరి. మఱియొకవంక భోజనముసేయుట కనువుగాఁ బీఠము లమర్చియుండిరి. గదినాకి లికి దాపుగా మంచమును దానిపై బూరుగుప్రత్తి నింపిన మెత్తయుఁ దలగడలు నుండినవి. మంచముదగ్గఱ రెండువరుసగాఁ డాసనములుండినవి. అందొక యొరుగుడుపీటపై యువకుఁడు గూర్చుండి యించుక మేను చేర్చెను. గోడలందు వరుసగాఁ

జత్రపటములు బిగింపఁబడి యొక్కొక్కదాని కిరుప్రక్కల దీపములు వెలుఁగుచుండినవి. ఆగదికినడుమ, పైకప్పునుండి వ్రేలుచుండిన యిత్తడిగొలుసు తుదిని సెమ్మెయుండెను. దానియందు నలువలంకులఁ బెద్దకళికలతో దీపములు జ్వలించుచుండినవి. కావున, ఆగదిలోఁ బట్టపగటివలె వెలుతురుండబట్టి నేలపైఁ బ్రాఁకులాడు చీమకూడఁ గానవచ్చుచుండెను.

యువకుఁ డాదిన ముదయమునుండి యంతవఱకుఁ దలపించిన సంభవములఁ గొట్టువడి యుండుటచేత మేనిఁజేర్పఁగానే, గవాక్షములనుండియు వాకిలినుండియుఁ జల్లనిగాలి ప్రసరించుచుండుటవలన వానిని నిద్ర గాఢముగఁ గ్రమ్మెను.

"దొరగారు! లెండు, లెండు; స్నానముసేయ లెండు. ఉష్ణోదకములు సిద్ధమైనవి. స్నానముచేయువేళ ధరించుబట్టలను బిమ్మట తొడుగుకొను మడుగులను బల్లెరములం దుంచి యున్నాను" అని యొకసేవకుఁ డఱచి పలికెను; వాని మాటలకు యువకుఁడు మేల్కొనెను.

'సరి, నీవు వెళ్లుము' అని వానిని బంపివేసి యువకుఁడు మజ్జనముచేసి పొడిబట్టలు కట్టికొని భోజనముసేయ సిద్ధమగు నప్పటికిఁ బల్లెరములలో భోజ్యవస్తువులఁ బట్టించుకొని యిరువురు పరిచారకులు వచ్చిరి. యువకుఁడును గూర్చుండి రుచ్యములయిన పదార్థములను మితముగఁ దినిలేచెను.

పరిచారకులాచోటు శుద్ధముచేసి తాము తెచ్చియుంచిన పళ్లెములను బాత్రములను దీసికొని వెళ్లిపోయిరి. యువకుఁడు తొంటి యాసనముఁ జేరెను. అప్పుడు, పెద్దిభట్టు తాంబూలకరండము చేతఁబట్టుకొని యువకునొద్దకు వచ్చి, "దొరగారూ!

మా శాకపాకములు మీకు రుచించినవో రుచింపవో? కడుపు నిండుగ భుజించితిరా? మిమ్ముపచరించుటయందు పరిచారకులు పొరపడిరా? అని యుపచార వాక్యములు పలికెను.

యువకుఁడు, "మాకెందును గొఱఁతలేదు ; మీ సేవకులు మీరుచెప్పినదానికంటె నెక్కువగానే మమ్ముపచరించిరి. మీ శాకపాకములు మిగుల రుచ్యములైనవే" అని మందహాస ముఖుఁడై పలికెను.

"ఔను దొరగారు! మావంటకము చవిచూచు నిమిత్తము, మీవంటి ప్రభుకుమారులు పెక్కుమడల దూరమునుండి యిటకువచ్చెదరు. చెప్పికొనిన నాత్మస్తుతియగునేమో యని జంకెదను. మీరు సెలవిచ్చినటులే మాసత్రము మంచి పేరు సంపాదించి యున్నది."

"సంతోషము! ఇంక మీపనులపైఁ జిత్తము చెల్లింపుఁడు" అని యువకుఁడనఁగా,

"దొరగారు! మఱచితిని. మీకు పాలు పండ్లు పంపెదను. వానితో స్వాదూదకము గూడఁ బంపెదను. మఱి-మఱచితిని—ఔను, జ్ఞప్తివచ్చెను. మిమ్ముఁ గనిపెట్టియుండుటకై యిరువురు విశ్వాసపాత్రులగు భటులను నియమించియున్నాను. వారప్పుడప్పుడువచ్చి మిమ్ముఁ గనుఁగొనుచు మీదాపుననే మసలు చుందురు. ఒకవేళ వారితో నేదైన పనికలిగిన యెడల, 'వెంకా' యని పిలువుఁడు ; వెంటనేవచ్చి పనివిందురు" అని వినయముతోఁ బలికి, "దేవరా, సెలవా ?" అనెను.

వాఁడా చోటువిడిచి వెళ్లుటె పదివేలని తలఁచియున్న యువకుఁడు, తలయూచెను.

అటుపిమ్మట యువకుఁడేమో యాలోచించుచుండి తన చూపును గోడలయందున్న పటములవంకకు మరల్చెను. భారత వీరుల రూపము లందుఁ జిత్రింపఁబడి యుండినవి. వాఁడు చూచిన పటమందు, 'కౌరవులు క్రొత్తగా నిర్మించిన సభను జూచునిమిత్తము విదురుఁడు పాండవులను బిలుచుకొనివచ్చుట' చిత్రితమై యుండెను. దానిని జూడఁగానే, 'నిత్యవర్షుఁడు పూజ్యుఁడైన నాగ మయ్యాదండనాథునిఁ బంపి, తన్ను మాన్యఖేటమునకు రావించిన సంగతి జ్ఞప్తివచ్చెను.

వెంటనే వానిదృష్టి, ప్రక్కననున్న పటముపైఁ బ్రసరించెను. అందు, ధర్మరాజు శకునితో జూదమాడి జితుఁడై తల వంచుకొనికూర్చుండుటయును, ఆతనితమ్ములు నిస్తేజులై యాక సమువంకఁజూచుచుండుటయును జిత్రింపఁబడియుండెను. అప్పుడు తాను నిత్యవర్షుని మాయా వాగురకుఁ జిక్కి తేజమునకు భంగపడుట మనస్సునకురాఁగా, వక్రశీలమైన కాలగతికి వాఁడు మిక్కుటముగ వగచి, చూపును వేఱొక పటముపై నిగిడ్చెను.

ఆ పటమందు, ద్రౌపది వికీర్ణకేశపాశయై దీనవదనయై నిలిచియుండెను. కురువృద్ధులు తలలువంచి యుండిరి. దుర్యోధనాది దుష్టచతుష్టయము సంతోషాయత్తచిత్తముతో ద్రౌపది వంకఁ జూచుచుండెను. ధర్మజార్జున నకుల సహదేవులు నిర్వాణ పాటొంది మిన్నకుండిరి. భీమసేనుఁడు కోప దుర్నిరీక్ష్యుఁడై దుర్యోధన దుశ్శాసనులవంక నుగ్రముగాఁ జూచుచుండెను. దానిని గాంచినప్పుడు యువకుఁడు వెఱ్ఱివానివలె, "భీమసేన ! పాండవులలో నీవొక్కఁడవే శూరుఁడవు ; అక్కటా ! నాఁడు నీశౌర్యము ధర్మజునిచేత దూష్యమైనది ; నేఁడు నా శౌర్యము

దుర్విధిచేత నింద్యమైనది. మనము శూరులుగా జన్మించి యేమి ప్రయోజనము ?" అని నోరు తెఱచి పలికెను.

"ఈశ్వరానుగ్రహమునఁ బాండవులు శత్రువుల నిర్మూలించి కష్టములనుండి గట్టెక్కిరి ; అయితే, దేవుని దయయున్న నేనును, ఈరాష్ట్రకూట రాజవంశమును నిర్మూలించు కాలమొకటి తటస్థింపవచ్చును. కావుననే యిన్నిబన్నములకుఁజిక్కియు మరణమొల్లకున్నాను. నేనా యుద్యానహార్మ్యపరిభాగమున నిలిచియుండి, దీనదశకుఁజిక్కి యవరోధప్రదేశమందు దిడుమలొందుచున్న నిన్ను, నిత్యోత్కర్షహాతకుఁడా! నిన్నే—చూచి యానందించు దినమొకటి రాకతప్పదు. ఆ దినము నాజీవితకాలమందు సుదినమే యగును" అని హార్మ్యపరిభాగము స్మరించునపుడు, నాఁడు దర్శించిన సుందరయువతీవిగ్రహము, వానికట్టెదుటఁబొడకట్టినట్టు లయ్యెను. అంత వాఁడు, "హా! ప్రేయసీ! నిన్ను వలచితిని. నావలపు పవిత్రమైన దనుటకు నాహృదయమే ప్రమాణము. అటులుండియును, నాగర్భశత్రువులవంశమునఁ బుట్టితివే యని వగచెదను. నిన్నుఁ బరిణయమైతిని పో! నీపెద్దలకు మారకుఁడయిన నాయందు నీప్రణయము స్థిరముగా నెట్లు నిలువఁగలదు?" అని యున్మత్తుని వలెఁ బలికెను.

మఱియొక పటమునందు, బృహన్నల యుత్తరకు నర్తనము నేర్పుచుండుట చిత్రింపఁబడి యుండెను. దానిని జూచి యువకుఁడు వెఱ్ఱివాని వలెనే పక పక నవ్వెను. ఓ పూజ్యుఁడైన యర్జునుఁడా! నీవు నాకులమునకు మూలపురుషుఁడవు; కాఁబట్టి, నీవనుభవించిన బన్నము లన్నియును నన్నాశ్రయించినవి. నీవొక

యేఁడు నపుంసకుఁడ నైతివి; నేనొక దినము స్త్రీనైతిని; ఇంతయే మనలోని తారతమ్యము" అని చెప్పికొనెను.

తదనంతరము, వానిహృదయము పలువిధముల వగలకుఁ జిక్కి చెల్లాచెదరులయ్యెను. పెద్దిభట్టుపరిచారకుఁడు పాలు పండ్లు స్వాదూదక కలశముదెచ్చి యుంచుట వానికిఁ దెలియదు. ఆవేళకు రేయి పదునొకండు గంటలయ్యెను. మిక్కుటమయిన చింతచే వాఁడేమిచేయుటకును దోఁచక శయ్యపైఁ బరుండి నిదురింప వలయునని కోరెను. పడకపైఁ బొర్లిపొర్లి యొకగంటవఱకు నిదురకై ప్రయత్నించెను గాని, చిత్తము చెదరి యుండఁబట్టి వానికి నిద్ర పట్టదయ్యెను. పురిపోనితలంపు లొక్కుమ్మడి చిత్తమును వెతకొలుపు చుండుటచే పరుండనొల్లక లేచి వెలుపలకు వచ్చి, గదితలుపు మూసియుంచి వీధివంకకుఁ బోవఁదలఁచెను. మొదటి రెండంకణములందు దీపములు బాగుగా వెలుఁగుచుండినవి. జనుల కలకలమణఁగలేదు. అచ్చట బసచేసినవారందఱొకరితో నొకరు సంభాషించు చుండిరి. వారి సంభాషణలు వినుటచేతనైనను దన చిత్తమునకు స్వాస్థ్యము గలుగునేమో యని యువకుఁ డావైపునకుఁ బోయెను.

---

## ఏడవ ప్రకరణము

## ఒక సుందరి

యువకుఁడు, సత్రములోని రెండవ యంకణముఁ జేరెను. ప్రయాణికులచట భోజనపుఁబనులు దీర్చుకొని తమ మూటముల్లెల దగ్గఱనుంచుకొని వానిపై మేనులు సేర్చి, నిద్రపట్టకుండుటకై సంభాషించుచుండిరి. యువకుఁడు వారికి సమీపమునఁ

గూర్చుండెను. వారు, వాణిజ్యమునకై పలుదేశములనుండి యటకువచ్చి యున్నారనుట వారి వేషభాషలచేతనే యువకునకు స్పష్టమగుచుండెను. వర్తకము నిమిత్తము పరదేశములకుఁ బోవునట్టి రట్టపాడివర్తకులు సైత మచ్చటనుండిరి. వారు, గుంపులు గుంపులుగఁగూర్చుండి మాటలాడుచుండఁగా, వారి సల్లాపములవంక యువకుని దృష్టి చెల్లెను.

మొదటివాఁడు—ఔనయ్యా, అతఁడు శూరుఁడే! ఎన్నియుండి యేమి? తన యూరిని ముదుసలి తండ్రిని విడిచి యెన్నాళ్లు ప్రవాసము సేయుట? ఇది రాజపుత్ర లక్షణమా?

రెండవవాఁడు—ఎవరయ్యా, మీరు కల్యాణనగరము వారని తోఁచుచున్నది; కాఁబట్టియే మీరతనిపై నిట్లు నింద మోఁపెదరు. అతఁడిక్కడ నున్న కదా నగరమునకు మరలును?

మొదటివాఁడు—మాయువరాజు, ఈ మాన్యఖేటమందే యున్నాఁడు. ఇప్పుడిక్కడనే యున్నాఁడు.—

ఆమాటలకు యువకుఁడు, "హా, వీఁడు నన్నుఁ గని పెట్టెనా?" అని యులికిపడెను. అంతలో వాఁడు—మీచక్రవర్తి గారి నగరునందే యున్నాఁడు; నాగమయ్య వానిని బిలుచుకొని పోయినపుడు నేను కల్యాణపురమందే యుంటిని.

మూఁడవవాఁడు—మీయువరాజు స్వర్గము పరిపాలింప నేగెనని నేఁడే కర్ణాకర్ణి వింటిని; ఇది పరమ రహస్యము

రెండవవాఁడు—ఇదేమి రహస్యము? చక్రవర్తి మొన్న వైదికులకు దండన విధించినప్పుడు, వారి కాధారభూతుఁడు చాళుక్యయువకుఁడని, వానిని గడఁదేర్ప నాజ్ఞపాలించుట యందఱకును విదితమే—

నాల్గవవాఁడు—ఛీ, ఛీ, ఇదెట్టి కుత్సితపుఁబని? రాజులకు మతద్వేషము తగదు. కాఁబట్టియే మా హర్షదేవమహారాజు ఖొట్టిగుఁడనిన నుండిపడును. మీరును జూతురు గదా! ఎన్నఁడో—మా రాజుకోపాగ్నికి మీరాజు శలభాయమానుఁడగును.

మొదటివాఁడు—"అక్కటా, ఏమిదుర్వార్త, ఏమిదుర్వార్త! మాయువరాజు హత్యాసక్తునకుఁజిక్కి కాలగతినొందెనా? ఇంక మావృద్ధరాజు గతి యేమి? ఈ సంగతి విన్నచో నతఁడు దుఃఖముచేత పొగిలిపొగిలి జీవముల విడుచునే; పిమ్మట రాజ్యము గతియేమి?

నాల్గవవాఁడు—ఔను, మీరాజపుత్రుఁ డొక్కఁడే కాఁడు; ఈచక్రవర్తి, దూరదృష్టిలేక తనసామంతులనే క్షీణింపఁజేసి తుదకుఁదాను నాశ మొందనున్నాఁడు. నొలంబవాడిరాజుతో మొన్న మొన్న దారుణముగాఁ బోరుసలిపి యతని నణఁగఁద్రొక్కి—తన్మూలమునఁ దానును బలహీనుఁడయ్యెను. వేఁగినాఁటిని బరిపాలించుచున్న దానార్ణవుని కుటుంబములో భేదము గల్పించెను. ప్రకృతము వేఁగిరాజ్యము దానార్ణవునిపేరఁ బాలింపఁబడుచున్నదిగాని యతఁడు, ఆ మండలమందుఁ గానవచ్చుటలేదని వినికి. ఇప్పుడు దానార్ణవుని పెద్దకొడుకు చాళుక్యచంద్రుఁడు (శక్తివర్మ) యెటనున్నాఁడో యెవరికిని దెలియదు; రెండవకొడుకు విమలాదిత్యుఁడు దేశము విడిచి పాఱిపోయి చోళరాజ్యమును జేరియున్నాఁడని దెలియుచున్నది. సింధుదేశము రాజును కళింగదేశము రాజునుదప్ప ఖొట్టిగునకు మిత్రుఁడనువాఁడు రాజమండలమునందెవ్వఁడును లేఁడు. అయ్యో, సంస్థానపుమాటలు మన కేల?

ఆ సత్రపుఁ బరిచారకుఁ డదివఱకచ్చట నిలిచి వారి మాటలు శ్రద్ధతో వినుచుండెను. అప్పుడు, తాను మాటాడ వలసిన వంతు వచ్చినదని దెలిసి, "అయ్యా, కళింగాధిపతియైన వృద్ధరాజు కూఁతురితో నిచ్చటనే యున్నాఁడు" అనెను.

ఇంతదనుక నోర్పుతో వారిమాటలు వినుచుండిన యువకుఁడు పరిచారకునిఁజూచి, "ఆవృద్ధ రాజీ సత్రమందు వసించుట కేమికారణము?" అని ప్రశ్నించెను.

"అయ్యా, అతఁడు వృద్ధుఁడు కదా! జరాభారము; దానికిఁదోడు దౌర్బల్యము. ఇచ్చట, తోఁటలోని బావి నీరు అమృతము వంటిది. ఈ నీట స్నానముసేయుచు దీనినే పానము సేయుచువచ్చిన నే మందుమాఁకులతోఁ బనిలేక యారోగ్య మొనఁగూడును. దీనితో మానక యతనికి మంచి చికిత్సయును జరుగుచున్నది. కళింగరాజు, ఇటకు వచ్చి రెండు నెల లయ్యెను. ఇంకను బది పదునైదు దినము లిచ్చటనే యుండి తనదేశము నకు వెళ్లిపోవును'' అని యా పరిచారకుఁడు చెప్పెను.

అట్టియెడనన మొదటి యంకణమందు, "దొంగ దొంగ" యని, పెనుసవ్వడి లేచెను. అందున్న జనులు కలఁతనొంది పలు విధముల ఘోషిల్లిరి. రెండవ యంకణమందు మాటలాడు చుండిన జనులలోఁ గొందఱు తొందరఁగా నటకుఁ బరుగిడిరి; కొందఱచటనుంచిన మూటలకుఁ గావలియుండిరి. దొంగను గనుఁ గొనుటకుఁ బోయిన వారితో యువకుఁడును వెళ్లెను. అందలి కలవరమునకుఁ గారణభూతుఁడయిన దొంగ నెవ్వరును గనిపెట్ట రైరి. కొంతసేపు గడచి వారిగుండెల యదు రించుక యణఁగఁ గానే, "దొంగ యిచ్చటనే తిరుగులాడుచుండి యెవ్వరి ముల్లెనో

దోఁచుకొని మెఱపుమెఱసిన విధమున వీధితలుపు దెఱచికొని పాఱి పోయె" నను కొనిరి. పోల్చుకొని చూచునప్పు డెవ్వరి ముల్లెయు దోఁపిడి వోవలే దని తెలియ వచ్చినది; కాని, సింహ ద్వారము దెఱవఁబడి యుండుట దొంగ పాఱిపోవుటకుఁ బ్రబల సాక్ష్యమైనది. కొందఱు వెలుపలకుఁ బోయి చూచిరి. వెన్నెల పిండి వెదచల్లినట్లు గాయుచుండెను. వీధిలో నే మానవుని జాడ యుఁ గన్పట్టలేదు. పిమ్మట, వారు కొంత వఱ కావల కీవలకుఁ దిరుఁగులాడిరి. దొంగ గానరాఁడయ్యెను; అంత సత్రములోని కంఠఱును మరలిరి.

యువకుఁడు వినిన సంభాషణలచేత నదివఱకు వాని మనస్సును బెల్లుగఁ బ్రతిబాధించుచుండిన సందియములుగొన్ని తొలఁగెను; హృదయ భారము తగ్గెను; ఆ వేళకు రేయి రెండు జాములుగడిచి మూఁడవజాము ప్రారంభించెను.

యువకుఁడు శయ్యనుజేరి పరుండెను. నిద్ర, వాని యింద్రియముల నన్నిఁటిని సంపూర్ణముగఁ దనలో నైక్యము చేసి కొనెను. కాని, వానియెఱుక యించుమించుగ వాని యధీన మందే యుండినది; గాఢ సుప్తిలో నింకను మగ్నము చెంద లేదు. ఒక్క సుందరి! కాదు, సుందరుఁడు! ఎప్పుడో తాను జూచియున్న యాకృతి; మెల్లఁగ గదితలుపు దెఱచికొని లోనికిఁ జొచ్చెను. ఆ గదిలో దీపము లన్నియు నార్పఁ బడి యొక్క దీపము మాత్రము వెలుఁగుచుండెను. అదియును మినుకు మినుకు మని మసకగా నుండుచుండెను. లోపలఁజొచ్చిన వ్యక్తి యాదివ్వె నెగఁద్రోసి దాని మొననున్న చిట్టెముఁ జిదిమివైచెను. అంత, వానిమోము నే రెండునిముసములదాఁకఁ జూచెను; పార

వశ్యమొంది తమి నణఁచలేక, అడుగుల సవ్వడి గలిగింపక నడిచి దాపునకువచ్చి యొప్పులకుప్పవలెఁ బ్రక్కనఁ గూర్చుండెను. "ప్రాణేశా! నిన్నుఁ బరిణయమాడు నింతియొక్క భాగ్యమే భాగ్యము! ఆభాగ్యము నన్నుఁజెందునటు లనుగ్రహింపుము" అని శ్రావ్యమైనకంఠధ్వనితో మెల్లఁగ మృదుమధురములయిన పలుకులు విస్పష్టముగఁ బలుకుచునే తన వ్రేలియం దున్న యుంగరము దీసి వాని చిటికెనవ్రేలఁ జొన్పెను. తనకేలుదమ్మి వానిముఖముపై నిడెను. జీవ్వున లేచెను; మాయమయ్యెను. ఇన్ని సంభవముల కైదునిముసములకంటె నెక్కువ కాలము పట్టలేదు.

ఆవేళకు యువకునియొక్క, గాఢసుషుప్తికిలోనుగాక జాగ్రదవస్థకు మరలెను; కన్నులుదెఱచి నలుప్రక్కలఁ జూచెను; కాంత కనఁబడలేదు; ఇది స్వప్నము; తప్పక యిది స్వప్నమే" అనుకొనెను. దీపము తొంటికంటె బాగుగా వెలుఁగుచుండుట యును, గది తలుపించుక తెఱవఁబడి యుండుటయును స్వప్నము గాదనుటకు సాక్ష్యములైనవి. జ్ఞప్తిరాఁగా వ్రేలినిజూచికొనెను. ఉంగరమున్నది; విస్పష్టముగ దానిమాట లింకను వినవచ్చు నట్లే యుండినవి. వాఁడెట్లు స్వప్న మని నమ్మును? తటాలునఁ బడకనుండి లేచి వెలుపలకు వచ్చి చూచెను. ఎవ్వరును గనఁబడరైరి. సత్రమునం దంతటను దొంటివలె లేక కొంత సద్దణఁగి యుండెను.

యువకుఁడేమియును దోఁచక సెజ్జనుజేరి మేనువ్రాల్చెను. వెంటనే వానిని గాఢనిద్ర క్రమ్మెను. ఇరువదిముప్పది నిముసములకాలము గడచెను. ఒకఁడు గది తలుపును తెఱచి కొని

లోఁపలఁదూఱి, "దొరా, దొరా!" అని కేకలువేసెను. ఆ కూఁతలకుయువకుఁడులేచి, "ఎవఁడురా?" అని గొంతిచ్చెను.

"దేవరా! నేనే యెంకణ్ణి, మీగ్గానే గత్తు తిరుగుతూ యచ్చరింతామని వత్తిని" అనెను.

యువకునకు పెద్దిభట్టు చెప్పినమాటలు జ్ఞప్తివచ్చెను. వాఁడు, పకపకనవ్వి, "ఓరీ! దొంగలుపడిన యాఱునెలలకా నీరాయిడి" అనెను.

అందుల కాభటుఁడు, "సామీ, మాముంగల దొంగ యవరండి? సంపేయం! మేమీాణ్ణి యందర్నీ సూసుంటాం సామీ! మాపేరంటే యడల్తారు దొరా!"

"సరి, నీవిక్కడనే యిందాఁక కనిపెట్టుకొని యుంటివా?"

"ఆఁ–దేవరా–అట్లే,

"అటులైన నెవరైన నింతకుఁబూర్వ మీా గదిలోఁ జొచ్చిరా?"

"అట్టా మాకు తెలవక దూరేవాళ్లెవరుంటారు సామీ! సంపి బలిపెట్టం?"

సరిసరి, నీవు శూరుఁడవే; వెళ్లుము" అని, యువకుఁడు వానిని బంపివేసి దిట్టముగఁ దలుపు మూసియుంచి పరుండెను.

బాలభాస్కరుఁడు, తన కిరణజాలముల నాగది గవాక్షములసందులనుండి యువకుని మోముఁదమ్మిపైఁ బ్రసరింపఁ జేసెను. వాఁడు శయ్యనుండిలేచి యందాఁకఁ దాను నిదురించుటకుఁ బెల్లుగ లజ్జించెను.

———

# ఎనిమిదవ ప్రకరణము

## గాఢ ప్రణయము

యువకుఁడు తననిద్రనుగూర్చి పెల్లుగ లజ్జించుచు సెజ్జనుండిలేచి, దొడ్డిలోనికిఁ బోయెను. అందుఁ బలు విధములైన ఫలవృక్షములును లతాగృహములును, వాని లోవైపునఁ జంద్రకాంత శిలావినిర్మిత వేదికలును పద్మాకరములును నడబావులును వెలయుచుండినవి. ఎట్టి యాధిగ్రస్తునకుఁగాని యాతోఁట చేతము చల్లఁజేయు నందనోద్యానమై కన్పట్టును. యువకుఁడాతోఁట దన యహర్ముఖోచిత కృత్యములను దీర్చికొని గది వంకకు మరలెను. అంతలో పెద్దిభట్టు పరిచారకులు మజ్జనమునకు వలయు వానిని సిద్ధపఱచిరి. యువకుఁడు స్నానముచేసి, తొలిదినము తాను దొడిగియుండిన పాంచాలదేశపుజనుని దుస్తులు ధరించెను. తనహృదయతాపముదీఱ కొంతసేపు లతాగృహములో మసలి వత్తమని యందుండిలేచి తోఁటలోనికిఁ బోయెను. ఆవేళకుఁ పదునెనిమిది గడియలేమై యున్నప్పటికి నెండవేడిమి కొంచెమెక్కువగానే యుండెను.

యువకుఁ డొక తీవయిల్లుచొచ్చి యందున్న తిన్నెపైఁ గూర్చుండెను. వాఁడెన్నివిధముల సమాధానము దెచ్చికొని చిత్తమునఁ జింతలకుఁ జోటీక తట్టినైచుచు వచ్చినను, అవి తమంతటఁ దోతెంచి వానిమనస్సును వెతగొల్పఁ జొచ్చెను. వాఁడు కూర్చుండనోల్లక లేచి యా లతాగృహమందే యిటు నటు దిరుగుచుండఁగాఁ బార్శ్వమందున్న తీవచప్పరమున నెవరో గుసగుసమని మాటలాడు సవ్వడి వినవచ్చెను.

తానున్నచోటునకుఁ జుట్టు ప్రక్కలఁ దీవలు దట్టముగ నల్లుకొని తెరవాల్చినటులున్నందున నావైపుననున్న వారికిఁ దన యునికి మెలఁకువఁ దెలియకున్నను, ఆకుల సందులనుండి వారిని దానుజూచుటకు వీలుండెను. అదివఱకు వారు రహస్యముగా మంతనము లాడుచుండి, తుదకుఁ గొంచెము బిగ్గరగా మాటాడ మొదలిడిరి. కావున యువకుఁడు వారివంకఁ జూచెను.

ఒక సుందరీమణి యొక యౌవనవంతునితో నేకాంత గోష్ఠి సలుపుచుండెను. ఆ యౌవనవంతుఁడు సౌందర్యమునం దాయువతికి వెనుఁదీసిన వాఁడు కాఁడు. అంతేకాక, వానియం దుత్తమశూరలక్షణములు పెక్కులు గానవచ్చుచుండినవి. వారిని జూడఁగానే, "ఈశ్వరుని సర్వజ్ఞుఁడందురే యదిసత్యము; ఆ యువకునకుఁ దగిన స్త్రీ యువతియు సృజింపఁబడి యున్నది. వీరి దాంపత్యమునకే భంగము గలుగకుండవలయును" అని యనుకొనెను.

సుందరి—ఔను; నాతండ్రిగారిని నేఁడు మంగలిం పుఁడు. మీరీవిషయమై వారిని దప్పక మంగలించి తీరవలయును. మేము దేశమునకువెళ్లిన పిదప మనమొండొరులను సందర్శింప వీలుగలుగదు.

పురుషుఁడు—ఏల వీలులేదు? ఇప్పటివలెనే నీచిత్తము ప్రసన్నత నొందియున్నఁజాలును; ఎప్పటికైనను మనమొండొరు లను సందర్శింప వచ్చును.

అడుగుటవలన దోసమేమి?

అది సరికాదు; ప్రకృతము నేనుండఁ దగినస్థితిలో లేను. ఇఁకఁ గొన్నాళ్లలో నాపదవికి రానర్హుఁ డగుదును.

అందాఁక నోర్చియుండుము. కాంతా, నీవు నాహృదయము హరిం
చితివి. నాకుఁ బ్రత్యేకహృదయ మొకటి యున్న నేకదా మఱి
యొక తెను వరింతును ? నీ కట్టి శంక వలదు.

మీరు నన్నుఁ బరిణయము చేసికొనుఁడు ; మీరు
పొందఁగోరు పదవికంటెఁ బదివేల రెట్లెక్కువ పదవి మిమ్మా
శ్రయింపఁ గలదు.

“ఓ వెఱ్ఱిపడుచా! ఆత్ర మేల ? నేను నీవాఁడను ; నీవు
నాప్రాణధనమవు” అని ప్రమాణపూర్వకముగఁ జెప్పెదను.
కొన్నాళ్లోర్చి యుండుము. అనుకూల సమయము సమీపించు
చునే యున్నది. తొందరపడకు.

యువకుఁడు—హా, ఇదేమి దుష్కార్యము ! పొంచి
యుండి యితరుల మంతనములు వినుట మిగులఁ బాపకార్యము.
వీరి సల్లాపములు వినునట్లు నాకేల తటస్థించెను ? ” అని
యాచోటుఁబాసి గదిని జేరెను.

వాఁడు గదిని జేరఁగానే పెద్దిభట్టు పంపిన భోజన పదార్థ
ములను దీసికొని పరిచారకులటకువచ్చిరి. యువకుఁడు భోజనము
సేయఁ బీటపైఁ గూరుచుండెను. పరిచారకుఁడొకడుఁ వడ్డించుచు
నొదిగి నిలిచియుండెను. యువకుఁడు వానిని జూచి, “అయ్యా,
నన్నొకతడవకుఁ గనిపించు కొనవలయునని నీయజమానునితోఁ
జెప్పెదవా ?” అనెను. వాఁడు దిగులుపడి, “దేవరా, నే నే
యపరాధముఁ జేయనే! ఏదైన లోపమున్న సెలవిండు; సవ
రించు కొనెదను” అనెను.

ఆ మాటలకు యువకుఁడు ముసిముసి నవ్వుతోఁ బరి
చారకునిఁ జూచి, “అయ్యా! నీవెట్టి యపరాధమును జేయవు ;

నిన్ను గుఱించి చెప్పవలసిన ప్రసక్తియును లేదు; భయపడకుము. నేనిచట నుండి వెడలిపోవుటకుఁ బూర్వ మతనితో మాటాడ వలసి యున్నది. కనుక నన్నుఁ జూచునట్లు చెప్పుము" అనెను.

యువకుఁడు భుజించి లేచెను. పరిచారకులును దమపనులు దీర్చుకొని గదినుండి వెళ్ళిపోయిరి. పిమ్మట, వాఁడొక యాసనముపైఁ గూర్చుండి పలువిధములయిన యాలోచనలకుఁ జిత్తమాయత్త పఱచి యుండెను. ఎంతసేపు వాఁ డాలోచించు చుండెనో వానికే తెలియదు. పెద్దిభట్టు వచ్చి దాపున గొన్ని నిముసములు నిలిచి యుండుటయును వాని స్ఫురణకు రాలేదు. తుదకా సత్రాధికారి విసుఁగొంది, "ప్రభుకుమారా!" అని మందలించినప్పుడు వాఁ డులికిపడి వాని వైపునకుఁ దిరిగి చూచెను. అంత, వాఁ డాలోచన నుండి ప్రకృతాంశమునకు మనస్సు త్రిప్పి, "అయ్యా! రండు, కూర్చుండుఁడు" అని గౌర వించి తనకు సమీపమునందున్న యాసనముపైఁ గూర్చుండఁ బెట్టుకొనెను. పెద్దిభట్టు తన వినమ్రత ప్రకాశించునట్లు, ఓరగిలి యా పీఠముపైఁ గూర్చుండి తన దృష్టి యా ప్రభుకుమారుని ముఖముపై నిలిపి యుండెను.

యువకుఁడు—పెద్దిభట్టుగారు! నేను గొన్ని సీమలు దిరిగి యచ్చటచ్చట నున్న సత్రములందు బసచేసి యున్నాను. కాని, ఇచ్చట మీసత్రమం దున్న వసతి యెచ్చటను లేదు; మూర్ధాభిషిక్తులగు ప్రభువులును సామంతరాజులును వసించు టకు, మీసత్రమునంటిది యెచ్చటను గాన్పించదు.

పెద్దిభట్టు—ఔను దేవరా! తమవంటి ప్రభువుల యాదరము దీనికిఁ గలదు.

యువకుఁడు—అటులయిన ప్రభువుల మన్ననల కర్హు లయిన మీరు నొక ప్రభువే యని నమ్మెదను.

పెద్దిభట్టు—హా, హా! దేవరా! అంతటి ప్రశంసకుఁదగను. నేనెన్నఁటికిని దమవంటి ప్రభువులకు సేవకుఁడను. మీరు కాలి తోఁజూపు పనిని దలతోఁ జేయుచుందును.

యువ—ఔను, మీ వేషమువలెనే మాటలును మీ యుడఁకువను వెల్లడించుచున్నవి. మిమ్ముఁ బ్రభువనుటచేతఁ బొరపాటు లేదు; ఈసంగతి యుండనిండు. ఒకవేళ మూర్ధాభిషిక్తులిచటకు వత్తు రనుకొందము......వారికిని వారిపరివారము వారికిని వసతి గలుగుచున్నదని యనుకొందము. వారితో వచ్చియున్న సైన్యములకు విడిదిచూపి వస్తు సామగ్రులు సిద్ధము సేయుట మీకశక్యమే కద!

పెద్ది—ప్రభుకుమారా, అంత లాఘవపఱచి చెప్పఁదగదు! నా సామర్థ్యమునుగూర్చి నేనే యుగ్గడింపరాదు; ఇరువది వేలభటులున్నను వసతులేర్పఱచి యొందును గొఱఁతరానట్లు చూచు కొనఁగలను.

తన యుద్దేశము గొనసాగించు కొనుటయందు పెద్దిభట్టు, ముఖ్యపరికరముగ నేర్పఁడగలఁడని యువకుఁడు నమ్మెను. వానికిఁ దెలుపకయే తనకోరిక కొనసాగించుకొనఁ గోరి యా ప్రస్తావ మంతటితో విరమించి, "అయ్యా, ఏమో చెప్పఁ బోయి యేదో యొక ప్రస్తావమునకుఁ దిగితిమి; ఇదివఱకెందఱో ప్రభువులు మీవలన నుపకృతిపొంది యుందురనుట నిశ్చయము.

పెద్ది—దేవరా, నిజము పలికితిరి. చెప్పకొన్న నాత్మస్తుతి యగును; ప్రతిసంవత్సరము సామంతరాజ సమావేశమునకు విచ్చేయు ప్రభువులలో ననేకు లిచ్చటనే బసచేసెదరు.

యువ—ఔను, అట్టివారిలో నెవడును మిమ్ముఁ దగినట్లు సమ్మానించి యుండఁడని దృఢముగఁ జెప్పఁగలను.

పెద్ది—దేవరా, అటు లారాజుల యుపకృతిని విస్మరించి పలుకరాదు. ఏదో, యథోచితము సత్కరించియే యున్నారు.

యువ—అట్టి యల్పసత్కారములతోఁ దీఱునట్టిదా కృతజ్ఞత! అది యుండనిండు; నేఁటి రేయి నేనీచోటువిడిచి వెళ్లెదను; వెళ్లినప్పటికిని నే నీప్రాంతములందే కొన్నాళ్లదనుక మసలుచుందును. మీరు, రేపు తెల్లవాఱుటకుమున్నే కల్యాణనగరమునుగూర్చి పయనము సేయవలయును. అచ్చట, నాయంతరంగ మిత్రుఁడున్నాఁడు. ఆతని పేరి కొక యుత్తర మిచ్చెదను. అతఁడు కమ్మనుజదువఁగానే మిమ్ము సత్కరింపఁగలఁడు. మీ రా సత్కారముచేత నాకృతజ్ఞత యింతటి దని కనుఁగొనఁ గలరు.

పెద్ది—దేవరా, మీయనుగ్రహమునకుఁ బదివేల వందనములు! నేనీస్థలమువిడిచి యొకక్షణమైనను దొలఁగి యుండలేనే యని చింతిల్లెదను. ఏమిచేయుదును? మీయానతిని నిరాకరింప లేను. మీరు సెలవిచ్చినట్లు కమ్మనిండు; విశ్వాసపాత్రుఁడయిన భటుని పంపెదను.

యువ—అయ్యా, అదిసరికాదు; అట్టిచేఁత యెంతమాత్రము తగదు. నేను మిమ్మొక ఘనునొద్దకంపెదను. ఆతఁడొకవర్తకుఁడు; సామ్రాజ్యములను వెలకుఁ దీయునంతటి ధనికుఁడు. ఆతని సందర్శనము మీకత్యావశ్యకము. ఇట్టి గొప్పకార్యము

లందు మీారన్యులను నిర్ణయించుట పొరపాటు. ఇందు ముఖ్య ముగ భావింపవలసిన యంశములు రెండున్నవి. అందు మొద టిది-మీా రా పత్రికునివలన నమిత ధనమును బొందుచున్నారు; అన్యుల కెట్టివారికది తెలియరానట్లు మెలఁగి కార్యము సాధిం చుకొనవలయును. రెండవది-అట్టిగొప్పస్థితికిఁ దేఁగలుగుకన్నను బదిలముగఁ దీసికొనిపోయి, చేర్పఁదగిన వానికిఁ జేరునట్లు సేయ వలయును. ఈరెంటిని సమర్థింపవలసి వచ్చినప్పుడు, అన్యులు తగరనుట స్పష్టమే కద!

పెద్ది—చిత్తము దేవరా! తమయిచ్చచొప్పుననే మెలఁగె దను. ఇక్కడకు దాపుననేయున్న కల్యాణికివెళ్లి వచ్చుట ఘన కార్యముగాదు. ఒకవారము దినములలోఁ బని పూర్తిచేసికొని రాఁగలను. అంతవఱకు సత్రపుఁబనులు నిర్వహించుటకు సేవ కులున్నారు. నేనచటకు వెళ్లుటయు మరలి వచ్చుటయు నతి రహ స్యముగ జరిపెదను.

యువకుఁ డతనిపలుకులకు సంతసిల్లి యొకతాటియాకు ముక్కపై జిలుగక్షరములతో రెండుమూఁడు పంక్తులు వ్రాసి, వానిచేతికిచ్చి, తనమిత్రుని యంగమచ్చము మున్నగు వానిని విశదముగఁ దెలిపి మఱుచటిదినము వేఁకువనే పయనము కమ్మ నెను. వాఁడందులకు సంతోషపూర్వకముగ సమ్మతించి యా చోటుఁ బాసెను.

నాఁడు, రేయిపొడముదనుక వానిహృదయ మనేక విధముల యాలోచనల కునికిపట్టుగ నుండెను. రాత్రి తలచూపి యొకటి రెండుగడియలు గడిచెను. పెద్దిభట్టు, స్వయముగ భోజనాదివిషయములందు యువకు నుపచరించెను. భోజనపుఁ

బని తీఱిన యొకటి రెండు నిముసములలోనే తొలినాడు తనతో
వచ్చిన చేడియ యటకువిచ్చేసెను. వాకిట మేనాలు
రెండు సిద్ధముగ నుండినవి. యువకుఁడు వెలుపలకువచ్చి యొక
యందలమందుఁ గూర్చుండెను. అచ్చట ప్రయాణికుల సందడి
మిక్కుటముగ నున్నందున పెద్దిభట్టును యువకుఁడును సాభి
ప్రాయముగ నొండొరులను జూచికొనిరి. బోయలు పల్లకీలను
మోఁచికొని నడవఁ దొడఁగిరి. వారేచోటును గూర్చిపోయెదరో
యువకునకుఁ దెలియదు. వాని యందలముతోడనే చేడె శిబి
కయుఁ బోవుచుండెను.

## తొమ్మిదవ ప్రకరణము

## తైలప

మాన్యఖేట నగరము ప్రహరికి వెలుపల నివాసములు
గల్పించుకొని వీరభటు లున్నారని చెప్పియుంటిమి గదా. ఆపుర
మును గేంద్రీకరించి రమారమి యొక క్రోశము వఱకుఁ జుట్టు
ప్రక్కల వనదుర్గమేర్పడి యున్నను, ఉత్తరపువైపున గోదావరీ
తీరమువఱకు దట్టమైన యడవి వ్యాపించి యున్నది. మాన్య
ఖేటాధీశులుగాని వారికుటుంబమును జేరిన దొరలుగాని వేఁటాడ
వలసి వచ్చినప్పుడు వారి మృగయావినోదమున కా యడవియే
పనికివచ్చుచుండెను.

ఆ పెద్దయడవి ప్రారంభించు చోటనే పురరక్షకుఁడైన
మల్లప దండనాయకుఁడు, తన స్కంధావార మేర్పఱచుకొని
యుండెను. పురము వెలుపల నా యా స్థలములందు మసలుచు
ననవరతము జాగరూకులై నగరము కనిపెట్టియున్న భటవర్గమున

కా మల్లప దళపతియే యధిపతి. మల్లప తండ్రి తాతలు వేఁగి మండలమువారు. ఆ కాలమున శత్రురాజులచేతను నంతశ్ఛిద్రములచేతను వేఁగిదేశము శోభచెడి చెన్నఱి యుండెను; కావున, ఆ మండలమునందలి ప్రముఖులైన వీరవరేణ్యులును విపశ్చిద్వర్యులును జీవికనుద్దేశించి తమ యభిజనమువిడిచి పడమరనున్న రట్టపాడిని జేరి, అందలి సార్వభౌము నాశ్రయించి పొట్టయుసుకుఁ దీర్చుకొనుచుండిరి. అట్టివారిలో ననేకులు రాజు మెప్పువడయఁగోరి తమ మతమును గూడఁ బరిత్యజించి జైనులగుచుండిరి. అట్టిజనుల వర్గమందే మల్లప దళవాయిని జేర్పవలసి యున్నను, వాని యభిమాన మంతయు వైదికమతమునందే వెలయుచుండెను. అటులే విధికి దాసులై దుస్థితినున్న పూర్వ పశ్చిమచాళుక్య రాజులయెడ మితిమీఱిన భక్తియుఁ వాని కలవడి యుండెను.

మల్లప గొప్పయుద్ధవీరుఁడు; వానిపేరు వినుటచేతనే యితర విషయాధిపతులు పెల్లుగ భీతిల్లుచుండిరి. వాఁడు, కొలఁదిపాటి సైన్యము గొప్పసైన్యముగఁ గనిపించునట్లు వ్యూహములు రచించి యవలీలఁ బ్రచండసైన్యములను జయించునట్టి సామర్థ్యశాలి; కొందఱు భటులతో నభేద్యములయిన వ్యూహములలోఁదూఱి పగవారి బలముల విటతాటనముగఁ జెదరఁగొట్టి, విజయము చూఱగొను మహాసాహసి. ఆతఁడు పదివేల యాశ్వికసైన్యమునకు నాయకుఁడై నిత్యవర్షునకుఁ గుడిభుజముగ నొప్పారుచుండును.

మల్లపదండనాథుఁడు, గోదావరీ తీరారణ్యాముఖమున శిబిర మేర్పఱచికొని యున్నను, ఆతని పటకుటీర మొకచోటనే

యుండక వేళకొక చోటుగా మాఱుచుండును. నాఁడాతని గుడారము స్కంధావారమున కర్ధక్రోశము దూరమం దొకగుట్ట యొద్దనుండెను. చంద్రోదయమయి యొకగంటసేపైనది. నిర్మల చంద్రిక లతిమనోహరముగాఁ గాయుచుండ వనలక్ష్మి ధవళాంశుక ధారిణియైనట్లు గానవచ్చుచుండెను. గుడారమునకు వెలుపల పచ్చని పచ్చికతోడి యుర్వరపై మూఁడు వ్యాఘ్రచర్మములు పఱచియుండిరి; అందొకదానిపై నుల్లపదళపతి యాసీనుఁడై యుండెను. మఱియొక యాసనముమీఁద నొకఁడు గూర్చుండి, సమయశోభలచేతఁ బ్రేరేచఁబడి, ప్రకృతివర్గము వింతసొబగులనుగూర్చి యాశుధారగా కన్నడబాసయందు శ్రావ్యముగఁ బాడుచుఁ జేతము చల్లఁజేయుచుండెను. వాఁడే కన్నడకవిత్రయము వారిలో నొక్కఁడని పేరెన్నికగాంచిన రన్నకవిచంద్రముఁడు. మూఁడవ యాసనముపై యోషిద్రత్న మొక్కతె గూర్చుండి యుండెను. ఆబిడ, తనకుడిచేయి నేలకానిచి, తను వల్లరి యొకింతవాల్చి చంద్రుని వంకకు దృష్టిసారించి యుండెను. ఆ యన్నుల మిన్న, నడుము నందుఁ జెరవికొని యున్న ఖడ్గము పిడి నెడమచేతితోఁ బట్టుకొని మురిపెములు మూటగట్టినట్టులొప్పుచుండెను. ఆసుందర యువతీ వతంసము హృదయము, పెక్కు భావముల కాకరమై యున్నందున రన్నకవి కావ్యామృతాస్వాదనమునకుఁ బొత్తిగ నోఁచుకొన్నది గాదు.

రన్నకవి కవితాచమత్కృతి మల్లపహృదయము సమగ్రముగఁ దనలో నైక్యము చేసికొన యత్నించుచుండినను, ఆతని దృష్టి యప్పుడప్పుడు వీరయోష మోము దమ్మిపైఁ బ్రాఁకులాడుచు దానిభావములు గనుఁగొనుట కుత్సహించు చుండెను.

ఆ సుందరియును దనభావములను గప్పియుంచుటకై మొదట నెంతో ప్రయత్నించినది గాని పైఁబైని గ్రమ్ముచున్న యవస్థా భేదములకుఁ జిక్కి తుదకుఁ దన్నేమఱచినది.

ఇవ్విధముగా నచటనున్న ముప్వురి యెదలలో ముప్విధ ముల రసములు పొదలుచుండెను. అప్పుడు, అచ్చటికొక యువ తియు నొకయువకుఁడును వచ్చినిలిచిరి. ఆ యువకునిఁజూడఁగానే యచటఁగూర్చుండియుండిన వీరయోష కీలుబొమ్మవలె దుమికినట్లు లేచి, విద్యుద్వల్లరి లీలతో మల్లపచాటునకుఁ బోయి నిలిచెను. యువకుఁడు, తన గన్యాస్థాన మిట్టిదని తెలియక యటకువచ్చిన వాఁడుగాన, తనకింతకుమున్నుపకరించిన వీరయువకునిఁ గనుగొన నలువలంకులఁ జూపు నిగిడ్చెను; వాఁడు గోచరింపఁ డయ్యెను. ఒండొంటికి సంబంధములేని, సమన్వయపఱచుటకుఁగాని సంభ వము లేర్పడుటచేత నచట నేమి పలుకవలయునో యెట్లు మెలఁగవలయునో తోఁచక, యువకుఁడు కొంతసేపు జిచ్చపా టుతో నిలిచెను. ఆ యువకునిఁ జూడఁగానే మల్లప యాసనము నుండిలేచి, "ప్రభు కుమారా! రమ్ము; నేఁడు నాకన్నులకు విం దొనఁగూర్చితివి; ధన్యుఁడనైతిని; ఇదివఱకు నిన్నుఁగూర్చి విని యుంటిని గాని సందర్శించు భాగ్యము నేఁడు గలిగెను" అనెను.

యువకుఁడు, వానిమాటలయందే యిమిడియున్న గాం భీర్యాది గుణములను గ్రహించి, ఒకవిధమైన తీర్మానమునకు వచ్చి, మందహాసము ముఖసీమకు వింతకాంతి నొసఁగూర్ప, "ఓవీరుఁడా, ఔను, నాకు నీ వంటి ఘనుని సందర్శనము లభిం చుట కిదియే ప్రథమదివసము. సుఖ దుఃఖములీ రెండు మూఁడు దినములనుండి మాటిమాటి నన్ను వెతకొలిపినప్పటికి నీ దివసా

వసానము సుఖముగనే పరిణమించెను. కాఁబట్టి, నాజీవితచరి త్రమునం దీ దినము పరమోత్కృష్టమైనది” అని చెప్పుచుండు నప్పుడే వీరఘోష కనుసన్న చే, చేడియ గుడారములోనికిఁబోయి వ్యాఘ్రాసన మొకటిదెచ్చి యచటఁ బఱచెను. అంతట నందఱు నాసీను లయిరి.

మల్లప—“ఓయువకుఁడా, సేవావృత్తి నింద్యమైనదని వినియుందువు గదా! మేము నగరవాసమునకు దూరమై వనవా సము సేయుచున్నాము. మాకిక్కడ వన్యములయిన ఫలాదులు తప్పఁ దక్కినవి దుర్లభములు. కనుక, మాతో నారగించునప్పుడు వస్తుదారిద్ర్యమును గూర్చి యేవగింప” వని నమ్మోదను.

యువకుఁడు—“పేరుఁడా, ఫలాదులును భోజ్యములే! ఏవగింపనేల?”

అని వారిరువురు సల్లాపించు చున్నప్పుడే, చేటి తన యేలిక భావము గుర్తెఱిఁగి నాలుగు పీఠములను దెచ్చి యమ ర్చెను. మొదటి పీఠమీఁద రత్నకవియు, రెండవదానిపై మల్ల పయు, మూఁడవదానిపై యువకుఁడును నాలవదానిపై వీర ఘోషయుఁ గూర్చుండిరి. వారు బటువుదీరి గూర్చుండఁబట్టి వీరబాల కొక ప్రక్క రత్నకవియు మఱియొక ప్రక్క యువకుఁడు నుండిరి. చేడియ పత్రపాత్రములు దెచ్చి వారియెదుట నుంచెను. పరిమళోదకములు స్వర్ణపాత్రములందు నించి వారి ప్రక్కఁ బెట్టెను. పలువిధములయిన మధురఫలములను పక్వముగఁ బచ నముచేసిన కందమూలములను మధువును దెచ్చి వడ్డించెను.

మల్లప—ప్రభుకుమారా, ఇవియే యిట లభించునట్టివి; ఈ వస్తువుల కిట నెంతమాత్రము లేబరము లేదు. వీనిలో నీకు

రుచింపని వానిని బరిత్యజింపుము. రుచ్యములయిన వాని నడు
గుము. ఆహార వ్యవహారములందు లజ్జ తగదు.

యువకుఁడు—అన్నియును రుచ్యము లైనవే! నాకుఁ
గావలసియున్నంతకంటె నెక్కువగానే యున్నవి.

వీరఘోష—'ఈ రసదాడి యెంత రుచ్యమైనది!
యౌవనవంతుఁడా! దీనిని జవిచూడుము' అని యొకపండు
తోలూడ్చి వాని యఱచేత నుంచెను. అప్పుడా యన్నులమిన్న
కోమలాంగుళులు వానిచేతికిఁ దగిలినవి. ఆ స్పర్శవలని సౌఖ్యము
వీరఘోష మిక్కుటముగ ననుభవించిన దనవలయును.

యువకుఁడు—ఔను, కాంతామతల్లీ! ఈఫలమాధుర్య
ముకంటె నీ వాఙ్మాధుర్యమెంతో శ్లాఘ్యమైనది.

మల్లప—ప్రభుకుమారా, నిజము పలికితివి. కాఁబట్టి
ఈ నా పుత్త్రికకు జన్మనామమెదియైనను దీని మంజులాలాప
ములు గారణపఱచి 'కోకిలాలాప' అని పిలుచుచుందును.

కోకిలా—"సరి సరి, తాతపాదు లభిమానవశమున
నిట్లనెదరు; లోకమందు వీరిపుత్త్రికకంటె మిన్నయైన కీరవాణి
కన్పట్టకుండునా?" అని మోము గంటువడ యువకునిఁ జూఱ
చుఱ చూచుచుఁ బలికెను.

కోకిలాలాప సాభిప్రాయములైన పలుకులు యువకున
కర్థము కాలేదు. యువకుఁడు, చమత్కారోక్తులచేత నామె
కోపమార్పనెంచి, "సోదరీ" ఉందురుగాక! నీవఱకు మధురా
లాప యన్నదోషమేమి?" అనెను. అదివఱకు వానిమోమును
దనివి తీఱక చూచుచుండిన కోకిలాలాప, కోప మాఁగలేక
మోమావలకుఁ ద్రిప్పెను. ఆబిడ హృదయము రణ్ణకవికి బాగుగా

దెలియునుగాన, "సరి, పరిణయమునకుఁ బూర్వము భార్యా భర్తలు సోదరీ సోదరులే" అని మెల్లఁగఁ జెప్పెను.

ఆ పలుకులు యువకుఁడు వినకపోయినను కోకిలాలాప వినియుండవచ్చును. ఆయింతి యనుభవించు రసమిట్టిదని యువ కునకుఁ దెలియదు. వాఁడు మల్లపను జూచి, "నాయకుఁడా! ఈయన్నులమిన్నను ప్రాణేశ్వరిగాఁ బడయు భాగ్యమెవని కలవ డియున్నది?" అని ప్రశ్నించెను.

అందులకు మల్లప, "ప్రభుకుమారా ! పుట్టియు న్నాఁడు. త్వరలోనే నీవు తెలిసికొనఁ గలవు. ఇంతకంటె భవిష్య ద్విషయములను గుఱించి మనమెట్లు నిర్ణయించుట?" అనెను.

ఆ మాటల కాయువకుఁడు, "ఈ తరుణీమణిని పాణిగ్రహ ణము సేయువాఁడు సామ్రాట్టుగ నుండు" ననెను.

రణ్ణకవి యువకునిఁ జూచి, "యౌవన వంతుఁడా, ఒక వేళ వాఁడు సామ్రాట్టుగాకున్నను, మన కన్యాలలామను జెట్ట వట్టుటచేత సామ్రాజ్యపదవి ననుభవింపఁగలఁ" డనెను. ఆ వే ళకా వీరయోషకు నెమ్మది యొనఁగూడి మోమున మందహాస మంకురించెను.

ఇవ్విధముగా వారు సల్లాపించుచు ఫలము లారగించి లేచిరి. ఆరేయి యువకుఁడు తమతోనుండవలయునని మల్లప కోరెను. యువకుఁ డందులకు సమ్మతించెను. అంతట నాయకుఁడు వానిని జూచి, "ప్రభుకుమారా! నీజన్మనామ మెదిగా నున్నప్పటి కిని, ఇఁక నీ వ్యవహార నామము, "తైలప" అని యొప్పు నుగాక!" అని సంకేత నామమిడెను. అంతలో చేటి చిగు రాకులసెజ్జ సమకూర్పఁగాఁ దైలప దానిపై మేను చేర్చెను.

తన్నాచోటుఁ జేరుట కుపకరించిన వీరయువకుఁడు గానరాక పోవుటకుఁ గారణము తోఁచక తొట్రిలుచు, చేడియ నడుగుట కును వీలుకలుగమిచే వానినిగూర్చి తలపోయుచుండి తుదకుఁ గనులుమోడ్చి తైలప కూర్కెను.

---

## పదియవ ప్రకరణము

## వ్యాఘ్రశాలయము

వృక్షములు నివాసములుగాఁ గావించికొని శాఖశాయ నికములై యుండిన పక్షిసముదాయము నిద్రమేల్కొని, కెందము లందానందము పొంగి పొరల వసంత మాధవునిఁ గైవారములు సలుపుచున్నవోయన వనమందంతటఁ బలువిధములైన కూజి తము లొక్కపెట్టున నించెను. పుష్ప కుట్మలములు విచ్చి పరిమళములు నలువలంకులఁ గ్రమ్మఁజొచ్చెను. లేఁతెమ్మెర మెల్ల మెల్లఁగఁ బ్రసరించుచు ప్రాణికోటుల స్పర్శేంద్రియముఁ దనలో నైక్యము చేసికొనఁ దొడఁగెను. పక్షి రుతములు మేలు కొలుపు పాటలుగాను, మలయానిల వీచికలు కరస్పర్శలతో లేపుట గాను బరిణమింపఁగా, వనమందుఁబరుండియున్న మల్లపా దులు లేచి, ప్రాతఃకాలకృత్యములఁ దీర్చికొనిరి. వారు తమ పనులు ముగించుకొని పటకుటీరముఁ జేరినప్పుడు ప్రొద్దుపొడువ కుండెను. ప్రాతఃకాలము కాఁజొచ్చినను వెన్నెల వెల్లఁ బాఱకుం డెను; ఒకరి మో మొకరికి రేఖలతోడ బాగుగాఁ గానవచ్చు చుండినది. తైలప, కోకిలాలాప మోమును జూచి నప్పుడు, ఆ బిడ మోము నందము యౌవనసంపదచేఁ బ్రఖ్యాతి నొంది మందహాసరోచిచే మనోజ్ఞమై యొప్పుచుండెను. ఇట్లనుపమా

నమై వెలయుచున్న యీ యోషావతంసము ముఖ మండలము నకు, వెల్లఁబోవుచున్న చంద్రికలు జీవరస మొసఁగూర్చుచు, లావణ్య స్నిగ్ధకాంతులకుఁ బై మెఱుఁగిడుచు, పరిభవిలుచుం డుటచేతఁ దైలపకు రెండు కన్నులును జాలకపోయెను. ఆబిడ ముఖవికాసము, కనులు మిఱుమిట్లు గొలుపు చుండుటచేతను పెక్కుబాములకుఁ జిక్కి తనచిత్తము చెన్నటియుండుటచేతను వాఁడా యింతిని బోల్చుకో లేక పోయెను. నిజముగా నాసుం దరీమణి దర్శనవ్యాజమున వాఁడు సహస్రాక్షుఁడు కాఁగోరెను గాని, హా, వాఁడేమి సేయును? వాని హృదయ మింతకుమున్నే యొక సుందరి సంపూర్ణముగ హరించినది; వాఁడెందుండి కోకిలా లాపకుఁ జోటొసఁగును?

“సోదరీ ! సెలవిమ్ము. ప్రాప్తమున్నఁ బునర్దర్శనమగును గాక!” అనెను. యువకుఁడు తన్నుఁ బ్రాణేశ్వరీ యని నోరారఁ బలుకక సోదరీయని సంబోధించుట కా పడఁతి విషణ్ణహృదయ యయ్యెను; కాని, తన క్లేశము వెలికిఁగాన్పింపక కప్పిపుచ్చెను. “ఎటులైనను వీఁడు నావాఁడు; వీనిచే నొకపూటకైనను బ్రాణే శ్వరి యని పిలిపించుకొనక పోదునా? హా ! అటులే యైన నా మనుగడవలని ప్రయోజనమేమి?” అని దిటవు దెచ్చికొనెను. “సరి, యౌవనవంతుఁడా! నీయిచ్చచొప్పునఁ జేయుము” అని గంభీరముగఁబలికి, “ఔను, వీనినెన్నఁటికైనను, “కృతఘ్నుఁడా!” అని పిలిచి పొడిచియాడక విడువను. నాకు నొకసమయము తటస్థింపఁగలదు” అని తనలో ననుకొనెను.

మల్లప, తైలపను గొంతదవ్వులకుఁ బిలుచుకొనిపోయి, “ప్రభుకుమారా, నీకిప్పు డొక యంశము చెప్పవలసి యున్నది.

దానికిఁ గారణమునుగాని విపులముగాఁ జెప్పుమని కాని నన్నుఁ గోరకుము. దానితత్త్వము దినక్రమమున నీకే తెలియఁగలదు. ఓయువకుఁడా! నేను నీపెద్దలకు సంబంధించిన వాఁడను; కావున నీవు నావాఁడవు; ఈసూక్తిలో ననేకాంశము లిమిడి యున్నవి. నీవు కొంతకాల మీయరణ్యమందు, అనఁగా—ఇచటికిఁ గొన్ని కోసుల దూరమందు మసలుచుండుము. త్వరలోనే నీకభ్యుదయము లొనఁగూడఁగలవని నమ్మెదను. నీపెద్దలనాటి శౌర్యధైర్యములను జేవిడువకుము. ఇదిగో! ఈఖడ్గరాజమును జూడుము. దీని పడిలోఁజెక్కియున్న యక్షరములను జదువుము. దీనిని బట్టి నవాఁడెవఁడో తెలిసికొంటివా? ఆతనివలెఁ బ్రఖ్యాతిఁ గనుము. "తైలపా! నీవిఁక నిందుండి కదలుము" అని ముదల యిచ్చెను.

తైలప యా ఖడ్గమును వినయముతోఁ జేతికిఁ దీసికొని యందలి వ్రాలను జదివెను. వానియొడలు సంతసముచేఁ బెల్లుబికెను. చెప్పనలవి గాని శౌర్యము వానిలో నావేశించెను. కృతజ్ఞుఁడై మల్లపకు బదు లిట్లుపలుకవలయు నని వానికిఁ దోఁచదయ్యెను. వెంటనే వాఁడు, "ఆహా, మీరే నాకుఁ దలిదండ్రులు! మీరే నా కులదైవము! ఇంతకంటెఁ జెప్పుటకుఁ దగినమాటలు భాషలో లేవు" అనుచు వాని పాదముల మ్రోల వ్రాలి సాష్టాంగ నమస్కారము చేసెను.

"తైలపా, ఇది యేమిపని? నీకుఁగృతజ్ఞత గలదేని మనస్సునం దుంచుకొనుము; నీయట్టి ప్రభుకుమారుఁ డిట్లు వెల్లడి సేయ సాహసించునా? యువకుఁడా, మఱియొక తడవకును జెప్పెదను. ఎట్టిప్రమాద మొనఁగూడినను నీపెద్దలఖడ్గమును జే విడువకుము. నీకు మఱియొకదానిని బహూకరించెదను.

ఈయుత్తమాశ్వము నీకు పొందదగినది. నేనీతురగమును బూజ్యుఁడయిన యజితుని పేరితోఁ బిలిచెదను. మానవులభాష నర్థము చేసికొని మెలఁగు సామర్థ్యము దీనికిఁ గలదు. ఇంకను దీని ప్రకృష్టగుణము లేవి యనిన, పసిచేతఁ గ్రూరసత్వముల జాడను గుర్తెఱిఁగి రౌతునకు సూచించును. దురూహములైన యరణ్యమార్గములు గ్రహించి వాయువేగమునఁ బఱచును; దీనిఁగట్టియుంచవలసిన పని లేదు; కట్టునకును లోఁబడదు; తనయంతఁ దిరిగి మేఁతమేసి యజమానుఁడున్న చోటునకుఁ బరిసరములందు మెలఁగుచుండును. పిలువఁగానే పాఱివచ్చి పని వినును. ఇట్టి తురగ రాజమును, ఈ ఖడ్గమును నీ యభ్యుదయమునకుఁ బరికరములని నమ్ముము. అని సజ్జీకరించి సిద్ధముగ నచట నిలిపియున్న యశ్వమును జూపి, "పోయిరమ్ము; శుభములు చేకూఱును గాక" అని యాశీర్వదించెను.

పిమ్మట, శైలప వీరఘోషవలనను రణ్ణకవివలనను సెలవు పొంది, సూర్యుఁ డుదయించుటకు మున్నే యశ్వారోహణము చేసి యాచోటువిడిచి కదలెను. నాఁడు వాఁడు పదిగంటల వఱకును బయనము చేసి పెక్కు కనమలను దాఁటియు, గుట్టల చఱియలయం దేర్పడియున్న దట్టములయిన వృక్షవాటికలను జొచ్చిపోయియు పదిక్రోశముల దూరమునందున్న వ్యాఘ్రేశ్వరాలయమును జేరెను. ఆ యాలయ మొకగుట్ట చఱియను వెలయుచుండినది.

ఆయాలయము, అడవిగాసిన వెన్నెలవలె నచట పైవారుచుండెను. దానిని క్రీస్తుశకమాఱవ శకాబ్దాంతమున మంగళేశుఁడను చళుక్యచక్రవర్తి జీర్ణోద్ధారము చేసినట్లు, ఆలయ

కుడ్యములపైఁ జెక్కఁబడియున్నను, అచ్చట ప్రతిష్ఠించియున్న లింగము మిగులఁ బ్రాచీనమైనది ; దానిని వ్యాఘ్రపాదముని తొల్లిపూజించుచుండి ధన్యుఁడైనందున నాలింగమునకు వ్యాఘ్రే శుఁడని పేరు గలిగె నఁట.

ఆలయము విస్తార ప్రదేశమావరించి యుండెను. అయి దడుగుల దళమును గలిగి దాని చుట్టుగోడలు సుదృఢములై యొప్పుచుండినవి. అందలి ధ్వజస్తంభము పీటలు వాఁటి పగిలి యున్నను దేవళము గోడలు విఱిగిపడక దృఢముగానే యుం డెను. అటులేయుచటనున్న నందియు లింగమును భిన్నమొంద కుండినవి. లింగమెదుటనున్న బలిపీఠము సైఁతము బాగుగానే యుండెను. చిరకాలమునుండి యీ యాలయము, గొప్పగాఁ గొనియాడఁ బడుచు వచ్చుచుండి యిటీవల దౌర్భాగ్యమునకుఁ బాలుపడినది. ఆయాలయమునకు మానవుల రాకపోకలు లేక పోవుటచేతఁ గ్రూరమృగములు దిరుఁగులాడుచుఁ దాము పట్టి తెచ్చిన యెర నచటనుంచుకొని తినుచుండినవి గాన నెక్కడఁ జూచినను నెమ్ముల ప్రోవులు సెదరిపడి యుండినవి. కోవెల పైకప్పునం దంతటను గబ్బిలములు వ్రేలుచున్నందున నవివైచిన రెట్టలు నేలపై దట్టముగ మొందుకొనియుండెను. కావున, మనుష్య మాత్రుఁడు వసించుటకుఁగాని యనువున దుర్గంధమున కాయాల యము నిలయమై వెలయుచుండెను.

ఆలయమున కెదుటఁ బెద్దకోనేరుండినది. దానిచుట్టు ప్రక్కల మఱ్ఱి, రావి, గంగరావి మున్నగు చెట్లు ప్రోదిగాఁ బెరిఁగి యున్నందున దాని మెట్లు చెదరియుఁ దొలఁగియు నుండెను. కాని, అందలి జలము త్రాఁగుట కర్హమైనదిగానే యుండెను.

తైలప, కోనేటి యొద్దకుఁజేరి గుఱ్ఱము మీఁదినుండి దిగి దాని పల్యాణమును నోటికళ్లెమును దీసి దిగువవైచి, గుఱ్ఱమును దట్టియిచ్చి, 'అజితుఁడా! నామూలమున నీకు నేఁడెక్కువ కష్టము గలిగెను. ఇంక నీయిచ్ఛ చొప్పున విశ్రమింపుము; సమయముదటస్థించినప్పుడు పిలిచెదను ; వచ్చియప్పుడు నా పని విందువుగాక!" అనెను. అదియును బరిసర ప్రదేశములందుఁ గొంత సేపు మేఁత మేయుచుండి తుద కెచ్చటికో వెళ్లిపోయెను. తైలప శ్రమదీఱునట్లు లాకోలనిలో స్నానముచేసి యారేయి తల దాఁగుటకాలయము తగియుండునని పోయెను.

ఆలయమందుఁ బుంజీభవించియున్న దుర్గంధ మొక్కపెట్టున ఘ్రాణేంద్రియమును మోఁది యువకుని ప్రేవులు గలియఁబెట్టి డోకువచ్చునట్లు చేసెను. వాఁడు, బట్టతో ముక్కుమూసి కొని యాలయమంతయును జుట్టివచ్చెను. అందు, రోఁతపుట్టించనిచోటు జేనెఁడైనను లేదు. ఒకఁ డొక నెలవఱకు, దినమంతయుఁ బాటుపడుచు వచ్చినను నాదేవళము శుభ్రము చేయ లేఁడు. ఆయాలయము భూలోకనరకమై కన్పట్టుటచేత నచ్చట నారేయి గడుపుటకు వాఁడు సాహసింపఁడయ్యెను. తానుండఁదగిన చోటు మాత్రము శుభ్రపఱచుకొనరాదా యనిన, రెండుదినములు వాఁ డనుభవించిన శ్రమముచేత వాని యింద్రియములు వశము దప్పియుండెను. కాఁబట్టి, వాఁడాలయమునకు వెలుపలనే యారేయి గడపఁ దలఁచెను. కాని, ఎక్కడఁ గడపుట? ఘోరారణ్యగర్భమునం దెక్కడఁ బట్టినను క్రూరసత్త్వములు దిరుఁగుచుండునే! వాఁడు దేవాలయము వెలుపలకు వచ్చి, తొల్లి తానువిడిసిన వటవృక్షమూలముఁ జేరెను. చుట్టుప్రక్కలఁ

జూడ్కి నిగిడించి చూడఁగా నెదియును దగినచోటు వానికిఁ గన్పట్ట లేదు. తుదకు వాఁడు వృక్షమువంకఁ జూచి, దానిశాఖపైఁ గూరుచుండి యారాత్రి గడుపఁదలఁచెను. అంత, నేలపై నైచియున్న పల్యాణాదుల నెత్తుకొని చెట్టెక్కి దృఢమైన యొక్కశాఖామూలమునకు దానిని గట్టియుంచి యందుండి దిగెను. వాఁడు, కోనేటిగట్టును దిరిఁగి రాఁగా, పండిరాలిన వెలగపండ్లును మారేడుపండ్లును గొన్ని లభించినవి. దొరకినంతవఱకుఁ దృప్తిచెంది యంతకుఁబైనఁ దిరుగుటకు సాహసింపక యాపండ్లుదిని నాలుగు దోసిళ్లు కోనేటినీరుద్రాఁగి కొంత సేదదీఱి మరల వృక్షమారోహించి, ఖడ్గమును బదిలముగ దగ్గఱనే యుంచుకొని, "ఇంక నే నీచోటు రేఁపు తెల్లవాఱువఱకు విడువకుందు"నని నిశ్చయించుకొనెను.

ఆవేళకు, సాయాహ్నభానుఁ డపరదిశనుగూర్చి పోవుచుండెను. పక్షిసమూహములు పొట్టలునిండుగ నెరదిని తమతమ కులాయములనుగూర్చి పోవుచుండినవి. అదివఱకుఁ బొదలందును గుహలందును దాఁగియున్న దుష్టసత్త్వములు, ఎరనుగూర్చి సంచరింపఁ దొడఁగినవి. పలువిధముల పక్షులధ్వనులను మృగముల మూల్గులును మెండుకొని యాయరణ్యగర్భము భీకరమై యొసఁగుచుండెను. రవి యస్తమించి దట్టముగనంధకారము గ్రమ్మెను. పులులు, చిఱుతలు, ఎలుఁగులుమున్నగునవి యానందభరితములై యీవల కావలకుఁ బరుగులిడఁ జొచ్చినవి. నేలపైఁ బండి యెండి రాలిన యాకులలో సరీసృపములు ప్రాఁకులాడుచు సరసరమను సవ్వడి నెడతెగక గలిగించుచుండినవి.

యువకుఁడు గూర్చుండిన స్థానము సుఖప్రదముగానే యుండెను. వాఁడు చేరికొని యుండుటకు వృక్షస్థానము తగి యున్నప్పటికిని రేయియంతయు నెట్లు వెడలఁబుచ్చుట? ఒక వేళ, నిద్రచే నొడలు మఱచినప్పు డెట్టి ప్రమాదము సమకూఱునో యని యూహించి లగాముత్రాళ్లతోఁ జెట్టుబోదెకును దన యొమ్మునకును జుట్టి కట్టుకొనెను.

వాఁడనుకొనినటులే యించుక కనుఁగూర్కెను. చంద్రుఁడుదయించి వనమంతయుఁ బిండి వెదచల్లినట్లు వెన్నెల గాయుచుండెను. ఇరువదైదుగురు దొంగలు పెద్దబోషాణముఁ దెచ్చి, తైలపయున్న చెట్టు దిగువఁ బెట్టిరి. నలుగురైదుగురచేతఁ జేదివ్వెటీ లుండెను. వారు గట్టిగ మాటలాడు సవ్వడికిఁ జెట్టుమీఁదనున్న యువకుఁడు మేల్కాంచెను. వాఁడు, వారి నిట్టివారని తెలిసికొని వారి చర్యలను మాటలను గనుఁగొని, వారిగుట్టు దెలిసికొనవలయునని మిగుల జాగరూకుఁడై కూర్చుండెను. దొంగలు తమలో నిట్లు సంభాషించుకొనిరి.

"ఓరి నాయనా! నేఁటికి సరిగా, మన మీ చోటువిడిచి, యిరువదియైదు దినములు గడిచినవి. ఈచోటుఁజేరుట స్వర్గలోకము చేరినట్లు నామనస్సు సంతసిల్లుచున్నది" అని యొకఁడనెను.

"మన యజమానుఁ డున్నంతవఱకు మనకు భయమన్న మాటలేదు. అతనికిఁ దెలిసియున్నన్నిమాయలు మాఁచమనకుఁ గూడఁ దెలియదు" అని మఱియొకఁడు చెప్పెను.

నాఁడు సభలోజరిగిన వాదమెంత గొప్పదిరా! మనము పండితుల మని పేరు పెట్టుకొని యుంటిమి. కాని, వారిమాటలలో నొకటియు నర్థము కాదు. ఏమి ప్రజ్ఞరా మన యేలికకు!

క్షణకాలములో జైనులకును వైదికులకును విరోధాగ్ని రగిలించి వెంటనే మాయమయ్యెను" అని వేఱొకఁడు నుడివెను.

"ఔను, వైదికులు వెఱ్ఱివారు; మనయేలికను నేఁటికిని కాశీ విశ్వేశ్వర స్వామి యనినమ్మెదరు. ఈ వెఱ్ఱివైదికులెక్కడ! విశ్వేశ్వరుఁడెక్కడ!" అనియింకొకఁ డనెను.

"అన్నా! కాఁబట్టియే మూర్ధాభిషిక్తులైన రాజులు కూడ మనదొర తోడ్పాటును గోరెదరు; రట్టపాడిలో నింత భేదము పుట్టించిన దెందులకు? ఆ రహస్యము నీకుఁ దెలియదు. నాఁడు హర్ష దేవునిదూతలువచ్చి యెంత ధనము కట్నముక్రిందఁ జెల్లించిరి! అదెందుల కను కొంటివి? ఇందులకే!" అనియొకఁడు చెప్పెను.

"మనలను రాజు కారాగృహమునందుంచెనే, దానివలన నతఁడు గనిన ఫలమేమి? మన యేలిక, ఆరాజుమీఁది కోపమును కళింగ దేశపు ముదుసలిపైఁ దీర్చికొనెను. దాని వలని లాభ మే యీబోషాణము; దీనిలో ఱాలే యున్నవో, రతనములే యున్న వో? ఎవ్వరికెఱుక?" అని యొకఁ డనెను.

"అన్నా, నీతలంపు నాకుఁ దెలిసెను. రాజుగారి బొక్క సము కొల్లఁగొట్టలేదని కొదవపడెదవా? దానికిఁగూడ కాలము సమీపించుచునే యున్నది" అని మఱొకఁ డనెను.

"కడచిననెల, పదికంచరముల సొమ్మును దెచ్చినవార మీనెలకీ చిన్న పెట్టెను దెచ్చియిటనుంచితిమే యిదెట్టి బ్రతుకు? ఇట్లు బ్రతుకుటకంటె గూడెములో శివ శివ యని కూర్చుండ రాదా? అన్నలార! అదిగో, మనయేలికయును రాయబారి రామన్నయు వచ్చుచున్నారు, మాటలు చాలింపుఁడు" అని యొకఁడు చెప్పఁగా నందఱును మాటలు చాలించి, వచ్చుచున్న

వారి వంకకు జూపులు నిగిడ్చిరి. దొంగలనాయకుఁడును రామ
న్నయు వటవృక్షమూలముఁజేరి యచ్చట సగము పూడిపడి
యున్న బండలపైఁ గూరుచుండిరి.

నాయకుఁడు—రామన్నా, మనకీనెల లభించినలాభ మిది.

రామన్న—ఏమి చేయవచ్చును ? మనప్రాప్తానుసారము
లభించినది.

రామన్నను జూడఁగానే తైలప యులికిపడి, "హా, వీఁడిట
కేట్లువచ్చెను ? నిన్న మొన్ననే, సత్రపుఁ దోఁటలో లతాగృహ
మునం దా యువతితో సంభాషించుచుండఁగా నేను వీనినిజూచి
తిని. ఔను, వీఁడే వాఁడు. అప్పటి వీని మాటల ధోరణిని బట్టి
ఘనుఁడని నమ్మితిని. అక్కటా, కుత్సితులెట్లు మెలఁగరు ? ఈ దొం
గల ఱేఁడు విశ్వేశ్వర భట్టయి సంస్థానములు ముంచుటకు
మొనసినప్పుడు వానిరాయబారి యెన్ని వేసములు వేయఁడు?"
అని యనుకొనెను.

నాయకుఁడు—"ప్రాప్తమునుగూర్చి చెప్పుటలేదు ; ఈ
నెల వంతున కిదియైనను లభించెనుగదా యని సంతసిల్లెదను.
ఓరీ! దీనిని దెఱచి శోధింపనేల ? తీసికొనిపోయి దానిస్థానమందుఁ
బడవైచిరమ్ము" అని యందలి భటులలో నొకనిఁ జూచిచెప్పెను.

వెంటనే, కొందఱాభోషాణము మోసికొని దేవళములోఁ
దూఱిరి. ఒక చేదివ్వెటీ వాఁడు మాత్రము వారిరువు రున్నచోట
నిలిచి యుండెను. దేవళములోనికిఁ బోయిన వా రఱగంటలోఁ
దమ పనిని ముగించుకొని వచ్చి చేరిరి. పిదప నంద ఱా చోటు
విడిచి గూడెమునుగూర్చి వెళ్లిరి. తైలప చిత్తమును జెదరఁగొట్టు
చున్న సందియములు పూర్తిగా నిపుడు దొలఁగెను. మఱియు,

దొంగలగుట్టు వానికిఁ గొంత తెలిసెను; రామన్న నడవడి వాని కెంతో వెగటుఁ గలిగించెను. ఆ దొంగ లొక నెలకుఁ గాని యచటకు రారని వాఁడు గ్రహించెను; నిత్యవర్షుఁడు హతుఁడు కావలయునని హర్షుఁడు చేయు ప్రయత్నము లిట్టి వనియును తెలిసికొనెను. ఇదివఱకు జరిగినవన్నియు శుభసూచనలే యని గ్రహించి వాఁ డించుక తనివిసెందెను.

## పదునొకండవ ప్రకరణము
### పరిశోధనము

దొంగల ఱేఁడును రాయబారి రామన్నయును గూఁడె మును గూర్చి పోవుచుండి రని చెప్పియుంటిమి గదా! వెన్నెల బాగుగాఁ గాయు చున్నప్పటికిని, ఒడయని గౌరవమునుగోరి, దొంగలు చేదివ్వెటీ లార్పక నాయకునకు ముందు వెన్కలఁ బోవుచుండిరి. వారాచోటువిడిచి పశ్చిమోత్తర దిశగా రమారమి రెండుగడియల దూరము నడిచి యచటనుండి తూర్పు దెసకు మరలిరి. వృక్షశాఖా మూలమునఁ గూర్చుండిన శైలప, దివ్వెటీల వెలుఁగును బట్టి వారి గూఁడెమున్న దెసను, దానియొద్దకుఁ బోవుమార్గమును బాగుగాగుర్తించెను. గూఁడెమునకును దానున్న చోటునకు నింతదూరమనియు నొకవిధముగా నూహించెను. దొంగలాచోటు విడిచివెళ్లినది మొదలుకొని దివ్వెటీల వెలుఁగు కానరానంతవఱకు వాఁడువారిని గూర్చియే తలపోయుచుండెను.

"ఈ దొంగ లీ యరణ్యగర్భమందు వసించి యప్పు డప్పుడు రాష్ట్రములపైఁబడి కొల్లగొట్టుచున్నను, మూర్ధాభిషిక్తులగు రాజులు వీరి యునికి మనుకులు దెలిసి యేల దండింపరు?

ఒకవేళ వీ రీ మండలము వారు గారేమో! అయిననేమి? ఈ యడవి రట్టపాడి విషయముతోఁ జేరినది; వీరుసమయమునఁ గూడినప్పుడు మాన్యఖేట నగరములోఁ బ్రవేశించి, కొల్లఁగొట్ట దరవి నాఁడుసత్రమున వీరిచర్యలను యాత్రికులు కథలుగాఁ జెప్పుచుండ వినియుంటిని. వీరినిబట్టి నిర్మూలించుటకు నిత్యవర్షుఁ డేల సాహసింపఁడు? ఔను, జ్ఞప్తివచ్చెను! హర్షుఁడు తనకుఁ గట్నములు సమర్పించెనని దొంగలే స్పష్టముగాఁ జెప్పికొనిరి. సార్వభౌములు వీనితోడ్పాటు కోరనేల? అట్టి శక్తి వీని యందే మున్నది? ఇవియన్నియును నాకుఁ జోద్యములు గానే కన్పట్టుచున్నవి. వీరి బలమునకు మూల కారణ మిది యని యరయుట నా పనులలో ముఖ్యమైనది" అనుకొనెను. అంతలో, దొంగలు దేవళమున భోషాణమును జేర్చి వచ్చిన సంగతి వానికి జ్ఞప్తివచ్చెను. "ఇది యాశ్చర్యమే! వారీ గుడిలో దానినెచట పదిలముచేసిరి? తాము ప్రతిమాసము దోఁచి తెచ్చిన ధన మచ్చటనే పడవేసియుంచునట్లు చెప్పిరే! నేనాలయముచొచ్చి చూచినప్పు డట్టిచిహ్నమేదియుఁ గనఁబడలేదు. ఈయాలయ ములోఁ దప్పక నేల మాలె యుండి తీరవలయును. రేఁపటికి సావ కాశముగఁ బరీక్షించెదను గాక!" అనుచుఁ దలపోయుచుండఁగా వానికన్నులు ముద్రితము లయి నిదురక్రమ్మెను.

పలపల వేగెను; పక్షినికరముల ధ్వనులకు వాఁడులికిపడి మేల్కనెను. వెంటనే వాఁడు తనకట్లను సడలించి, చెట్టునుండి దిగి, అహర్ముఖోచిత కృత్యములను దొందరగాఁ దీర్చికొనెను. కోనేటిలో స్నానముచేసి దేవళములోనికిఁ బోయెను. వానిని, తొలిదినమేవఁగొల్పిన కశ్మలములుగాని దుర్గంధముగాని యప్పు

డేలకో వానికన్నులను ముక్కును బాధింప వచ్చెను. తిన్నఁగా వాఁడు గర్భగృహము చేరి వ్యాఘ్రేశుని జుట్టి వచ్చెను. నేలను బలముగాఁ ద్రొక్కుచుఁ దన్నిచూచుచుఁ నడుగులిడెను; నేల గట్టిగానే యుండినది. అందలి శివమూర్తిని బట్టి యూఁచెను; సుదృఢముగానే ప్రతిష్ఠింపఁబడియుండినది. చుట్టుగోడలనన్నిఁటిని దట్టిచూచెను; దానివలనను బ్రయోజనము లేదు. అందుండి కదలి, కుడిప్రక్క నున్న కాత్యాయనీ గర్భగృహముఁ జేరెను. అది శివుని గర్భగృహముకంటెఁజిన్నది. వాని పరిశోధన కచట నేమియుఁ గనఁబడలేదు. ఆచోటున కెట్టయెదుట విశాఖుని గర్భగృహముండినది. అక్కడకుఁ బోయి పరిశోధించెను; ఏసూచనయుఁ గోచరించినది కాదు. అంతట వాఁ డా చోటు విడిచి వెలుపలకువచ్చెను. ఆ యాలయము వెనుకటిభాగము పర్వతముతోఁ జేరియున్న యొక పెద్దబండను దొలిచి నిర్మింపఁబడినట్లు గానవచ్చుటచేఁ బ్రదక్షిణముగఁ జుట్టివచ్చుటకు వీలులేకుండెను. కావున, వాని పరిశ్రమము వ్యర్థమయ్యెను.

ఆ వేళకుఁ బదిగంటలాయెను; సూర్యకిరణములకు వేఁడిమి హెచ్చుఁ జొచ్చెను. "ఇదేమివింత! దొంగలు భోషాణము మోసికొని కోవెలలోఁ బ్రవేశించుట కన్నులారఁ జూచితిని. ఇది చాక్షుషము! ఇంతకంటెఁ బ్రత్యక్షప్రమాణమువలదు. వారు, దాని నిందెచటఁ బదిలపఱచిరి? దాని జాడయు కన్పట్టలేదు. ఇచ్చట, నేలద్రవ్వి నిక్షేపించిరనుటకు సూచనలు లేవే !"

అనుచు మఱియొకతడవ ప్రాకారము లోవైపుననున్న గోడలను ముంగిళ్లను మంటపములను బరిశోధించెను. కాని, వాఁడు కృతకృత్యుఁడు కాఁడయ్యెను. ఎండకు వేఁడిమి హెచ్చు

చున్నట్లే పొట్టయుడుకునకును దీక్షత యధికమగుచు వచ్చెను. "కడుపుఁబని తీర్చుకొనివచ్చి పరిశోధించెదను గాక!" అని యా చోటు విడిచి పోయి పరిసరములం దున్న వృక్షముల పండ్లను గొన్నిఁటిని దిని నీరుద్రావి కొంత సేదదేరెను.

కొన్నిగడియలు గడచినవి; దేవాలయములోని రహస్య స్థలములను గనుఁగొన వలయునను తలంపు గలుగఁగా, తైలప నిముస మైనను విత పుచ్చక దేవాలయముతోఁజేరియున్న గుట్ట నెక్కిచూచెను. ఆవలివైపున నగాధమైన లోయ గాన్పించెను. ఆపల్లమునం దడుగుభాగమంతయు, పచ్చగ నోషధివర్గము మొల చియున్నట్లు గానవచ్చెను కాని, తానావైపునఁ గనుఁగొనవల సిన వైచిత్రి యేదియు నుండదని యూహించి వెంటనే గుట్ట దిగి దేవాలయముఁ జేరెను. "నే నీ దేవళములోఁ బరిశోధింపక విడిచిన చోటులెవ్వి?" అని తలఁచుకొనుచునే లోనికిఁ బోయెను. ఆలయము ప్రవేశించునప్పుడు వాఁకిలి కిరుప్రక్కల ద్వారపాలక విగ్రహములు ప్రతిష్ఠింపఁ బడి యుండినవి. అందు, ప్రతివిగ్రహము కాయపుష్టిగలిగి పెద్దకోఱపండ్లతో భీకరముగఁ గానవచ్చుచుండెను. ప్రతివిగ్రహము మూఁడడుగుల వెడలువును దానికిఁ దగిన యెత్తును గలిగి యుండెను. ఆ శిలా విగ్రహములు గదా దండము చేతఁబట్టుకొని యుండునట్లు చెక్కఁబడి యుం డెను. ఆవిగ్రహములను జూచునప్పుడే యువకునకు గోడలదళము జ్ఞప్తివచ్చెను. అంతట వాఁడు ప్రాకారములోనికిని వెలుపలకును బోయి గోడలకొలఁదిని బరీక్షింపఁగా, వెలుపల గోడల పైభాగము నిడివికిని, పక్షులు నివసించుటకేమొ రంధ్రములు వరుసగా వినిర్మి తములయి యుండెను. గోడలకు లోవైపున నా రంధ్రములు

గానరాకుండినవి. మరల, వెలుపలకువచ్చి యారంధ్రములను బరిశీలించి చూడఁగా, అవి గ్రద్దలు మున్నగు పక్షుల కంటెఁ బెద్దవి వసించుట కనువైనవిగాఁ గానవచ్చెను. అట్టి పక్షు లేరంధ్రమునందైన నివాసమేర్పఱచుకొని యున్నవా యని పరీక్షింపఁగా దానికిఁ దగిన సూచన యేదియును గోచరింపలేదు. గోడ యాఱడుగుల దళము గలిగియుండుటకును, ప్రక్క గోడల వెలుపల బొరియలేర్పడి మఱియొకవంక నవి లేకుండుట కును, పక్షుల నివాసమునకై యవి నిర్మింపఁబడ కుండుటకును వాఁడు మిక్కుటముగ సందేహించెను అంత, వాఁడు ద్వార పాలక ప్రమథుఁ డున్న చోటుఁజేరి, ఏమియుఁదోఁచక పోవుటచేఁ గొన్నినిముసము లచట మిన్నక నిలిచియుండెను.

సింహద్వారమున కిరుప్రక్కలనుండి గోడలుప్రారంభించు చున్నవి. అవి యారంభించు చోటులందే యావిగ్రహములు స్థాపింపఁబడియున్నవి. అందొక విగ్రహమునుబట్టి యూఁచెను; అది కదలలేదు. ప్రక్కకుఁ ద్రిప్పెను; తిరుగలేదు. విసుఁగొందక మఱియొకవిగ్రహమున్న చోటుఁజేరి యాతీరుననే చేసెను. అది కదలకపోయినను బ్రక్కకుఁ ద్రిరిగెను. కాని, తొంటియటులే ద్వారమాచ్ఛాదించి నిలిచెను. అప్పుడు, వానికిఁ బొడమిన సం తసమునకు మేర లేదు. అది తిరిగినప్పుడు, గోడలోన నొకవంక దారి యుండుటను వాఁడు సూక్ష్మబుద్ధిచేఁ గనుఁగొనెను. ఆ విగ్రహముయొక్క పీఠము నొద్ద బిస యమర్పఁబడియుండు టను గ్రహించి, దాని నావంక బలముగా నొక్కి యొరగిలి లోపలఁ బ్రవేశింపఁగానే, అది వానిని లోనికిఁ బోనిచ్చి తొంటి యటులే తిరిగి నిలిచెను.

ఒక్క మనుష్యుఁడు చేతులార్చుకొని ధారాళముగాఁ బోవఁగలిగిన త్రోవ యందేర్పడి యుండుటను గాంచి, తైలప, అకుడ్యాంతరాళమునఁ జుట్టివచ్చి మఱియొక ద్వారపాలకుని స్థాపించియున్న చోటుఁజేరెను. వాఁడు, ప్రదక్షిణాప్రదక్షిణ ములుగ నెన్నితడవలకుఁ జుట్టివచ్చినను వానికచ్చట నతిశయ మేదియుఁ గన్పట్టలేదు. "కుడ్యమధ్యమందిట్లీల దారియేర్పఱుచ వలయును? దీనివలనఁ గలుగు ప్రయోజనమేమి?" అని యాలో చించునప్పుడు వాని మది కొక సందియము దోఁచెను. "వ్యాఘ్రేశ లింగము గుట్టతో నానుకొనియున్నది; ఆ వంక కదియే ప్రహరి; పరిక్కగోడలయందువలెనే యచ్చటను మార్గమేర్పడి యున్నది; అది యాగుట్టను దొలఁచి చేసిన మార్గము. ఏదైన వింతవిషయమున్న నచ్చటనే గోచరింపవలయును" అనితలఁచి, ఆవైపున గోడను దడివి చూచెను. వెలుపల నేర్పఱచియున్న రంధ్రముల నుండి వెల్తురును గాలియును బాగుగాఁ బ్రసరించు చుండినవి. కావున, వాని స్పర్శేంద్రియ జ్ఞానమునకుఁ జక్షురిం ద్రియ వ్యాపారము గూడఁ దోడ్పడెను.

తైలప, నాలు గైదు తడవ లావలకీవలకు నడుచు చుండఁగా బోలుగానున్న యొక చోట నడుగిడుచున్నట్లు తోఁ చెను. అంత, వానిదృష్టి నేలవంకకు మరలెను. రెండడు గుల వెడల్పును మూఁడడుగుల నిడివియును గల ప్రదేశము మాత్రమే బోలుగానున్నట్లు వాఁడు గ్రహించెను; వెంటనే, కూర్చుండి నేలను దడివి చూడఁగా నది పలుచని ఱాతిపలక తలుపుగాఁ దెలియవచ్చెను. ఉపాయముతోఁ దానిని దెఱచెను; అందు గాలి చొచ్చునంతదనుక, కొన్నినిముసములు దొలఁగి

నిలిచెను. దిగువకు మెట్లేర్పడి యుండినవి. తైలప పదిమెట్లుదిగి యొక సమతలముఁ జేరెను. అది మైదడుగుల వెడలుపును నిరువదిమైదడుగుల నిడివియును గల మార్గము. వాఁడాదారినే పోయి నిలువఁగా నెదుట నొక కవాట ముండినది; బలము కొలఁది దానిని మోదఁగా నది తెఱచుకొనెను.

ఇది నఱకు వాఁడు సంచరించిన యందలి గూఢప్రదేశములకంటె నచ్చట బాగుగా గాలియు వెల్తురును బ్రసరించుచుండినవి. రెండువందల యడుగుల నిడివియును వందయడుగుల వెడల్పునుగల యాప్రదేశ మత్యద్భుత నిర్మాణమై, నిర్మాతను బెక్కువిధముల నుగ్గడించుట కనువైనదై యొప్పారుచుండెను. అందమర్చియున్న వస్తు సముదాయము తైలపను భ్రమకొలుపఁ జొచ్చెను. అందలి చిత్రపుఁబనులు సార్వభౌమునికొలువుకూటమునందు సైతము గానరావు; ఆ ప్రదేశము చుట్టుగోడలు, చంద్రకాంత శిలా వినిర్మితములై కనులు మిఱుమిట్లు కొలుపు ధవళకాంతులతోఁ దనరారుచుండెను. పార్శ్వములనుండియుఁ బైకప్పునుండియు, గాలియును వెల్తురును లోనికి వ్యాపించుటకుఁ దగిన మార్గము లత్యద్భుతములుగ నమర్పఁబడియుండినవి. పలు తెఱఁగుల కవచములు, వివిధములైన వధసాధనములు నచట నుండెను. సాధారణముగా నిరువదివేల యోధలు ధరించుట కనువైన శిరస్త్రాణ తనుత్రాణములును ఘోరములయిన యుద్ధసాధనములు నచ్చట నుండినవి. తైలప, ఓపికతో వానినన్నిఁటిని జూచుచుచరాఁగా, వీరావేశముచేఁ బారవశ్యము గలిగెను. ఒకచోట, తామ్రశాసన మొకటి యొకచీలకుఁ దగిలించి యుండిరి. తైలప, మిక్కిలి తొందరపాటుతోఁ దానిని జదివెను. అది,

సత్యాశ్రయబిరుదమును వహించిన రెండవ పులకేశివల్లభుని గూర్చి తెలుపునట్టి తామ్రశాసనము. అందు—

"సమరసంసక్త సకలోత్తరాపథేశ్వర శ్రీహర్షవర్ధన పరాజయోపాత్త పరమేశ్వర శబ్దః" అన్న యక్షరములను జదివెను.

కన్యాకుబ్జనగరమును రాజధానిఁ గావించికొని యుత్తరాపథమంతటికి నేకచ్ఛత్రాధిపత్యము వహించి పరిపాలించిన శ్రీహర్షవర్ధన చక్రవర్తి, దక్షిణాపథమంతయును జయించి తీరవలయునని, అఱువదివేల గజములను లక్షయశ్వములను నసంఖ్యాకులగు పదాతులను గల ప్రచండసైన్యముతోఁ గదలి పులకేశి సత్యాశ్రయుని మీఁదికి రాఁగా, ఆతఁడా సార్వభౌము నెదుర్కొని ఘోరముగాఁ బోరి జయించి, పరమేశ్వర బిరుదమును వహించెను. ఆ తరుణమందు పులకేశి, శ్రీహర్షుని భటులు నర్మదానది దాఁటి యడుగిడనట్లు వెన్నంటియుఁ దరిమెను. రణరంగమందులభించిన పగవాని వస్తువులే యాచోటఁ బదిలము చేయఁబడినవి. లెక్కయిడుటకుఁగాని సువర్ణములును, మూర్ధాభిషిక్తులు ధరించిన కిరీటాంగదాద్యాభరణములును మిక్కుటముగ నచట నుంచఁబడియుండినవి. వానిని జూచునప్పుడు, త్రైలపకుఁ బొడమిన యాశ్చర్య మింతంత కాదు. తనకూటస్థులగు పురుషులలోఁ బ్రఖ్యాతుఁడు శ్రీ పులకేశి మహావల్లభ సత్యాశ్రయుఁడు; అతఁడు శ్రీహర్షవర్ధనుని సంగ్రామప్రియుని ఘోరముగఁ దాఁకి భయకంపితునిఁ జేసి పాఱఁదరిమె ననుటయు, ఆతనివంశమునఁ బుట్టి యజ్ఞాతవాసము సలుపుచు నిర్జనారణ్యగర్భమందలి యొక శైలాంతరాళమున నిలిచియుండి, దుర్దశాహతుఁడై చెన్నఱియున్న వీరయువకుఁడు తెలిసికొనినప్పుడు, అందులకు నిదర్శ

నములైన వస్తువులను జూచినప్పుడు, వానిచిత్తమం దెన్నితలంపులు గలిగెనో వాఁడెట్టియవస్థకుఁ బాల్పడెనో చదువరులే యూహించి తెలిసికొనవలయును.

"పులకేశి సార్వభౌముని ఖడ్గరాజమును గేలఁగీలించి, అజిత తురంగమా రోహించి విరోధివరూధినుల పైఁబడి యుద్వృత్తుగ జయించి తొల్లిఁటి చాళుక్యుల ప్రతాపము వెలయింపక వేఱొండుకార్యమున కుపక్రమించుటలేదు" అని తైలప తీర్మానించుకొనెను.

ఇవ్విధముననే, తైలప యాచోటఁ బదిలముచేసియున్న వస్తువులను శాసనములను, ఒడంబండికలను, భూషణములను, యుద్ధసాధనములను బ్రత్యేక ప్రత్యేకముగాఁజూచుచు వచ్చునప్పుడు, వానికి నాఁటిరేయిచూచిన కళింగరాజు భోషాణము జ్ఞప్తివచ్చెను. అది యక్కడ నెచటను గనఁబడలేదు. అప్పుడప్పుడు దొంగలించి తెచ్చిన ధనసంచయ మచ్చటఁ దాఁచునట్లు దొంగలాడినమాటలు తైలప వినియుండెను గదా! అట్టి వస్తువులలో నతఁడు సందేహింపఁదగిన దెదియు గోచరింపలేదు. ఏలనఁగా నచట నున్నవన్నియు శ్రీహర్షవర్ధనునిఁ జెందిన వస్తువులే.

క్రీ. శ. 620-వ సం|| ప్రాంతమందు, పులకేశివల్లభుఁడు హర్షవర్ధనుని జయించెను. ఆకాలమందే రణరంగమునఁజిక్కిన వస్తువులు దాఁచియుంచునట్లు తటస్థించెను. ఈ సంభవమునకుఁ బిదప, తైలప యాచోటుఁ జేరునప్పటికి రమారమి 350 సం|| లు గడచియుండెను. అంతకాలము గడిచినను నచ్చటనుంచియున్న వస్తువులు నాఁడు మెఱుఁగిడినట్లు నూత్నకాంతులతో నొప్పారుచుండినవి. నేలపై ధూళిక్రమ్మియుండెను. ఆచోటఁ దాను

ప్రవేశించునప్పుడు మనుష్యుల యడుగులజాడ కన్పట్టలేదు. తనయడుగులు మాత్రమే విస్పష్టముగఁ గానవచ్చెను. ఈకారణములచేత దొంగలాప్రదేశము త్రొక్కి యెఱుఁగరని వానికి స్పష్టమయ్యెను. అప్పుడు, వానిగుండె బరువుదొలఁగి యుత్తరోత్తరము దాను మెలఁగవలసిన పద్ధతులు వానిమదికి స్ఫురింపఁ జొచ్చెను.

అయినను, 'దొంగలు తమదోఁపిడి ధనమెచ్చటఁజేర్చిరి?' అనెడి శంక వానియెదనుండి తొలఁగలేదు. ఈశంక, తైలపకుపైఁబైని బలమగుచు వచ్చిన కొలఁదిని, ఆప్రదేశమందలి గోడలను బరీక్షించెను. తానువచ్చినద్వారమున కెదుట నొకద్వారమున్నట్లు సూచన లేర్పడినవి. మిక్కిలి నిపుణతతో గోడవలెనే చెక్కియున్న యొకపలక తాయి, తలుపుగా నుపయోగింపఁ బడియుండెను. దానియోరలను సూక్ష్మదృష్టితో బరిశీలించి తలుపని నిర్ణయించుకొని మోఁదెను. అది కీలుతలుపగుటచేత, సులభముగాఁ దెఱవఁబడి మార్గ మొసఁగెను. ఆదారియూతేడడుగుల వెడలుపుగలదై చదునుగా నుండెను. దానివెంబడి నేకొన్నియడుగులు నడిచిపోఁగా దాని ముఖమొక బండచేమూయఁబడియుండెనుగాని యొకమనుష్యుఁడొదిగి పోఁ గటకనువుగా నొకవంకదారియేర్పడి యుండెను. అతఁడా సంకుచిత మార్గమునుండి వెలికి నిర్గమించి యొకకొండ యొక్కనితంబ ప్రదేశముఁ జేరెను.

తైలప, ఆచోటనిలిచి గోడవలె చుట్టుప్రక్కలనున్న గుట్టలవరుస విస్తారప్రదేశము నావరించుకొని యుండుటను జూచెను. తొల్లి యొకప్పు డాస్థలము విశాల రమణీయ విహారవనమై యుండెననుటకు సూచనలేర్పడక, ముండ్ల

పొదలు పెరిఁగి యడవిపడి యున్నప్పటికిని, అది వాసయోగ్య మయిన ప్రదేశమగుట నతఁడు గ్రహించెను. వాఁడు నిలిచి యున్న చోటునుండి సమతలము దనుక మిక్కిలి మోటుగా నున్న మెట్లు కొన్నియుండినవి. అవి, చెట్లు చేమలు మొలచుట చేతఁ బెల్లగిలియుఁ దొలఁగియు నున్నప్పటికిని నేలవంకకు దిగి పోవుట కనుకూలించియే యుండెను. ఆ యడవిపడిన ప్రదేశ మునందుఁ గనుఁగొనవలసిన దే మున్నది నని నిస్పృహుఁడు గాక, దాని మార్గము గూఢముగా నమర్పఁబడి యుండఁ బట్టి, తన యభ్యుదయమునకు వలయునవియన్నియు నచటనే కలవని యూహించి, తైలప మెల్లమెల్లఁగ నా మెట్లుదిగి సమ తలముఁ జేరెను. అందుండి చుట్టు ప్రక్కలఁ జూచెను; తాను దిగియున్న ప్రదేశము నందువలెనే చుట్టును దట్టముగఁ జెట్లు మొలచియుండినవి. అచటనుండి వెలుపలకుఁ బోవలసి వచ్చినప్పుడు తొట్రుపడకుండుటకై, తాను నిలిచియున్న చోటఁ గొన్ని బండలు పేర్చియుంచి లోనికిఁ జొచ్చెను. ముండ్ల పొదలు దట్టముగా పెరిఁగియున్నప్పటికిని, వివిధములయిన ఫల వృక్షములు లెక్కకు మిక్కుటములై కానవచ్చెను. సర్వర్తుకము లయిన ఫలవృక్షములయందు, లోచనగ్లాని నొనర్చి మనస్సు నకుఁ దనివి గలిగించు పండ్లు మిక్కుటముగ నుండినవి. అందలి పొదలనన్నిఁటిని నఱికివైచినచో నా ప్రదేశము భూలోకనందన వనమై చెన్నెసఁగుననుటకు సందియమేయుండదు. తైలప యా వనముచుట్టి వచ్చునప్పుడు, "వీరనాథనై యసూర్యంపశ్యగా నంతఃపుర సీమల వెలయుచు, కాలనాథుని క్రోధమునకుఁ జిక్కి చెన్ను చెదరి వికృతవేషనై వనవాటికల దేహయాత్ర గడుపు

యోషిద్రత్నమువలె నాయుద్యానవనము గోచరింపఁగా దాని విధమునకు యువకుఁడు పెల్లుగఁ జింతిల్లెను.

ఆఁపరానిశోకము వెతకొలుపుచుండఁగా, యువకుఁడు కొంతవఱ కావనమందుఁ దిరుగులాడి యొకవంక నల్పతోయ మైన సరసిని జూచెను. అది పూడిపోయి యప్పటి కావిధముగఁ గానవచ్చుచున్నను, తొల్లి, అతిశయానంద జనకమైన కమలాకరముగ నుండెననుటకుఁ గొన్ని సూచనలు గన్పట్టుచుండెను. యువకుఁడు దానిని జూచుచుండు నప్పుడే యచటనొక ప్రక్క రమణీయమైన శిలావేదిక యొకటి గానవచ్చెను. వాఁడల్ల నల్లనఁబోయి యాతిన్నెను జేరి యించుక విశ్రమించెను. వాఁడా ప్రదేశముఁజేరి తనపూర్వికుల విస్మృత చరిత్రమును, వారి పరాక్రమాతిశయమును సూచించు నిదర్శనములను గనుఁగొని, తొంటి చాళుక్యసామ్రాజ్యమును మరలఁ బ్రతిష్ఠింపఁదలఁచి దీర్ఘాలోచన చేయుచున్న సమయమందుఁగూడ, మల్లప దళపతి తనయెడ ననుగ్రహించి యొసఁగిన పెద్దలనాటి ఖడ్గమును జేవదలకుండెను.

ఆవేళకు సూర్యుఁ డపరగిరినిగూర్చి పయనముసేయఁ జొచ్చెను. తైలప, తనఖడ్గమును దుస్తుల నావేదికపైనుంచి యా జలాశయమునఁ దన సొమ్ము దీఱునట్లు క్రుంకులిడి లేచెను. పిమ్మట, పరిసరములనున్న వృక్షములనుండి కొన్ని ఫలములు దెచ్చి యాఁకలి దీఱఁ దిని తృప్తిచెందెను; శరీరాయాసము దీఱుటకై యా వేదికనుజేరెను గాని పలువిధములైన యాలోచనలు వాని మది నుండి తొలఁగ లేదు.

## పం(డెండవ ప్రకరణము

### శ్రీముఖము

కల్యాణ నగరమం దెచ్చటఁ గాంచినను పౌరులు పర మానంద భరితులయి వసంతోత్సవము జరుపుచుండిరి. రాణిబొంక దేవి, చెలికత్తెలతోడ నుద్యానవనమందు వసంతమాధవు నారా ధించుటకు సమకట్టి యుండెను. విక్రమాదిత్య మహారాజు సైత ముద్యానమందే యుండెను. ఆతఁడొక తరువరచ్ఛాయనున్న వేదికపైఁ గూర్చుండి, మాన్యఖేట నగరమునకుఁ బోయియున్న కుమారునిఁగూర్చి తలపోయుచుండెను. అదివఱకతని కొడు కును గూర్చి యెట్టి సంగతియుఁ దెలియరాకుండెను. "వాఁడు, చక్ర వర్తి యనుగ్రహ పాత్రుఁడయి సుఖముగ నున్నాఁడో, లేక, నిగ్ర హాస్పదుఁడయి రూపఱినాఁడో?" అని మెఱపుమెఱసినట్టు లతని మదిని సందియము పొడమెను. ప్రేమాస్పదులయెడ జనులకిట్టి శంకలు సాధారణముగఁ బొడముచుండును. ఈశంక దోఁచఁ గానే గుండె జల్లుమని చెమ్మటగ్రమ్మెను. "నిత్యవర్షుఁ డిట్టిఘోర కృత్యమునకు సాహసింపఁడు" అని యేదో సమాధానము దెచ్చికొన్నను, ఆతని హృదయము గారణములేని వెతకుఁ జోట య్యెను. రాణి, తనపూజావిధులను దీర్చుకొని రాజునొద్దకు వచ్చెను. చింతావిలుఁడయిన విక్రమాదిత్యునకు దేవి సమీప మందుండుట దెలియదు. రాజు, దేవిని తనబాహ్యప్రాణముగఁ బ్రేమించుచుండెను. బొంకదేవి, ప్రఖ్యాతుఁడైన చేది దేశాధి పతి పుత్రిక.

"రాజుగారిట్లెన్నఁడు నుండలేదు. గాఢమయిన చింత వీరిహృదయ మావరించి యుండుటకేమి కారణము? రాజునకుఁ

బారవశ్య మొనఁగూర్చు సంభవములును ఘటిల్లింపవే?" అని డోలాందోళిత మనస్కుఁడై యతని మ్రోల నిలిచెను. ఇదివఱకు నంతర్హితమైయున్న ధైర్యలక్ష్మి బహిర్గతమై పొలిచెనో యనఁ దన కట్టెదుటనిలిచియున్న దేవినిజూచి, మనస్సు స్వాధీనము నకుఁ దెచ్చికొని, చింత వెలికిఁ గాన్పింపక మందహాసముచే మాటుపఱిచి, "దేవీ! రమ్ము, దాఁపునకు రమ్ము; కూర్చుండుము. ఏల యన్యవలె నిలిచెదవు?" అని బుజ్జగించెను.

అప్పుడు, బొంకదేవి యతని సమీపమందుఁ గూర్చుండి, "ప్రాణేశా, దేవరవారి నిందాఁక ఁగలవరముపాలు చేసిన యిక్కట్టెట్టిదో? నేను విననగునేని యానతీయవలయును" అని పెనిమిటిని మందలించెను. ఆమాటలకు విక్రమాదిత్యుఁడు, "హృదయేశ్వరీ! ఏదో పరాకున నీవు వచ్చుటను గుర్తింపనైతిని. నీవు చెప్పినట్లు నామనస్సున కేకలవరమునుగన్పట్టదు" అని చెప్పుచుండఁగానే యొకవృద్ధుఁ డచ్చటకువచ్చి, "హా, మహారాజ! ఏమి చెప్పుదును! ఏమని చెప్పుదును? మన సంస్థానము మునిఁగినది; మన సామ్రాజ్య మడుగంటినది; అక్కటా! ఈదుర్వార్త తెలుపుటకై దేవుఁడు నన్ను సృజించెనేమో?" అనుచు దుఃఖాతిశయమున మాటాడలేక నిలిచియుండెను. రాజు, అంతకుమున్నె వ్యాకులిత హృదయుఁడై యున్నందున, వాఁడు చెప్పనున్న దుర్వార్తకై యతనిడెందము కుందదయ్యెను. ఆమాటలకు రాణి యులికిపడి, "హా, కంచుకీ! మనసంస్థానము మునిఁగెనా? ఏల యట్లనెదవు? ఏమి ఘోరకార్యము పుట్టెను?" అనెను.

కంచుకి, చెదరిపోయిన మనస్సును దనయధీనమునకుఁ దెచ్చుకొని, రాణిగారి ప్రశ్నకుఁ బదులుపలుకునంతలో రాజ

## పన్నెండవ ప్రకరణము

## శ్రీముఖము

కల్యాణ నగరమం దెచ్చటఁ గాంచినను పౌరులు పరమానంద భరితులయి వసంతోత్సవము జరుపుచుండిరి. రాణి బొంకదేవి, చెలికత్తెలతోడ నుద్యానవనమందు వసంతమాధవు నారాధించుటకు సమకట్టి యుండెను. విక్రమాదిత్య మహారాజు నైత ముద్యానమందే యుండెను. అతఁడొక తరువరచ్ఛాయనున్న వేదికపైఁ గూర్చుండి, మాన్యఖేట నగరమునకుఁ బోయియున్న కుమారునిఁగూర్చి తలపోయుచుండెను. అదివఱ కతని కొడుకును గూర్చియెట్టి సంగతియుఁ దెలియరాకుండెను. "నాఁడు, చక్రవర్తి యనుగ్రహ పాత్రుఁడయి సుఖముగ నున్నాఁడో, లేక, నిగ్రహాస్పదుఁడయి రూపడినాఁడో?" అని మెఱపు మెఱసినట్లు లతని మదిని సందియము పొడమెను. ప్రేమాస్పదులయెడ జనులకిట్టి శంకలు సాధారణముగఁ బొడముచుండును. ఈశంక దోఁచఁగానే గుండె జల్లుమని చెమ్మటగ్రమ్మెను. "నిత్యవర్షుఁ డిట్టి ఘోరకృత్యమునకు సాహసింపఁడు" అని యేదో సమాధానము చెప్పికొన్నను, అతని హృదయము కారణములేని వెతకుఁ గోటయ్యెను. రాణి, తనపూజావిధులను దీర్చికొని రాజునొద్దకు వచ్చెను. చింతాకులుఁడయిన విక్రమాదిత్యునకు దేవి సమీపమందుండుట తెలియదు. రాజు, దేవిని తనబాహ్యప్రాణముగఁ బ్రేమించుచుండెను. బొంకదేవి, ప్రఖ్యాతుఁడైన చేది దేశాధిపతి పుత్రిక.

"రాజుగా రిట్లెన్నఁడు నుండలేదు. గాఢమయిన చింత వీరిహృదయ మావరించి యుండుటకేమి కారణము? రాజునకుఁ

భారవశ్య మొనఁగూర్చు సంభవములును కటస్థింపవే?" అని శోకాందోళిత మనస్కయై యతనిమ్రోల నిలిచెను. ఇదివఱకు సంతిష్ఠితమైయున్న ధైర్యలక్ష్మి బహిర్గతమై పాలిచెనో యనఁ దన కెదుటనిలిచియున్న దేవినిజూచి, మనస్సు స్వాధీనమునకుఁ దెచ్చికొని, చింత వెలికిఁ గానరాక మందహాసముచే మాటుపఱచి, "దేవీ! రమ్ము, దాఁపునకు రమ్ము; కూర్చుండుము. ఏల యన్యవలె నిలిచెదవు?" అని బుజ్జగించెను.

అప్పుడు, బోంక దేవి యతని సమీపమందుఁ గూర్చుండి, "ప్రాణేశా, దేవరవారి నిందాకరఁ గలవరముపాలు చేసిన యిక్కట్టులెద్దో? నేను వినఁదగునేని యానతీయవలయును" అని పెనిమిటిని మందలించెను. ఆమాటలకు విక్రమాదిత్యుఁడు, "హృదయేశ్వరీ! ఏదో పరాకున నీవు వచ్చుటను గుర్తింపనైతిని. నీవు చెప్పినట్లు నామనస్సున కేకలవరమునుగన్పట్టదు" అని చెప్పుచుండఁగానే యొకవృద్ధుఁడచ్చటకువచ్చి, "హా, మహారాజ! ఏమి చెప్పుదును! ఏమని చెప్పుదును? మన సంతానము మునిఁగిపోయినది; మన సామ్రాజ్య మడుగంటినది; అక్కటా! ఈదుర్వార్త తెలుపుటకై దేవుఁడు నన్ను సృజించెనేమో?" అనుచు దుఃఖాతిశయమున మాటాడలేక నిలిచియుండెను. రాజు, అంతకుమున్నె వ్యాకులిత హృదయుఁడై యున్నందున, వాఁడు చెప్పుచున్న దుర్వార్తకై యతనిచెంతను కుందదయ్యెను. ఆమాటలకు రాణి యులికిపడి, "హా, కంచుకీ! మనసంతానము మునిఁగెనా? ఏల యట్లనెదవు? ఏమి ఘోరకార్యము పుట్టెను?" అనెను.

కంచుకి, చెదరిపోయిన మనస్సును దనయధీనమునకుఁ దెచ్చుకొని, రాణిగారి ప్రశ్నకుఁ బదులుపలుకునంతలో రాజ

కుటుంబమందు మిక్కిలి చనువుగలిగి మెలఁగుచున్న యువకుఁడొకఁడచ్చటకుఁ దొందరగా వచ్చెను. అచటనున్న వారి చూపులు వాని వంకకు మరలెను. దానివలన దేవి యుత్కంఠ కొంత మందమగుటేగాక, కంచుకి బదులు పలుకుటకును గొంత తామస మయ్యెను.

అంతలో, విక్రమాదిత్యుఁడు కలవరముదీఱి యటకు వచ్చియున్న యువకునిఁ జూచి, "నాయనా, శ్రీధరా! ఏల నిలిచెదవు? రమ్ము; ఇచ్చటఁగూర్చుండుము" అనియొక చోటుఁ జూపి కూర్చుండఁబెట్టి, వృద్ధునిఁ జూచి, "కంచుకీ, ఏమంటివి? ఏదోపరాకున నీమాటలు విననైతిని" అనెను.

కంచుకి, "మహారాజ! ఏమనుమనెదరు? మనసంస్థానము మునిఁగెను; అచట మాన్యఖేటమందు యువరాజుగారికిఁ బ్రాణాపాయ మొనఁ గూడెనని మనవార్తాహరుఁడు శాండిల్యుఁడు, నాతోఁజెప్పి తొందరగా మీకు నివేదించుమనట్లు పంచెను. పిడుగు వంటి యీదుర్వార్తను మీకుఁదెలుప నేనుబుణ్యము కట్టుకొంటిని" అనెను.

ఆ దుర్వార్త, బాణమై విక్రమాదిత్యుని యొక్కయుఁ జేదిరాజపుత్రిక యొక్కయు హృదయసీమలను గాడి వెడలిపోవుటకు మున్నే శ్రీధరుఁడు, "కృష్ణకృష్ణ, అపవాదదోషము శమించునుగాక!" అని, "కంచుకీ! సరి, నీపనియైనదిగదా! నీవింక దొలఁగియుండుము" అని వానినచ్చటనుండి తొలఁగించి, "మహారాజ! ఇదియపవాదము. మనయువరాజుగారికి మాన్యఖేటమందుఁ బ్రాణాపాయ మొనఁగూడె నన్నమాట నిజమే. కాని, ప్రాణ భయములేదు" అని మందలించి పెద్దిభట్టు తనకుఁ

గొప్పపనియుండి సార్వభౌముని రాయబారి వచ్చియున్నాఁడు; ఆజ్ఞపాలించినయెడలఁ బిలుచుకొని వచ్చెదను" అనెను. "సరి, అలాగే చేయుము" అని మహారాజు వాని కానతిచ్చెను. దేవి, దాపున నున్న లతా గృహము చాటునకు వెళ్లెను. అదివఱకు శ్రీధరునితో సంభాషించుచున్న రాజు, రాయబారి విచ్చేసిన మాట వినఁగానే గొప్పకలవరమునకు లోనయి, ఖట్టిగుఁడేదో ఘోరమయిన పన్నాగము పన్ని రాయబారిని బంపి నట్లూహించెను. అంతలో రాయబారియు నాచోటుఁ జేరెను.

విక్రమాదిత్య మహారాజు, తనయున్నెడకు విచ్చేసిన రాయబారి నుపచరించి కూర్చుండఁ బెట్టి కుశల ప్రశ్నలు జరిపి, అతఁడు వచ్చిన పనినిగూర్చి యుందలించెను. వాఁడు, గుటకలు మ్రింగుచుఁ గొంతవడికి మహారాజును జూచి, "దేవరా! సార్వభౌము లీశ్రీముఖము తమకిచ్చుటకు నన్నుఁబంపిరి. దీనిని జిత్తగింతురేని సర్వము చిత్తమునకు వేద్యము కాఁగలదు" అని రాజముద్రతోడి కమ్మ నతని చేతికందియఁ బోఁగా శ్రీధరుఁడు లేచి దానిని దీసికొని, రాజాజ్ఞపైఁ జదివిసంగతులు వినిపించెను.

అంత, విక్రమాదిత్యుఁ డా రాయబారిని జూచి, "దేవర యిష్టానుసారమే చేయుదు"మని మీరాజుతో విన్నవింపుఁడు: అయినను వారుసెలవిచ్చినట్లు త్వరలో సైన్యముల సమకూర్చుకొనిరాలేము. అందులకుఁ గొంత వ్యవధి కావలసి యున్నది.

రాయ—దేవరా, తమకుఁ దెలియని యంశ మేమున్నది? ఆ శ్రీముఖము, "ఆజ్ఞాపత్ర"మని భావింపరైతిరే!

విక్ర—ఏమనెదవు? మీమాటల కర్థము గాదు; మీ భావము స్పష్టముగఁ దెలియకున్నదే!

యున్న, ముందు సార్వభౌమునకు ప్రేమ యొనఁ గూర్పక,
ఇంతకే పొడిచి పొలియించి యుండనా ?—" అని యింకనేమో
చెప్పనారంభించు చుండునప్పుడే, శ్రీధరుఁడు వాని బొంకము
లకు బిట్టలిగి, ఒఱనుండి ఖడ్గముదూసి వానిపైఁ బడఁబోయెను.
అంతలో విక్రమాదిత్యుఁడు, "ఆఁగుము! శ్రీధరా, ఆఁగుము!
దూతి లెందు సవత్నులనుట నీకుఁ దెలియని యంశమా ? ఆఁ
గుము" అని నుండలించెన.

అట్టియెడ రాయబారి శ్రీధరునిఁ జూచి, "ఓరిపండ!
ఈనామనుజుఁడు మన్నించుచున్నాఁడని యెంతదిటవు గొంటివి!
నీయువరాజువంటి వానిని గెడపి సార్భ్వను నాకు నీవేపాటివాఁ
డవు? నోరుమూయుము" అని రాజును జూచి, "ప్రముఖముల
కేమి బదులు పలికెదవు" అని యాలోచించి పలికెను.

శ్రీధరుఁడు, "మహారాజ! ఈ పలువను బొరికొనుట దోష
మని యానతిచ్చెదరా? వీనిని దూతియని
దూతకాఁడు; చావునకు బెదరి దూతివేష మూని వచ్చిన మహా
ద్రోహి; వీనిని గర్భశత్రువని నమ్ముఁడు. మనకు నుడుమగఁ దెలు
పక, నిష్కారణముగ మనసగరమును ముట్టడివేసిన కుత్సితుఁడు;
వీఁడు దేవర మన్ననకుఁ దగఁడు; నాకు వీఁ డెంతమాత్రము, వీని
సైన్యమెంతమాత్రము?" అనుచునే హఠాత్తున వానిఁ దార
సించి యవలీల వాని కంఠము ద్రుంచెను; ఆ వడికి శిరము
కొన్ని గజముల దూరము నొర్లిపడెను.

విక్రమాదిత్యుఁడు శ్రీధరుని చేఁతకు మెచ్చి యతని
శౌర్యమును సమయోచిత ప్రతిభను పెక్కువిధములఁ బొగడెను.
అంత, రాజు శ్రీధరునితో నాఁచోటువిడిచి కార్యాలోచన సేయ

గడియకోలఁగ నుంచెను. కాని, దేవళములోని యశుద్ధములు దొలఁగించి, వ్యాఘ్రేశ గర్భాలయము శుద్ధపఱచి యుంచునంత యవకాశము వానికి లభింపదయ్యెను. వాని కింకను దొంగలు గనుఁగొని యున్న రహస్యస్థలము గోచరింపకుండెను.

ఒకనాడు, తైలప దేవాలయము నిర్గమించి వెలుపలకు వచ్చెను. తానాయరణ్యము ప్రవేశించి, బసచేసిన వటవృక్షము నీడఁ జేరెను. ఏదోజ్ఞప్తిరాఁగాఁ బైకి తలయెత్తిచూచెను. కొన్నాళ్లకుఁబూర్వ మొకరేయి యంతయు వెడలఁబుచ్చఁదలఁచి శాఖామూలమునఁ గట్టియుంచిన పల్యాణాదులు దృష్టిగోచర మయ్యెను. వెంటనే వాఁడు చెట్టెక్కి, వానిని నేలఁబడవైచి తిన్నఁగా దిగెను. అంతట తన నోటి కిరుప్రక్కలఁ బాణితలము లడ్డువెట్టి బిగ్గఱగా, "అజితుఁడా! అజితుఁడా!" అని నాలుగు వైపులకును దిరిగి తిరిగి కేకలు వేసెను. కొన్ని నిమిషములలోనే బాణవేగమున నజితతురంగము పేరెమువాఱుచుఁ దైలప యొద్ద కువచ్చి నిలిచెను. దానిరాఁక, తైలప హృదయమున కద్భుతరస మతివేలముగ నించెను. "ఆహా, ఇట్టి యుత్తమాశ్వము నేను గన్నదిలేదు; విన్నదియును లేదు. దీని తెలివినిగూర్చి యెంత పొగ డినను దనివి తీఱదు. ఉచ్చైశ్శ్రవమను నశ్వము మిగుల నుత్కృ ష్టమైన దని పురాణముఖముల వినెదము. కాని, చూచినవారము గాము. ఇది దానికంటె నుత్తమ మయినదనుట కెంతమాత్రము సందియములేదు" అని యనుకొనుచు, దానివెన్నును దడవి తట్టి యిచ్చెను. దానిపైఁ బల్యాణమువైచి కళ్లెము దగిల్చి, దాని మోము నిమురుచు, "అజితుఁడా! దేవాలయ పరిసరప్రదేశము లను జూచివత్తమా?" అనుచు దాని నారోహించెను.

వాఁడు, వెడలునప్పుడు రమారమి యొకగంట లుండును. అప్పటికి సూర్యుఁ డపరవారాశిలో మునుఁగక దిఙ్ముఖము గీఱపైఁ బొలుపాఱుచుండెను. కడుపార నెరదిని పక్షినికరములు వృక్షకోటరములను గులాయములను గూర్చి పోవుచుండినవి. సాయంసమయ హిరణ్మయ జ్యోతిర్మండలము, ప్రాఁదిగాఁ బెరిగిన చెట్ల లేఁజిగుళ్లపై, రమణీయ కిరణజాలములఁ బ్రసరించి, వృక్షోపరిభాగములు స్వర్ణపట కుటీరము లనెడి భ్రాంతిని గలిగించుచుండెను. మనుష్యమాత్రుఁడు ప్రవేశించి సంచరించుటకు వీలులేని దుర్గమ కంటక ప్రదేశములయం దాగుఱ్ఱము దిక్కులి మెలఁకువతో మెల్లమెల్లఁగా నడచిపోవుచుండెను. కొంత దవ్వేగిన పిదప, భూవనిత శ్వేతాంబరము వీడ్చివైచి కెంబట్టు వలిపము ధరించెనో యన సంజకెంజాయ యెల్లెడలఁ బర్వెను. ఎట్టివానిని వంచించి, వానిచిత్త మపహరించు సామర్థ్యముగల ప్రకృతి శోభకుఁ దైలప లోఁబడక, తాను బోవుచున్నమార్గమును దాని పరిసర ప్రదేశములను బరిశీలించి చూచుచు నచ్చటచ్చటఁ గాన వచ్చు బృందావన వేదికలను మొండి గోడలను విఱిఁగి కూలిన మంటపములను జూచి, "హా, కాలనాథుని దివ్యశక్తి యద్భుతమైనది! మహారణ్యములను మహానగరములుగాను జనపదములను నిర్జ నారణ్యములు గాను, సముద్రములను సమ తలములు గాను, పీఠభూముల నగాధ సాగరములుగాను మార్చివైచు నపారశక్తి మఱి యేదైవతమునకుఁ గలదు? ఈ భయంకరారణ్యసీమ, కొన్ని శతాబ్దులకుఁ బూర్వము మహోన్నత దశయందున్న నగరరాజ మైనట్లు నిదర్శనములు గన్పట్టుచున్నవి. ప్రపంచమందుఁ బ్రతిప్రాణికిని బ్రతివస్తువునకును వృద్ధిక్షయము లేర్పడి

యుండుటయీయాశ్వరోద్దేశము కాఁబోలును" అని నిట్టూర్పునిగిడ్చి
తలయెత్తి చూడఁగా నీశాన్య దిశగాఁ జనులు కొందఱు పోవు
చుండిరి.

వారా వైపున నున్న యొక బాటవెంబడివచ్చి, యువ
కుఁడు వెళ్లుచున్నదారికిఁ బ్రక్క నేర్పడియున్న మార్గమును జేర
వలసియుండెను. ప్రయాణికు లా యడవిదాఁటవలసి నప్పు
డదియే మార్గము. అది మనుష్య సంచారమునకుఁ దగినమార్గ
మగుటంబట్టి, విశేషించి చెట్లుచేమలు కానరావు. ఆ దారి కిరు
ప్రక్కల దట్టమయిన యడవి. కాఁబట్టియే చెట్లచాటునుండి
యామార్గమునఁ బోవుచున్నజనులను యువకుఁడు బాగుగా
గుర్తింపఁ గలిగెను. వానినిగాని వాఁడెక్కియున్న గుఱ్ఱమునుగాని,
మిగుల దాపునఁ బోవుచున్నప్పుడా గుంపులోని వాఁడెవ్వఁడును
జూడఁడయ్యెను. శైలప, ఆగుంపులోఁ దా నింతకుమున్ను చూచి
యున్న కొందఱు దొంగలను గుర్తింపఁగలిగెను. దాదాపుగా
నఱువది డెబ్బది జనులను గల యామూక దొంగల గూడెమును
జేరినదని యువకుఁ డూహించెను.

ఎనమండ్రు బోయ లొక్క పల్లకీని మోసికొని వారివెం
బడి వెళ్లుచుండిరి. ముందేగుచుండిన దొంగల చేతులలో మూట
ముల్లెలు లేక యాయుధము లుండినవి. ఒకవేళ పల్లకీలో ధనరాశి
యుండునేమో యని శైలప శంకించెను గాని, వాహకులవలీలగా
నాయానము మోసికొని పోవుటను జూచి దానిలో మనుష్యుఁడే
కూర్చుండి యుండునని యూహించెను. అటులేయైన నామను
ష్యుఁడు దొంగలనాయకుఁడగు నాయని సందేహించి, తొందరగా
వానిని గూడముట్టెద నని యుంచుక తొట్రువడెను. కాని, వానికి

నందున్నవాఁడు నాయకుఁడే యనుటకుఁ దగిన నిదర్శనములు స్ఫురింపవయ్యెను. అందలమునకుఁ బ్రక్కతలుపులు బిగింపఁబడి యుండినవి; అంతేగాక, దానికి ముం దేగుచున్న దొంగలు నవ్వుచుఁ గేకలిడుచు నొండొరుల నెకసెక్కెము లాడుచుఁ బదములు పాడుచు నిచ్ఛానుసారము మెలఁగుచుండిరి. నాయకుఁడున్నప్పుడట్టి మెలఁకువలకు వీలుగలుగదే యని తైలప తలఁచెను.

"అటులైన నాయందలమునందే ముందును? అదేదో గొప్పవస్తువుగా నుండిననే వీరింత పదిలముగా దానిని దీసికొని పోవుట తటస్థించును. నేను దానిని తప్పక కనుఁగొనవలయును" అని తైలప తీర్మానించుకొని కళ్లెములాగిపట్టి తనమోమువాంచి, "అజితుఁడా, ఈగుంపును వెంబడింపుము" అని దానిచెవుల దాపునఁ జెప్పి దానిమెడనుదడివి తట్టి యిచ్చెను.

ఆ యశ్వము, వానియభిప్రాయము తెలిసికొన్న దానివలె గిఱ్ఱుమని పిఱిఁదికి దిరిగి, కొంతదూరమువచ్చి, ప్రక్కకుమరలి దొంగలేగుచున్న త్రోవనుజేరెను. దొంగలకును యువకునకును నడుమ నిరువది ధనువుల దూరమేర్పడి యుండవచ్చును. నలువలంకులనుండి చీఁకటులులేచి యంతరిక్షముఁ గ్రమ్ముఁజొచ్చెను. ఆకసమందు నక్షత్రపంక్తులు నిర్మలకాంతులతోఁ బ్రకాశించుచుండెను. దొంగలు, చెకుముకిఱాలతో నిప్పువుట్టించి, కొఱవిపుల్లలుఁగాల్చి గాలిలోవీఁచుచు, బగ్గుబగ్గున మండించి యావెల్తురులో నందలము సాగించుకొని పోవుచుండిరి. సమానాంతర దూరమున యువకుని గుఱ్ఱము వారివెంటనే వెళ్లుచుండెను. తైలప, మల్లప దళపతి తనకిచ్చిన కరవాలము పిడి నెడమచేతఁ బట్టుకొని కుడిచేతితోఁ గళ్లెపుఁద్రాళ్లు పట్టి మిగుల హెచ్చరికతో

నుండెను. వారు, తొల్లి భోషాణమును దేవళములోఁ బదిలము చేసి వెళ్లిన మార్గముననే పోవసాగిరి. మూర్ధాభిషిక్తులయిన మహారాజులను భయకంపితులను జేయు సామర్థ్యమును వహించిన నాయకుని యావాసమెట్లుండునో? వాని కట్టిశక్తి యలవడుటకేమి నిమిత్తమో? తెలిసికొనవలయునను నుత్కంఠ యువకునకుఁ బైపైని హెచ్చఁ జొచ్చెను.

దేవాలయమునుండి రమారమి రెండుకోసుల దూరము పోఁగా భీకరారణ్యము నందొక భవనము గానవచ్చెను. దాని వాకిలి కెదుట దొంగలు నిలిచిరి. బోయలు సైతము తాము దెచ్చిన యందలముఁ దింపిరి. శైలప, కొన్నిగజముల దూరము నందుఁ జెట్లుదట్టముగా మొలచియున్నచోటఁ దనయశ్వము నిలిపి వారిచర్యల నన్నిఁటిని తెప్పవాల్పక చూచుచుండెను.

ఆ భవనమొక నిట్రమైన గుట్టకుఁ జేరినట్లు నిర్మింపఁబడియున్నది. దానిచేరువ మానవులు నివసించుట కర్హములయిన గుడిసెలుగాని యిండ్లుగాని యున్నజాడ వానికాచీఁకటియందుఁ గన్పట్టలేదు. దొంగలలో నొకఁడు పల్లకియొక్క ప్రక్కతలుపులు దెఱచి, "ఓయువతీ, వెలుపలకు రమ్ము" అనియఱచి చెప్పెను.

ఒకయున్నులమిన్న! భయాతిరేకమునఁ గంపించుచున్న శరీరముతో నందలమునుండి వెలుపలకు వచ్చి నిలిచెను. దూరమునందుండి చూచుచున్న శైలప కాబిడమోము బాగుగాఁ గానరాకున్నను, ఆ యువతి మిక్కిలి లజ్జితయై యా కాపురుషమండలిలోఁ దలవాంచి నిలువఁబడియుండుట బాగుగాఁ గానవచ్చుచుండెను. ఆ కాంత యున్న రీతిని గాంచి, "హా, ఈదుష్టులీ కన్యారత్నమును జెఱపట్టి తెచ్చిరి. వీరివలన దీనికి తప్పక మాన భం

గము గలుగునని తోఁచెడిని. ఈయెదురవస్థను జూచియు వీరిని
బోరికొనక యూరకుండుట ధర్మము గాదు” అని దలఁచి కళ్లెము
లాగిపట్టి రికాబులు నొక్కి, వారిపైఁ దనగుఱ్ఱము ప్రాఁకింపనుంకిం
చెను. అంతలోఁ దన యెడమ ప్రక్క నున్న గుట్టమీఁదనుండి రెండు
బండలొకటి వెంబడి నొకటి తానున్న చోట దొర్లిపడెను. అపు
డతఁ డెక్కియున్న గుఱ్ఱము, బిస ద్రిప్పినట్లు తివ్వన మరలి వాయు
వేగమునఁ బేరెము వాఁటి దేవాలయము నొద్దకుఁ బోయి చేరెను.
బండలు దొరలిన ధ్వనిని, గుఱ్ఱపుగిట్టల సవ్వడిని విని దొంగలు పిశా
చములవలెఁ బాఱివచ్చుచుండిరి గాని, అశ్వవేగమును మీఱి
కూడ ముట్టరైరి.

తైలప, దేవాలయము దాపునకు రాఁగానే గుఱ్ఱము
నుండి దిగి దాని కళ్లెమును దీసివైచి, పల్యాణమును దొలఁగిం
పకయే దానిని విడిచిపెట్టెను. అతఁడు, కుడ్యాంతరాళము
ప్రవేశించునంతలో నాగుఱ్ఱము మెఱపు మెఱసిన విధమున
మాయ మయ్యెను. తైలప ద్వారపాలక ప్రమథుని పార్శ్వమం
దున్న గూఢమార్గమునుండి తన కావాసముగ నేర్పఱచుకొన్న
యాలయోద్యానమును జేరెను.

దొంగ లారేయి యంతయు రౌతును వెదకిరి. వాఁడె
చ్చోటనుఁ గానరాకపోఁగా, “ఆహా! సింగముమీసలను లాగి
బ్రతికిపోయిన వేఁటగాని వలె, మనగుట్టును దెలిసికొనవచ్చిన
వీరుఁ డెవఁడో తప్పించుకొనెను. మన శౌర్యముగాల్పనా ? మన
యెచ్చరిక మంటఁగలుపనా?” అనిలజ్జించుచుఁ దమ నాయకున
కాసంగతి దెలుప వలయునని తలపోయుచు మరలి పోయిరి.

# పదునాల్గవ ప్రకరణము

## పట్టుదల

తైలప కారేయి శివరాత్రిని బోలియుండెను. "ఈశ్వరుఁడు నాకుఁ బురుష జన్మమేల యనుగ్రహించెను? నాపౌరుషముగాల్పనా? ఒకమానిని మానమును రక్షింపలేని నామను గడవలని ప్రయోజనమేమి? నావెంబడినే తరిమివచ్చిన దుర్జనులను మార్కొని పోరిఁగొన నైతిని; పంద వలెఁ బాఱివచ్చి తలగాఁగుట యుక్తముగాదు. నాకీ దుర్బుద్ధి యేల పొడమెను? ఔనౌను......నే నిందుఁ జేసిన దుష్కార్యమేమియును లేదే! బండలుదొర్లి పడినవిగదా! అజిత తురంగము బెదరి యునికిపట్టునకు మరలినది.—తగదు; అజితుని సామాన్యతురంగముతోఁ బోల్చిచెప్పఁదగదు. దాని తెలివితేటలు సామాన్యములైనవి కావు. క్రొత్తచోట, ఎట్టిఘోర కార్యములకును జంకని కుత్సితుల కాటపట్టయినచోట నాసాహస మెట్లు చెల్లును? బాహాటముగా వారిని మార్కొని శౌర్యము చూపక మరలుటే మంచిది. కాని, తరుణము గనిపెట్టియుండి యా యువతి బన్నము తీర్పక మిన్నకుండరాదు. కొన్ని సందర్భముల నుపాయముచేఁ గొనసాగు పని శౌర్యముచేఁ గొనసాగదు. నే నీ సమయమున నేయుపాయమునైనను బన్ని దానిని రక్షించెదను. హా, ఒక వేళ... కోకిలాలాపమైయుండునా? ఆయ్యువతి కోకిలాలాప యగుటకుఁ గారణములేదు. దానియెడఁ బిరికితనము గన్పట్టదు. అది వీరయోషగదా! ఆకన్యయేమైనచో దాని జనకుఁ డీవఱకు మిన్నకుండునా? వానిశౌర్యము దావానలమయి యీయడవినంత

టిని దహింపక విడుచునా ? కావున నది కోకిలాలావ గాదనుట నిజము; ఎవరయిననేమి ? ఒకయబల; దొంగలకుఁ జిక్కి యగతికగా నున్నది. దాని బన్నముఁ దొలఁగించి రక్షించుటే పౌరుషము" అని తీర్మానించుకొనెను.

తైలప యీకీతి దొంగలబారికిఁ జిక్కిన యువతీమణిని విడిపించి నిప్పుడి యొనఁగూర్పఁ దలపోయునప్పుడు, వానిమదిలో లెక్కయిడుటకుఁ గాని సంకల్ప వికల్పములు పొడమి యడఁగుచువచ్చెను. ఈయరణ్యానిలో దొంగల కనుకూల స్థానము లనేకము లున్నవి. ఇందలి పరిస్థితులు వారికి బాగుగాఁ దెలియును. యోగ్యునకు రెండుకన్నులు; అయోగ్యునకుఁ బదివేలకన్నులు. ఇట్టి నీచు లెంద ఱిచట వసించెదరో? వీరు మహారాజుల కడలు పుట్టించుచున్నారనిన, సహాయహీనుఁడనై వీరి నెదిర్కొని యేమి సేయఁగలను? దొంగల కనుఁ బ్రామి యాకన్నె నెటువిడిపించెదను పో! దానినెట్లు రక్షింపఁగలను? భావికాలమం దిట్టి పరిణామదశ యలవడు నని తెలియక, ఈ చోట నజ్ఞాతవాసము చేయుచునవయుచున్నానే! ఈ చోట నా జోటి నెట్లు పరిపోషింపఁగలను?

ఇసీ, ఇవియన్నియు బిఱికిగుండెవాని తలపోఁతలు; సాహసింపక మేలు గలుగునా? ఆ పడఁతుక నిట్టి యిక్కట్టున నెట్టులైన రక్షించుటే యుక్తము. ఆపన్నులను సర్వప్రయత్నముల రక్షింపఁదలకొనుటే శూరునకు ముఖ్యకృత్యము. వాని యుద్యమమునకు దైవముకూడఁ దోడ్పడును. దేవునిమీఁద భారము వేసి వెళ్లెదను. పంద వలె నిట నుండ లేను." అని తలపోయుచుండఁగాఁ బలపల తెల్లవారెను. తైలప, కాలోచిత కృత్యములు దీర్చుకొని, రేయియంతయు నిదుర సెడి యుండఁబట్టి తన్నుఁ

గ్రమ్మియున్న నిదురమబ్బు వీడునట్లు కోనేటిలో స్నానముచేసి, వనమందు లభించిన ఫలములను భక్షించి యాచోటువిడిచి యాయుధశాలను జేరెను. అచ్చటఁ దనయొడలికి సరిగానున్న యుక్కుకములతో నల్లిన కవచమును ధరించి దానిపై నంగీతొడిగెను; శిరస్త్రాణము దెలియకుండునట్లు తలగుడ్డ కట్టుకొనెను. వాఁడచ్చట జాగుసేయక, ప్రహరిలోని గూఢమార్గమునఁబోయి ద్వారపాలక ప్రమథునిఁజేరెను.

ఆవేళకుఁ దొమ్మిదిగంటల ప్రొద్దెక్కియుండెను. దొంగలారేయియంతయును రాతును వెదకివెదకి వేసరి, "మనుష్యమాత్రుఁడేయైనయెడల వాఁ డింతత్వరగా నెటకేగియుండును? వాఁడును వానిగుఱ్ఱము నీ చుట్టుప్రక్కలనే మెలఁగుచుండ వలయును. ఒకవేళ, వాఁడు నగరము పొలిమేర నున్న సేనలోని వాఁడగునోయని సందేహింతమన్న నందులకుఁదగిన సూచనలు గన్పట్టవు. కనుక, ఎక్కడివాఁడోవచ్చి యిట దాఁగియుండి, మనగుట్టు దెలిసికొనఁ బొంచియున్నాఁడు" అని వారు తీర్మానించుకొని వనమునం దక్కడక్కడ నొకనిఁ గావలి యుంచి, తక్కినవారు దేవాలయము నొద్దకువచ్చి, దానిలోపలను వెలుపల నంతటను వెదకి చూచిరి. వారి కన్యుఁడు మానవమాత్రుఁడు నేత్రగోచరుఁడు గాఁడయ్యెను; దానివలన వారిసందేహము బలపడెను. తమనేరమికి నాయకుఁ డెట్టి దండన విధించునో యని వారు భయపడుచుండిరి.

తైలప, ద్వారపాలక ప్రమథునిఁ జేరినప్పుడు కొందఱు దొంగలు దేవళము సింహద్వారమునొద్ద నిలువఁబడియుండిరి. వారలుగొత్తి ధాతాళముగ నిట్లు సంభాషించుచుండిరి.

"అన్నా, ఉన్నటులుండి యెట్టి సంకటము దలచూపె
నురా! ఇంక మన గతి యేమి కానున్నదో కదా!"

"కానున్నగతియా? అధోగతియే!"

"హా! తలంచుకొన్న గుండెలు పగులుచున్నవి! మొన్న
మొన్న మన వీరన్న యెట్టి ఘోర మరణమునకుఁ బాల్పడెను!
వాఁడేదో రహస్యము వెలిపుచ్చు నను సందియము తోఁచఁ
గానే, కొంచెమయినను గోపచిహ్నములు గనుపింపక, మననా
యకుఁడు వాని కభ్యంగన స్నానము చేయించి మధురాహార
ములు పెట్టించి క్రొత్తబట్టలు గట్టించెను రెండుగడియలు కూడఁ
గాకమున్నే బట్టలుకాలి వాఁడు నిలువునకు మండిచచ్చెను."

"ఔను, మనము రౌతును గనిపెట్టఁగపోయిన నిట్టి మర
ణమే మనకును తటస్థించును."

"అక్కటా! మరణమన నామనస్సు చాల పరితపించు
చున్నది. మనకీ యరణ్యవాసము ముగియుట కొకపక్షము దిన
ములే యవశిష్టము. పిదప, సుఖముగా నొకసంవత్సరము దనుక
మనము నగరములందు భార్యాపుత్రులతోఁ గాలము గడుప
వచ్చును. ఏమి దురదృష్టము! మనవంతు దీఱునప్పటి కీ కష్టము
గలుగ వలెనా?"

"ఏదో యిప్పటిస్థితిని గొప్పచేసి భీతిల్లెదరు. ఇంతకంటె
వేయిరెట్లెక్కువ కష్టమునకుఁ జిక్కియున్నామని భావింపరు.
ఈ యడవిచుట్టును మల్లప సేనలు నిలిపియున్నాఁడు. దీనివలన
నెవ్వఁడుగాని యిందుండి వెలుపలకుఁబోవుట కష్టము. వెలుపల
నున్నవారు లోనికివచ్చుటయుఁ గష్టమే!"

"హా! అటులైన, మనగతి దుర్గతియే; మనస్థానము లందు నియమింపఁబడినవా రిటకెట్లు రాఁగలరు? వారువచ్చిననే కద మన మిచ్చటనుండి పోవుటకు వీలేర్పడును! ఈనిరోధ మెంత కాలము కొనసాగునో?"

"దానినే నిశ్చయించుటకుఁ గాకున్నది. మనము భయ పడుటచేఁ బ్రయోజనములేదు; కానున్నదికాక మానదు; మనకు శక్యమగునంతవఱకుఁ బాటుపడి రోతును గనిపెట్టుటకుఁ బ్రయ త్నింతము. అశక్యమని తోఁచినప్పుడు మనయేలికతో విన్న వింతము. అతఁడు నిష్కారణముగ మనలను జంపునట్టి మూర్ఖుఁడు గాఁడు. మనల నసమర్థులని యగౌరవించును గాని ప్రాణములు దీయఁడు; వీరన్న సంగతివేఱు; మన సంగతి వేఱు. వానివలె మన ము స్వామి ద్రోహులముగాము." ప్రమథుని వెనుక దాఁగి యుండిన తైలప వారి సంభాషణలోని ప్రతిపదమును బాగుగ వినెను. వారు, తన్నుఁబట్టుటకు మిగులఁ బ్రయత్నించుచున్నా రనియును; కొంతకాలము వనమందు నాయకునితోడను, కొంత కాలము జనపదములందు నాలుబిడ్డలతోను వసింతురనియు, నాఁటికిఁ బదునైదవదినము వారి వనవాసము గడువుదీఱి తమ నివాసములకుఁ బోదురనియును, మల్లప కనుఁబ్రామి యడవి దాఁటవలసిన కష్టమట్టితఱిని సంప్రాప్తమయినదనియుఁ దైలప తెలిసికొనెను. దానివలన, అతఁడు తొలి నాటిరేయి దిట్టముగ నాలోచించి తీర్మానించుకొనిన పద్ధతినిగొంచెము మార్చుకొన వలసి వచ్చెను.

పిమ్మట, తైలప యొకటి రెండుదినములు వెలికి నిగుడక తలదాఁగియుండుట ప్రశస్తమని తలఁచెను. వెంటనే పిరిదికి మరలి

కొండలనడుమనున్న వనవాటికను జేరెను. కాని, వానికచట
నుండఁబట్టలేదు ; ముందుకుఁబోవుటయు వెనుకకు మరలుటయు
నుగా నాఁటి పగలంతయు నతఁడు గడిపెను. నాఁటిరాత్రియుఁ
దొలినాటి రేయివలెనే కడచెను. మఱుచటిదినము వాఁడు
గుండెదిటవుతో, ఎటులైనను దొంగలగూడెముఁ జొచ్చి చె
కుఁజిక్కిన యన్నులమిన్నను రక్షింప వలయునని తీర్మానించు
కొనెను. పగటిపూట తెగువచేసి యాదొంగలున్న చోటును
గూర్చి పోవుట యపాయకరమని వానికిఁ దోఁచెను. రాత్రి
యయి కొన్నిగడియలు గడిచిన పిదప వారున్నచోటును
గూర్చి పాదచారిగాఁబోవుట తనయుద్యమమునకుఁ దగియుండు
ననియును వాఁడు నిశ్చయించుకొనెను. మఱియును, చోరులు
ధారాళముగా రాకపోకలు సలుపుచున్న కాలిబాటను వెళ్లక,
చుట్టుదారినిబట్టి పోవుట యుక్తమని తీర్మానించుకొనెను. వాఁడు
తలఁచినటులే చేయవలసి వచ్చినయెడల రెండుమార్గములు వాని
బుద్ధికిస్ఫురించినవి - అందొకటి; ఒక చిన్నగుట్టనెక్కి దిగుట;
మఱియొకటి - ఆగుట్టయొక్క శిఖరమునేచేరి దానిమీఁదు
గానే ప్రక్కనున్న కొన్నిగుట్టలెక్కి దిగి తుదకొక గుట్ట చఱి
యనున్న గూడెమునుజేరుట. ఇట్లు చుట్టుదారినిబోవుట, వనము
లందు వసించుచుండు కిరాతజనులకే యశక్యకార్యమనిన,
సుకుమారుఁడగు రాజపుత్రునకు శక్యమగునా? వానిపట్టుదల
యశక్యకార్యమునకే ప్రేరేపించెను.

---

## పదునైదవ ప్రకరణము

### వ్యాఘ్రము

తైలప, రేయిపొడమి మొదటిజాము ముగియునప్పటికి, కవచధారియు ఖడ్గహస్తుఁడు నై ద్వారపాలక ప్రమథుఁడున్న చోటుఁ జేరెను. నిర్మలాకాశము, నీలిమనుగుప్పుగుప్పునఁ గ్రక్కుచుండఁగా, దిగంతములవఱకు వ్యాపించి, మహీతలమును గాఢముగఁ గ్రమ్మి పొలుపారుచున్నదో యనునట్లు చీఁకటులు సర్వత్ర మెండుకొనియుండెను. దేవళమునకుదాపున మనుష్యుల యలజడి యెంతమాత్రము లేకుండుటచేత, వాఁడు మెల్లఁగ ప్రమథుని ద్రిప్పి వెలుపలకువచ్చి నిలిచెను. ఆ నిశీథమం దెచ్చటను శాంతము నెలకొని యున్నట్లు సద్దణఁగియుండెను.

తైలప కొన్నియడుగులు ముందుకు నడిచి నలువలంకులఁజూచెను. ఆ గాఢాంధకారమందు వానిచూడ్కులకేమియుఁ గన్పట్టలేదు; రెండునిముసములవఱకు వాఁడు చుట్టు ప్రక్కలఁ జూచి, తానిఁక ధారాళముగఁ బోవచ్చునని తోఁచినపిమ్మట ముందున కొకటి రెండడుగు లిడెను. అప్పుడు వానియెడమచేతి వంకఁ గొంతదూరమునందుఁ జెట్లచాటున వెల్తురు గానవచ్చెను. అదిరానురాను బెద్దదగుచువచ్చినందున నెవ్వరోచేదివ్వెటీలతోఁ దానున్నచోటునుగూర్చి వచ్చుచున్నట్లు వానికిఁదోఁచెను. అందుండి తొలఁగి ముం దేగుటకు గాని పిరిదికి మరలుటకుఁగాని తోఁచక వాఁడించుక తొట్రిలెను. "వారెవరో! ఇటకేవచ్చెదరో, ఎటకుఁబోయెదరో? దిట్టముగఁదెలిసికొని నేనీచోటువిడుచుట

మంచిది" అనితలపోసి, వెనుకకుమరలి ద్వారపాలకునిఁ జాటున దాఁగి యుండెను.

ఇరువురు చేదివ్వెటీలఁ బట్టుకొని ముందువెనుకలుగ వచ్చుచుండ, ఇద్దఱుపురుషులు మంతనము లాడుచుఁ దాను దాఁగియున్న ప్రమథవిగ్రహముందు చోటునకే వచ్చినిలిచిరి. వారిలోనొకఁడు భటులనుజూచి, "ఓరీ! మీలో నొకదివ్వెటీ నిచట నుంచి యొకదివ్వెటీని దీసికొని కొంతతొలఁగియుండుఁడు" అని యాజ్ఞాపించెను. తత్క్షణమే వాఁడొక దివ్వెటీ చిట్టము దట్టి వైచి, తైలసిక్తము గావించి రెండవ ద్వారపాలక విగ్రహము యొక్క పాదపీఠము కడనుంచి, మఱియొక్కదివ్వెటీని బట్టుకొని, తోడిభటునితో దవ్వులఁ దొలఁగి యుండెను. వారిలో నొకఁడు నాయకుఁడగుటయు మఱియొకఁడు రామన్నయగుటయుఁ దైలప గుర్తెఱిఁగెను.

నాయకుఁడు—రామన్న! కావుననే కర్తవ్యము దోఁచకున్నది. నాలుగుప్రక్కలనుండి యొక్కపెట్టునఁ జిక్కేర్పడినది. ఎట్లు సమర్థించుకొందుమో చెప్పలేను.

రామన్న—ఔను, దేవరా! యదార్థము; మొదటనే మనవిచేసికొని యుంటిని. మనము కళింగరాజుతో జోక్యము గలిగించుకొన్నది గొప్పపొరపాటు; దానివలన మనము సాధించిన ఘనకార్యమేమియుఁలేదు. కళింగరాజపుత్రికను బట్టి తెచ్చుటచేతఁ గలిగినలాభమేమి? కళింగేశుని కోపమునకుఁ బాత్రులైతిమి. నిద్రించుచున్న నిత్యవర్షునిఁ దట్టిలేపితిమి. మనభటులీ యడవినుండి వెడలుటకుఁగాని విధమున నిత్యవర్షుని సైన్యము లీ కాంతారమును ముట్టడివేసియుండుట దేవరచిత్తమునకు విదితమే.

నాయకుఁడు—నిత్యవర్షుని సైనికు లొక్క-రేమైనఁ జింత లేదు; కల్యాణపుర సామంతుఁడును సైన్యములతో వచ్చి విడిసి యున్నాఁడు.

రామన్న—ఎవరు? విక్రమాదిత్య మహారాజుగారా? తన కొడుకునుజంపిన హత్యాసక్తునకుఁ దోడ్పడుట కతనికి మన స్సొప్పెనా?

ఆ మాటలు విన్నప్పుడు తైలప యులికిపడి, తాను దొల్లి పెద్దిభట్టును గల్యాణికిఁబంపుట వ్యర్థముగా ముగియ లేదని దెలిసి ధైర్యసమగ్రుఁ డయ్యెను. మఱియును వారి సంభాషణలను వినుటయందు జాగరూకత వహించెను.

నాయకుఁడు—అతఁడు రాజునకుఁ దోడ్పడుటకే వచ్చెనో, రాజుమీఁదికే యెత్తివచ్చెనో చెప్పలేను; వచ్చినవాఁడింకను నిత్యవర్షుని దర్శింపలేదు. చూటిగా నీయడవి పొలిమేరను జేరి, మల్లపతో సంభాషించి మఱియొక వైపున విడిసియున్నాఁడని మనవేఁగులవాఁడిప్పుడే నాతోఁ జెప్పెను. మల్లపయును విక్రమాదిత్యుఁడునుగలిసి మాటలాడుకొని యీయడవినుండి పోవు ప్రతిమానవునిఁ బట్టుకొనునట్లు తీర్మానించికొనిరఁట.

తైలప, నాయకుని బుద్ధికుశలతకు మిక్కుటముగా సంతసిల్లెను.

రామన్న—అటులైన మనయుద్యమములకుఁ గొంత హానిగలుగునేమోయని తలఁచెదను. విక్రమాదిత్యుఁడుశూరుఁడు, ఏకాంగ వీరుఁడు—

నాయకుఁడు—రామన్న! నీవు పిఱికిగుండెవాఁడవు; ఇంతకే బెదరితివి. మకుటాధిపతులు, ఏమహిమకులొంగి మనకుఁ

గాన్కలు కప్పములు సమర్పించుకొందురో మఱచిపలికెదవు ; తూర్పుచాళుక్యుఁడైన దానార్ణవునికంటె నీపశ్చిమచాళుక్యుఁడు శూరుఁడా ? అట్టిదానార్ణవుని హతముచేసిన నాశక్తియెదుట నీవిక్రమాదిత్యుఁ డేపాటివాఁడు ?

నాయకుని మాటలు శల్యప్రాయమయి రామన్నను బాధింపఁగా, "అయ్యో, దేవరా ! దానార్ణవ మహారాజుగారు హతులైరా ? నిజముగాఁ గాలగతిచెందిరా ?" అని మిక్కిలి యాత్రముతో నడిగెను.

నాయకుఁడు రామన్నమాటల కించుక సందేహించి, ఒక్క నిముసముదాఁక వానిమోమునేచూచి, ముసిముసి నవ్వులు నవ్వుచు; లేదు - ఇంకఁ గొన్నాళ్లలో మరణించు నను కొనుము ; త్వరలోనే యాతని మరణవార్త వినఁగలవు ; ఏల ! అతని మృతకళేబరమును గూడఁ జూడఁగలవు. అది యటుండ నిమ్ము ; నీవిప్పుడు శూరుఁడని పొగడిన విక్రమాదిత్యుని శిరమును జూడఁ గోరెదవా ?. ఇఁక రెండుగడియలలోనే తెచ్చి నీకుఁ జూపగలను.

ఆమాటలను దైలపవిని మితిలేని కోపమునకుఁ బాత్రుఁడై తత్క్షణమే యందుండి వెడలి వాని నఱకుటకు నుంకించెను. విగ్రహమునుగూడఁ గొంచెముత్రిప్పెను. కాని, వానిసంభాషణము సాంతముగవిని తుదకాపని చేయవచ్చునని దలఁచి యప్పటి కా ప్రయత్నము మానెను.

రామన్న మైమఱచి పలికిన పలుకులకుఁ గొంత పశ్చాత్తప్తుఁడయి, "మల్లప విక్రమాదిత్యు లిరువురు దప్ప మీా దృష్టి నాకర్షించు వారెవరును లేరుగదా !" అనెను.

నాయకుఁడు—లేకయేమి; కొన్నాళ్లనుండి యీయడవి యంతటను గుఱ్ఱపు గిట్టల గుఱుతులు గానవచ్చుచున్నవి. ఎవ్వఁడో యశ్వారోహకుఁడై యీవనమందుఁ దిరుగుచున్నాఁడనుట నీకుఁ గ్రొత్తగాదు కదా !

రామన్న—ఔను, వాఁడొక్కఁడీ యరణ్యగర్భమందుండి మనల నేమిచేయగలఁడు ? వాఁడు కనబడఁగానే పొరిఁగొనుటకు మనభటులు సిద్ధముగా నున్నారు. వానిని గూర్చి దేవర యంతగా నాలోచింపవలసిన యవసరములేదు.

నాయకుఁడు—అటు లెన్నఁటికిని భావింపరాదు ; నిర్భీకుఁడై యొంటరి పాటున నీవనమం దెల్లెడల సంచరించుటకు వానికెంత వెన్నుబలముండునో యూహింపుము. మానవుల పసివట్టి పట్టుకొను నేర్పుగల నాభటుల దృష్టికిఁ జిక్కక వాఁడీ యడవిలో మెలఁగుట కెట్టివాఁడుగ నుండవలయునో యాలోచింపుము. వానిని బట్టుకొని చంపివేసినఁగాని నాకు నెమ్మది గలుగదు.

రామన్న—దేవరా! చిత్తము, తమ సామర్థ్యమునకీ యొకటిరెండు పనులేపాటివి ?

నాయకుఁడు—రామన్నా ! నిజముచెప్పితివి ; శత్రుశేష మ్ముంచ రాదందురు. వృద్ధ కళింగుఁడు దప్పించుకొని పోయెను. వాని వైరస్య మే మూలనుండి యే విధముగాఁ దలచూపునో ? యెట్లు విజృంభించునో ?

రామన్న—అందులకు నాకొక యుపాయము దోఁచుచున్నది. నే నా కన్య నతనియొద్దఁజేర్చి, అతని ప్రయత్నములారసి మనమీఁదికెత్తి రాని యుపాయము పన్నివచ్చెదను.

నాయకుఁడు—(పటపటఁ బండ్లు గీటుచు) రామన్నా బెదురు గుండెవాఁడవు; ఇఁకముందు నీకియ్యఁదలఁచిన యధికారమునకు నీవెంతయు నర్హుఁడవుగావు. చేతికిజిక్కిన వస్తువును బోఁగొట్టుకొను వెట్టివాఁడుండునా ? ఆతనివర్తన మరసివచ్చెద నంటివే ; అది శ్లాఘింపఁదగిన యంశము. అందులకు నిన్నే పంపఁదలఁచితిని.

ఆయడవిలో నొకవ్యాఘ్రము తొలిదిన మొకదుప్పిని బట్టి, దానినెత్తురుద్రావి కళేబరమా యాలయ మందొకమూల నైచి యుండెను ; దాని మెఱచి దినుటకై యటకువచ్చినప్పుడు దివ్వెటీ వెలుతురును మనుష్యుల మెలఁకువయును గాంచి యొక చెట్టుచాటునఁ బొంచియుండెను. వారు సంభాషణ చాలించి తొలఁగిపోవుసూచన కన్పట్టకపోవుటచేత, క్షుద్బాధకాఁగలేక బాణ వేగమున దేవాలయములోనికిఁ బ్రాఁకెను. నాయకుఁడు దానిని జూచి, "రామన్నా ! ఈజంతువున కెంత కండకావరమో చూచితివా ? పురుషవ్యాఘ్రులున్నారని గణింపక మనల నొఱసి కొని లోనికిఁజొచ్చెను. మనము కొంతమెత్తనఁ జూపిన కార్యము లన్నియు నిటులే పరిణమించును ; ఇది మనపైఁబడి చంపి భక్షింప వచ్చును గదా" అనెను.

'చిత్తము ! దాని నిప్పుడే పట్టితెచ్చెద'నని రామన్న లోనికిఁబోయి దానితోఁ బెనఁగులాడి తుదకుఁ దన పాగాబట్టను దాని మెడకుఁజుట్టి జరజరమని లాగుకొనివచ్చెను. నాయకుఁ డదిచూచి పకపకనవ్వి, "ఆహా ! రామన్న, ఏమిపరాక్రమము ! నీశూరత్వము నెంతపొగడినను దనివితీఱదు" అని పరియాచకములాడుచుఁ దన యెడమచేతితోఁ దాని చెవి నొడిసిపట్టి

"నీబట్టనువిప్పి నెత్తికిఁ జుట్టుకొను" మనెను. ఆబెబ్బులి యతని పట్టు సైరించుకోలేక సోలిపడెను. అతఁడు, "ఓవెట్టివాఁకా! తెలిసి తెలిసి నేనున్నచోటుఁ జేరితివి. ఇంక నీగుహను జేరలేవు; లోకాంతరమునకు నిన్నుఁ బంపఁదలఁచితిని" అని కుడిచేతి పిడికిలితో దాని మోముపై నొక్క పోటుపొడిచెను. అది యొక నిముసమువనకుఁ గన్నులు తేలవైచి చచ్చినట్లు పడియుండి, మఱియొకపోటు పొడుచునంతలో త్రుళ్లిపడి పాఱిపోయెను. దాని వలన నాతనికించుక లజ్జ పొడమెనుగాని వెలికిఁ గనఁపింపక మందహాసముచేఁ గప్పిపుచ్చెను. పిమ్మట, "రామన్నా! నీవు మన యునికిపట్టునకు మరలుము. ఇంతకుమున్ను మన మనుకొనిన పనిమీఁద దృష్టిఁజెల్లింపుము. ఇప్పటి పరిస్థితి నీ పురుషకారమునే మిక్కుటముగ నిరీక్షించుచున్నది. నేనీరేయి మల్లప యుద్యమములఁ దెలిసివచ్చెదను" అని యాచోటుఁ బాసెను. భటులు దివ్వటీలను బట్టుకొని వారివెంబడినే వెళ్లిరి.

## పదునాఱవ ప్రకరణము

## నాయకుని యావాసము

శైలపమనస్సును వెతగొలుపుచున్న సందేహము లనేకములు, వారి సంభాషణమువలనఁ బూర్తిగఁ దొలఁగెను. కాని, ఇంకను కొన్ని వానిమదిని వెతగొలుపుచునే యుండెను. వాఁడు దిట్టముగా నాలోచించి, కార్యమువంకకు మరలుటకుఁ దగినంత యవకాశము లేదు. ఏదో, ఇట్టిదని నిర్దేశించి చెప్పుటకు శక్యము

గానియొక దివ్యశక్తి వానిని ముందుకుఁ ద్రోయునట్లుండెను; ఆ యద్భుతశక్తిని బ్రతిరోధించి నిలుచుటకు శక్యము గాకపోయెను. నాయకుఁడు వెళ్లిన యొకటిరెండు నిముసములకు యువకుఁడు వెలుపలకు వచ్చినిలిచెను. మల్లపదళవాయి యొసఁగిన ఖడ్గమతని చేతనే ఫాలుపారుచుండెను. నీలాకాశమున వజ్రములు పొదిగిన విధమున నక్షత్రములు తళతళమని మెఱయుచుండెను. ఏవంకకుఁ బోవుటకును దోఁచక వాడించుక తొట్రిలెను. మెఱుపు మెఱసినవిధమున నేదో తలంపునకురాఁగా 'చుట్టుదారినిబోయి వాని నివేశముఁ జేరుటే యుక్త'మని చూటిగా గుట్టలపైదారిని బట్టెను. త్రోవయందు వాని కే యాటంకము గలుగలేదు.

తైలప నాలుగైదు గుట్టలనెక్కి దిగెను: వాఁడు పోవు మార్గము మనుష్యసంచారమున కనువై యుండెననుటకు నిదర్శనముగా నిఱుకైన కాలిబాటయొకటి యేర్పడియుండెను. ఆప్రాంతములందు దొంగలు నడయాడు సూచనలేవియుఁ గన్పట్టలేదు. వాఁడేగు మార్గము పొడువునకుఁ గ్రూరమృగముల మూల్గులు మిక్కుటముగ వినవచ్చుచుండుటచేత, దాపుననున్న గుహలును బొదలును వాని యునికిపట్టులగునని యూహించి యొఱనుండి ఖడ్గముదూసికొని యప్రమత్తుఁడయి నడిచెను. ఆవేళకుఁ జంద్రోదయమయి దెసలన్నియును బాగుగాఁ దెలియవచ్చుచుండెను. మిట్టపల్లములును బొదలును బండలును వ్యక్తముగాఁ గానవచ్చుచుండెను. తైలప, 'ఆగుట్టను దిగిన గూడెమును జేరవచ్చ'నని యొకవిధముగా నిశ్చయించుకొని యందుండి మెలఁకువతోఁ జఱియకు దిగెను; కొన్నియడుగులు నడిచి ముండ్లపొదలచే నావృతమయిన పెద్దబయలుచేరెను. దూరమునుండి

చూచువారికది దుర్గమారణ్యమను తలంపు పొడమక తప్పదు. తైలప సూక్ష్మబుద్ధిచేత నొక యిఱుకుదోవ గనిపెట్టి యందుఁ జొచ్చెను. అది మూఁడునాలుగు చదరపుమైళ్ల వైశాల్యము గలిగిన సమతలము. అచ్చట దూరదూరమున గుడిసెలు గానవచ్చెను. అవి వందకంటె నెక్కుడుగా నుండవచ్చునని చూపుమాత్రమున యువకుఁడు గ్రహింపఁగలిగెను. ప్రతికుటీరమందును నిరువురు మువ్వురు భటులు వాసముచేయనగుననియు వాఁడూహించెను. ఒకవైపున పెద్ద మంటపమొకటియుండెను. అది పెక్కుకంబములు గలిగి వెలయుచుండెను. దాని తుది నొక ఱాతి కట్టడముండెను. అందేవైన యతిశయములను గనిపెట్టవచ్చునని తైలప యూహించి సద్దుచేయక మెల్లఁగపోయి యాచోటుఁజేరెను. ఆశిలాభవనమొక యయఃశిక వాటముచేఁ జెన్నొందుచుండినది. ఒకఁడు బీగములగుత్తిని ప్రక్కనుంచికొని కూరుచున్నటులే తూఁగిపడుచుండెను. వాఁడు తెఱపి మఱపులతోనున్నాఁడని తైలప దెలిసికొని గ్రద్దతన్నునట్లు తటాలున వానిపైబడి గట్టిగ కంఠమునొక్కి తలదిమ్ముపట్టి మెదడు చెదురునటులొకపోటు పొడిచెను. వాఁడు కాయపుష్టిచేత బకుని హిడింబునిఁబోలిన వాఁడుగా నున్నప్పటికిని, తైలప కాఁగలేక మూర్ఛిలి సోలిపడెను ; కాని చావలేదు.

వెంటనే తైలప యాలస్యముచేయక యాతలుపును దెఱచి మెలఁకువతో లోనికిఁబోయి చిలుకువెట్టెను. అచట మిణుకుమిణుకుమని వెలుఁగుచున్న యొకచేతిదివ్వెను బట్టుకొని దాని వత్తి నెగఁద్రోసి పెద్దకళికఁ జేసెను. ఆవెలుతురునందు లోపలనున్న వస్తువులన్నియును బాగుగాఁ గానవచ్చుచుండెను.

గోడలు పిడుగురాలినప్పుడును భేదింపబడవని వాఁడు గ్రహించెను. గోడలతోఁ జేరినట్లు పెద్దజాడీ లుంచఁబడియుండినవి. వాఁడు చూపుచేతనే, వానిలోఁ బెక్కువిధముల ద్రావకములున్న వనియు నవి ఘోరముగఁ బ్రాణికోటులను జంపునట్టి వనియు గ్రహించెను. ఆస్థలమున కెదుట నమర్పఁబడియుండిన తలుపు నొద్దకుఁబోయి దానిని మెలపునఁదెఱచెను. అది మొదటి యంకణము కంటె విశాలమైనది. ఒకసెమ్మెయందు దీపము వెలుఁగుచుండెను. కన్నులు మిఱుమిట్లు గొలుపునట్టి రత్నములు, విలువ హెచ్చిన యాభరణములు, సువర్ణటంకములు మున్నగునవి రాసులు రాసులుగ పోయఁబడియుండినవి. వానినన్నిఁటిని బరిశీలించుచువచ్చునప్పటికి నొకగంటసేపయ్యె ననుచో నందలివస్తుసమృద్ధిని గూర్చి చెప్పనవసరములేదు. తుదకు వాని కాశ్చర్యము హెచ్చుపెరుగునట్టులొక భోషాణము గోచరించెను. వ్యాఘ్రశాలయమున దొంగలు నిక్షేపించివచ్చిన కళింగరాజు భోషాణమదియే. అంత వాఁడచ్చెరువుపట్టలేక "హా, ఇదేమి వింత! నాఁడు చోరులు దేవాలయమున దాఁచియుంచిన యీ పెట్టె యిచ్చట కెట్లువచ్చెను? ఇదిమిగులఁ జిత్రము!" అని బిగ్గరగాఁ బలుకుచుఁ దలయెత్తెను. తనకుదాపున తెల్లని యుడుపులు ధరించిన వృద్ధపురుష విగ్రహమొకటి కదలమెదలకనిలిచి యుండెను. పొడుగైన శరీరముగల యావ్యక్తికి గడ్డమును మీసలును బాగుగా నరసియుండెను. కాంతిమంతములయిన కన్నుల నుండి కరుణారస లహరి ప్రవహించుచున్నట్లు యువకునకుఁ దోఁచెను. మనుష్యవాసమున కనువుగాని యాచోట నున్నటులుండి యావృద్ధుఁడు పొడసూపుట, యువకునకు నిర్వాఱపాటు

గలిగించెను. వెంటనే తైలప, ఆముసలివానివలనఁ దనకెట్టి కీడు గలుగదని యూహించి, "అయ్యా! మీరిచ్చటనే వసించెదరా?" అని ప్రశ్నించెను.

వృద్ధుఁడు—ఔను, యువకుఁడా! నేనిప్పు డిచ్చటనే యున్నాను; ఇచ్చటనే నాశరీర మర్పింపవలసిన యోగము గలిగినను గలుగవచ్చును. అది యుండనిమ్ము; నీవు ధైర్యశాలివనియు సామర్థ్యవంతుఁడవనియుఁ జెప్పవచ్చును. ఇదివఱకు నీవలె నిట కెవ్వఁడును వచ్చియుండలేదు. నీసాహసము మెచ్చుకొనక తప్పదు. కాని, అక్కటా, కొన్నిగడియలలో ఘోరమరణమునకు గుఱి యగుదువే యని చింతిల్లెదను.

తైలప—పూజ్యుఁడా, నాకు మరణభీతిలేదు. మానవుఁ డెన్నఁటికైనను మరణమొంద వలసినవాఁడే.

వృద్ధుఁడు—వెఱ్ఱియువకుఁడా! తెలిసియుండి పాముపుట్టలోఁ జేయి పెట్టువాఁడుగలఁడా? అటులే నీవిచ్చట మసలుట మరణమునకు సాహసించుట యగును. ఇది మృత్యునిలయమని వేఱుగఁ జెప్పవలయునా? నాయనా! నీవిందుండి యిప్పుడే తొలఁగుము.

తైలప—అయ్యా, ఇప్పుడే నన్నిందుండి తొలఁగుమని తొందరపెట్టెదరా? ఇచ్చట నెన్నిరహస్యములనో కనిపెట్టవలయునని కోరియుంటినే!

వృద్ధుఁడు—"నాయనా! బ్రతికియుంటిమేని యెప్పటికైనను దెలిసికొనవచ్చును. నాబుద్ధివినుము. అక్రూరుఁడు, మానవాకృతినిబూనిన ప్రళయకాలకాలుఁడు, వాఁడిటకు రాకమున్నే

యిందుండి కదలవలయును. నిన్నిట్టివాఁడని తెలిసికొనుటకుఁ గూడ నాకవకాశములేకున్నది. రమ్ము, రమ్ము; జాగుసేయకు"మని తొందరపెట్టి, వానిచేతినిబట్టుకొని లాగికొనిపోయి పార్శ్వమం దున్న యొక తలుపుదెఱచి లోగొండ్లమిడి, అచట నేలపైనున్న యొకతలుపు దెఱచి యందిద్దఱును దిగిరి. పిదప, ఆ తలుపు మూసి పదిలముగాఁ జిలుకుపెట్టి, అందుండి క్రిందికిఁబోవు సోపానములు దిగిరి. నలుగురు వరుసదీరి ధారాళముగఁ బోఁదగినమార్గ మేర్పడి యుండెను. ఇరుప్రక్కల నున్న గోడలు గఱుకువారి మోటుగా నుండెను. నేలపై తాలు పొదిగి చదునుగా నున్నప్పటికిని చెమ్మగిలి నీరు చిప్పిలుచుండెను. వెలుతురు చొచ్చుటకు వీలులేకున్నను గాలిచొచ్చుటకు వీలున్నందునఁ జీఁకటితోఁ జలియును నెలకొనియుండెను. ఆనేలమాలెలో ముందు వృద్ధుఁడును వాని వెంబడి యువకుఁడును బోవుచుండిరి. కొన్నిగజముల దూరము పోవుసరికి తైలప చేదివ్వె గాలి కాఱిపోయెను. అటుపిమ్మట నతఁడు దానిని బాఱవైచి గోడలు దడివికొనుచుఁ బోవసాగెను. వా రావిధమున నొకగంటవఱకు నడచి గమ్యస్థానమ్మును జేరిరి. అంతవఱకు వా రొకరితో నొకరు సంభాషింపక మౌనము వహించియుండిరి గాని యాచోటుఁ జేరఁగానే వృద్ధుఁడు, "తండ్రీ! నీకు త్తరక్షణమునఁ గలుగనున్న గొప్పయాపదనుండి రక్షించి తిని. నీ విట్టివాఁడవని తెలియకున్నాను. నిన్నుఁ జూడఁగానే యవ్యాజకారుణ్యము పొడమెను. ఇంతకంటె మిక్కుటముగా నీ కుపకరింపలేను. ఇఁక నీ శరీరము రక్షించుకొను భారము నీ పైఁబడినది. నీ వెట్లా క్రూరుని నివాసముఁ జేరితివో కాని నీరాఁక వాఁడు దెలిసికొనఁగలఁడు. వెంటనే నన్నుఁజంపి నిన్ను వెదికింప

గలఁడు. నేను జావునకు భీతిలువాఁడనుగాను; అక్కటా, యువకుఁడా! నీవువానికిఁ బట్టువడితివేని యెట్టి ఘోరమైన ప్రతీకారమునకు నిన్ను గుఱిసేయునో చెప్పలేను" అని యువకునిఁగూర్చి చెప్పెను. అచ్చటనున్న యొకఱాతితలుపు గొండ్లెమువీడ్చి తెఱచెను. వా రిరువురును వెలుపలకు వచ్చిరి. అప్పుడు యువకునకుఁ బొడమిన యచ్చెరు వింతంత గాదు. తెఱువఁబడిన తలుపు వ్యాఘ్రేశుని బలిపీఠము మీఁది ఱాతిపలక ! నాల్గవజాము ముగియవచ్చుటచేత నచ్చట మసలుటకు వారు వెనుదీసిరి. అందుండి త్రొందరగా మరలిపోవఁ బ్రయత్నించుచున్న వృద్ధునిచేతిని బట్టుకొని, యువకుఁడు, "అయ్యా, మీరచ్చట కారాబద్ధులవలె దుస్థ్సితి నున్నారని తలఁచెదను. నన్నువిడిచి మీరేగుటధర్మము గాదు. నాశరీరము రక్షించుకొనుటతో మిమ్మును రక్షించు భారమును గూడ వహించెదను. దయచేసి పదియడుగులు రండు" అని బతిమాలి యతనిని బిలుచుకొని ప్రమథ విగ్రహమోరఁగిలఁ ద్రిప్పి కుడ్యాంతర మార్గముఁ జేరెను. వెంటనే ద్వారావరోధియగు ద్వారపాలకుని వెన్నువంక గడియకోలను బిగించి, "ఇంక మనయునికి మనుకులెవ్వరుఁగనుఁగొనలేరు" అని యువకుఁడు వృద్ధునితోఁజెప్పుచు, పెక్కుచింతలకుఁ జిక్కిచేడ్వడియున్న ముసలివానిని బిలుచుకొని కొండలనడిమి వనవాటికను జేరెను. ఈక్రొత్త దారి ముసలివానికిఁ దెలియదు.

ఆచోటుఁజేరఁగానే ముసలివానికి నాథునివలని భీతి యించించుక దొలఁగుచు వచ్చెను. ఆతరుణముందుఁ బలపల తెల్లవాఱె పక్షుల కలకలము నలువలంకుల నిండి మెండుకొనెను. దిఙ్ముఖమందు సూర్యబింబము నగము పొడకట్టెను. వారిరువు

రహార్స్నానోచిత కృత్యములు దీర్చికొని నిదురమబ్బు దీఱునట్లు కోనేటిలోఁ గ్రుంకులిడి యప్పటికి వృక్షశాఖాగ్రములందుఁ బరిపక్వస్థితినున్న ఫలములను గడుపారఁ దినిరి. వృద్ధుఁడు క్షేమకరమైన ప్రదేశమును జేరినప్పటికిని వాని మనస్సు పలు విధములయిన చింతలకుఁజిక్కి చీకాకగుచుండెను. యువకుఁడు వాని స్థితిఁ దెలిసి యేయంశమునుగూర్చిగాని ప్రస్తావింపక నెమ్మదిగ నొకతరువరచ్ఛాయను విశ్రమింపఁ జేసెను. 'ఆపన్నురాలగు బాలిక యున్నచోటుఁ దెలిసి యామె బంధవిముక్తికి యత్నింపనైతినే' యను కొఱఁత యున్నప్పటికిని మునుపటివలెఁ బరితపించలేదు. ఏలనఁగాఁ దొలిరేయి రామన్నయు నాయకుఁడును సంభాషించునప్పుడు, ఆకన్య 'కళింగ రాజపుత్రిక' యనుటను యువకుఁడు గ్రహించెను. కావున నది కోకిలాలాపయో యను సందియము వానిహృదయమునుండి పూర్తిగఁ దొలఁగెను. అంతేకాక యది వలచియున్న రామన్న, తనప్రియురాలి నెట్లైనను రక్షించు నను నూహాయు వానికిఁ దోఁచెను; ఈ యూహాచే నాబిడను బొత్తిగ మఱచెననరాదు ; దాని విడుదలకై వాఁడు తరుణము గనిపెట్టియుండెను.

---

## పదునేడవ ప్రకరణము

### విషాదము

నాయకుని బారి నుండి తప్పించుకొని పాఱిపోయిన వ్యాఘ్రము మిగుల బలిష్ఠమైనది. అది పసిదిగానైనను వయస్సు చెల్లినదిగానైననుండిన వాని పట్టునకప్పుడే విలవిలదన్నుకొని ప్రాణ

ములు విడిచియుండును. అంతటితో మానక వానిపోటు ముట్టిపై బలముగాఁ దగిలెను. అది బాగుగఁ బోతరించి యుండఁబట్టి వానిని సైరించికొని బ్రతికెను. ఎరకై వచ్చిన తన్ను బాధించినట్టి పగవారిపైఁబడి కసిదీర్చుకొనవలయునని పట్టుపట్టియుండెను. కోపాతిశయమున దానికాఁకలి బాధయును దోఁచదయ్యెను. కావున, అదిదేవాలయమునుండి పాఱిపోయిన పిమ్మట నొక చెట్టుచాటునఁ బొంచియుండెను. రామన్నయును భటుఁడును గూడెమువంకకుఁ బోవుచుండఁగాఁ జూచి, వారి వెంబడినే కొంత దూరమున సద్దుచేయక పోవుచుండెను. దివ్వెటీ లేకుండినయెడల నది యప్పుడే వారిమీఁదబడి పోరిగొని యుండును. వెల్తురు నకు వెనుదీసి, తనపగదీర్చుకొనుటకుఁ దగిన సమయమును గని పెట్టియుండెను.

రామన్న తిన్నఁగాఁ బోయి యచ్చటనున్న యొకతాతి కట్టడముఁజేరెను. అది దాదాపు డెబ్బదియైదడుగుల వెడల్పును రెండువందలయడుగుల నిడుపునుగలది. దానికి నాలుగుప్రక్కల నున్న తాతిగోడలు పదునైదడుగుల యెత్తుగలవి. ఆప్రదేశ మందు మొదటియంకణము ముప్పదియడుగుల నిడివిగల యొక పెద్ద గదిగా నేర్పడునట్లు అడ్డుగోడయుండెను. దాని పై కప్పు బోడిమిద్దె. ఆగదికి వెనుకనున్న దొడ్డి విశాలమైనది; అం దొక దిగుడుబావియుఁ బెద్దయశ్వత్థవృక్షము నుండినవి. కావున గదికి వెలుపలివాకిలి యొకటియు లోఁపలివాకిలి యొకటియు నుండినవి. వాని తలుపులు మిగుల దృఢములైనవి. రామన్న యాకట్టడమును జేరినప్పుడు వెలుపలితలుపు మూఁతవెట్టి బీగము వేసియుండిరి. ఆ కట్టడమునకు వెలుపల నాయుధపాణి

యగు భటుఁడొకఁడు కూర్చుండి యుండెను. వాఁడు రామ
న్నను జూడఁగానే నమ్రుఁడై నిలిచి నమస్కరించి యతని యాను
మతిపైఁ దలుపు దెఱచెను. గదిలో దీపము బాగుగా వెలుఁ
గుచుండినది. ఒక కన్యారత్నము సెజ్జపైఁబరుండి కూర్కు
చుండెను. రామన్న దాని పరిసరమునకుఁ బోయినప్పుడు, అతని
తో వచ్చిన దివ్వెటీవాఁడు వెలుపలనే నిలిచియుండి యచట
కావలియున్న భటునితో నేమో సంభాషించుచుండెను.

నిదురించుచున్న యా తరుణీమణిని జూచినప్పుడు, రా
మన్న గుండెలు పెకలించుకొని దుఃఖము పొంగి పొరలెను.
"అక్కటా! ఏమి దుస్థితి! ఏమి దుర్గతి! విరోధివరూధినుల
యెదల కడలునించు కళింగరాజవంశమున జనించి, వృద్ధకళింగు
నకు బహిఃప్రాణమై వెలయు నీసుందరి యొకచోరుని చేతఁ
జిక్కి యరణ్యగర్భమందుఁ జేదోడు వాదోడులేక యనదయై
యవయుచున్నదే! కాలముయొక్క కుత్సితమున కేమందును!
హా! ఈ ముగ్ధ యిన్నిబన్నములకుఁజిక్కి కొట్టువడియు సుఖ
నిద్ర ననుభవించుచున్నదే! నిశాచరుని కర ప్రసారమున కొల్లని
పద్మినివలె మోమెంత వాడియున్నది? ఇట్టి స్థితియందును దీని
శోభ చెడకున్నది. ఆహా, ఏమిసౌందర్యము! ఏమిలావణ్యము!
ఇట్టి యొప్పులకుప్ప, సొబగుల దీవి, దుర్విధికి దాస్యుఁడైన నా
యందు మక్కువ నెలకొల్పినది; కావుననే యిట్టి దుస్థితి దీని
కలవడినది. ఈ లావణ్యసీమను లోకమోహన మంత్రాధిదేవ
తను ముగ్ధాలాపముల నాహృదయము సంపూర్ణముగఁ జూఱ
గొన్న యీ ముదితను రక్షింపని నాశౌర్యము కాల్పనా?

"యువతీ! నిన్నీజన్మమునుండి తొలఁగింపకున్న నా మనుగడవలన నేమి ప్రయోజనము!" అని దుఃఖమాఁగలేక పలికెను. ఇది వాని మదిలోనే యణఁగియుండక పెదవి దాఁటెను. ఆ మాటసవ్వడి కా యన్నులమిన్న మేల్కని కనులు దెఱచి చూచినది. ప్రియసందర్శనముచేఁ జింత దీఱి, విల్లువిూఁటిన విధమున లేచి కూర్చుండెను. దానవోద్ధతికి దర్పము చేడ్వడిన శునాసీరునిఁబోలి, రామన్న దైన్యముతో నెదుట నిలిచి యుండుట నాపడఁతి చూచెను. త్రైలోక్యసామ్రాజ్యలక్ష్మి యనఁదగిన యా లతకూన, తన బాహువల్లరితో వాని కంఠాశ్లేషణముచేసి, మూపుపై మోముఁదమ్మిఁజేర్చెను. రసోద్ధతిచేత దాని కంఠమునుండి ధ్వని నిగుడదయ్యెను; కాని, కన్నీట వాని మూఁపు దడిసెను. అవి దుఃఖాశ్రువులో? ఆనందబాష్పములో?

రామన్న యూఱటలు పలుకుచు దాని కౌఁగిలివిడఁదీసి, బుజ్జగించి సెజ్జపైఁ గూర్చుండఁబెట్టెను. "యువతీ! జరిగిన దానికిఁ జింతిల్లకు. తొలిజన్మమునఁజేసిన దుష్కృతములే ప్రాణికోటిని బెల్లుగ బాధించుచుండును. సజ్జను లెన్నఁటికిని గష్టములనుభవించెద మే యని పరితపించరు. ఇట్టి యిక్కట్టు లోనఁగూడినప్పుడు మనపాప మివ్విధమున క్షీణించుచున్నదని సంతసిల్లుదురు. నీవు వివేకవతివి. తెలివినిగొని ధైర్యము పూనుము. ఒక వారముదనుక నిన్నెడఁబాసి దూరదేశములకు నేను వెళ్లవలసి యున్నది; అట్టి తరుణమునఁజేవిడువక నిన్నీశ్వరుఁడు రక్షించును.

"హా! ప్రాణమిత్రమ! తలిదండ్రులకుఁ దగిన బంధువులకు దూరమయ్యి, చెఱవడి యలయుచున్న తరుణమందు విూ యవలంబము గలిగెనుగదా యను నమ్మకమున జీవములు

నిలిపియున్నాను. ఇట్టి సమయమందా మీ వియోగము! మీ వియోగమును సైరింపలేను; మీరొక క్షణమైనను నన్ను విడిచి పోఁదగదు.

"యువతీ నామాటవినుము. నేనిప్డు డేఁగక తప్పదు. ఒకవారములో మరలిరాఁగలను. వెంటనే నీనెమ్మదికిఁ దగినమార్గము వెదకెదను. ఇందలి నాయకుఁడు పలువురచేత దుర్జనుఁడనియనిపించుకొన్నను పరనారీసోదరుఁడు; స్త్రీహత్యకు విముఖుఁడు. కాఁబట్టి, నీశీలమునకుఁగాని ప్రాణమునకుఁగాని యెట్టిభంగము గలుగదు. ఒకవారము గడువులో వచ్చి చేరెదను; ఓర్చి యుండుము.

"ఉండను; ఉండలేను. నన్నును మీతోడఁ బిలుచుకొని పొండు. మీ వెంబడి నేను రాలేనా? రాఁదగనా?"

"హా, వెఱ్ఱిపడఁతీ! ఇప్పటికి వ్యర్థుఁడను. నిన్నుఁ బిలుచుకొని పోవుటకు నాయకుఁ డనుమతి యొసఁగఁడు. బలాత్కరించి పిలుచుకొనిపోయిన బొత్తిగ మనపనులు చెడును. నామాట నమ్ముము. ఒకవారముదనుక నోపిక బిగపట్టియుండుము. నా పనులన్నియును దీర్చుకొని వచ్చెదను. బహిఃప్రాణమైన నీవు లేనిచో నా బ్రతుకు నిరర్థకమగును; ఒక్కవారము గడువిచ్చి పంపుము."

"హా, మిత్రమా! మీరెన్నఁటికి నామనవిని మన్నించుట లేదు; నావలపు నాదరించుటయులేదు. మాటలచేతనే నోరు మూసెదరు. అక్కటకట! ఏమి నాదుర్గతి! రెంటికిని చెడిన రేవణనైతిని. ఇఁక నా బ్రతుకు వ్యర్థము" అని యేదోజ్ఞప్తి

రాఁగా, హా దుర్విధీ! నాకీవయస్సుననే యిట్టి దుస్థ్సితి యొనఁ గూడవలయునా?" అని కంఠమును జీల్చుకొని నిర్గమించుచున్న దుఃఖమును దిగమ్రింగెను. దుఃఖాతిరేకమున గుండె జల్లుమని నాళములందు రక్తము పెల్లుబికి యాబాలికను మూర్ఛాలసఁ గావించెను. అది సెజ్జపై సోలి పడెను.

"ఆ సుందరీమణి తన యెడఁబాటు సైరించుకో లేక ప్రణయ కోపము వహించిన దనుకొని, దానినే చూచుచు నొక నిముసము నిలిచియుండెను. "పడఁతీ, నా కనుమతి యొసఁగుము; నేను వెళ్లి తొందరగావచ్చి చేరెదను" అనెను. అప్పుడు, వెలుపల కావలియున్న భటుఁడు, లోనికిఁబోయిన రామన్న యిందాఁక నేమిసేయుచున్నాఁడని శంకించుచుండ, ఆకట్టడము ప్రక్క పైపున సరసరమని శబ్దము వినవచ్చెను. అప్పుడు, కావలియున్న భటుఁడులేచి యాప్రక్క నేవో సరీసృపములు తిరుఁగుచున్నవని యొకఱాయిదీసి సద్దు వినవచ్చినజాడ విసరికొట్టెను. అంతలో దివ్వెటీని బట్టుకొనివచ్చిన భటుఁడు గదిలోఁపలఁజొచ్చి, సుందరి పరుండియుండుటయు, రామన్న మిన్నక నిలిచియుండుట యును జూచి వెలుపలికివచ్చెను. అటుపిమ్మట రామన్న యింకఁ గాలయాపనముచేయుట తగదని యాచోటుఁ బాసెను. భటుఁ డును దివ్వెటీతో వానివెంబడిఁ బోయెను.

వారిరువురు కొంతదూరముపోయిరి. అట వెలుఁగు బొత్తిగ లేకపోవుటచేత నదివఱ కచ్చటఁ బొంచియున్న బెబ్బులి, తన్నుఱాతితోఁ గొట్టినవాఁడే తనకుఁ బగవాఁడని కసిదీర్చుకొన నెంచి, లటాలున వానిపైఁబ్రాకి, కుత్తుకను గవ్విపట్టి, గుటగుట రక్తము ద్రాఁగి యాకళేబరమును విసరికొట్టెను. అది యిరువది

ముప్పది యడుగుల దూరమునఁ బోయి పడెను. మరల నావాఁక యాగాత్ర మందుండి మఱియొక వంకకు విదిర్చికొట్టెను. ఇవ్విధముగా నది యాక ళేబరముతో నాడుకొనఁజొచ్చెను. గాలి తమ వైపునకే వీచుచుండుటచేత నా సవ్వడి రామన్నయు భటుఁడును వినఁగలిగిరి. ఆతరుణమందే యువతీమణిని గ్రమ్మిన మూర్ఛ కొంచెము కొంచెము తొలఁగుచువచ్చెను. రామన్న, ఆవంకఁ గలుగు సవ్వడి కేమి కారణమని మరలి చూచి యాయరణ్యభవనమందుఁ దన ప్రాణధనముండుటచేతఁ గొన్ని యడుగులు నడిచి రాఁగా, బెబ్బులి తన్నే వేఁటాడవచ్చెదరని యావెలుఁగునకు వెనుదీసి తనయెఱను నోటఁగఱచుకొని గదిలోఁజొచ్చి యందుండి దొడ్డిలోనికిఁ బోయి దాఁగెను.

ఒక బెబ్బులి, మనుష్యునిఁ గఱచిపట్టి తన్నొఱసికొని దొడ్డిలోఁదూఱుటను యువతి చూచెను. ఏమిచేయుటకును దోఁచక గదికున్న రెండువైపుల తలుపులుమూసి దిట్టముగ గొండ్లెము వెట్టి శయ్యఁ జేరినది. ఆ వికృతదర్శనము వలని భీతి యప్పుడు స్ఫురింపఁగా, దిగులు పెంపున హా యని యఱచి సెజ్జమీఁదఁ బడెను. రామన్న యాకట్టడమునొద్దకు వచ్చినప్పుడు, అలజడికి హేతువెదియుఁ గన్పట్టలేదు; తలుపు దిట్టముగ మూయఁబడి యుండెను. తాను జింతింపఁదగిన సంభవ మేదియు నచ్చట పొడమలేదని నిశ్చయించుకొని రామన్న యాచోటుఁ బాసెను.

---

# పదునెనిమిదవ ప్రకరణము

## ప్రేమ

వసంతకాలమందలి నాఁటియుదయము మోదావహమై యొప్పక మెసఁగెను. ఉద్యానమందలి పద్మాకరము, నిర్మలోదక పూరితమై యొనలారుచుండినది. బాలభానుని కరముల గిలిగింతలకు మందహాస భాసురములై నవోయన లతాంతము లీషద్వికసితములై కనులకు విందొనఁ గూర్పఁ జొచ్చెను. అలసగతులతో మందమలయానిలుఁ డిటకు నటకు నడయాడ సాగెను. మాన్యఖేట నగరాంతఃపురకమనీయ మైన కన్యాలలామ, జక్కుల దేవి పెక్కుఱు చేడెలతో నా యుపవనమందు విహరింపఁదల కొనెను. ఆయావతమందు మల్లపదళవాయి పుత్రిక శాంతయు నుండెను. మల్లపవఱకు వ్యవహారనామము కోకిలాలాపయని యేర్పడినను, ఆబిడ జన్మనామము శాంత.

పదును వెట్టిన మన్మథుని బాణములో యన నొప్పు నా యన్నుల మిన్నలు చెలరేఁగి స్వైర విహారముల వినోదింపఁ జొచ్చిరి. పూఁబోణులు గొందఱు పుష్పిత లతాగృహంబులు చొచ్చి పువ్వులు గిల్లఁదొడఁగిరి. కుసుమకోమలలు గొందఱు సహకార భూరుహశాఖలఁ బొలుపారు తీవ యుయ్యేల లూఁగ సాగిరి. పికవాణులు గొంద ఱెలుఁగిచ్చి కోకిలల నెలయించి వాని యామ్రేడిత కూజితములకు మోద మొందిరి. తక్కినవారిలో, గుమిగూడి నర్మాలాపము లాడువారును, బిత్తరిచూపులఁ జూచువారును, నెఱజాణతనము నెఱపువారును, పోఁడిమిన యలుకచే గండపాళి రక్తిమవహింప, మణితాటంక రోచి రక్తిమకు

రక్తిమనించి యనురాగ మినుమడింపఁజేయు మోములు ద్రిప్పువారును, పద్మములు గిల్లిదెచ్చి కందుకములవలె నొండొరులపై వైచువారును నై చేడియలు క్రీడించిరి. శాంతయు జక్కులదేవియు నొక తరువరచ్ఛాయఁ జంద్రకాంత శిలావేదిపైఁగూర్చుండియుండిరి. వారిహృదయములు రసాంతర నిమగ్నము లగుటచేత కొండొక తడవు సంభాషింపక మిన్నకుండిరి.

జక్కుల—శాంతా! నాఁటికిఁ బిదప నిన్నుఁ జూడనైతిని; నాకృతజ్ఞత విన్నవించుటకు నవకాశ మొసఁగవైతివి.

శాంత—ఔను, సోదరీ! మాతండ్రి యొద్దనుంటిని. వారిని విడిచివచ్చుటకుఁ దగిన యవకాశము లభింపలేదు. అది యుండనిమ్ము; నీవు నాకుఁ గృతజ్ఞత తెలుపునంత ఘనకార్యము నేనేమియును జేయనే!

జక్కుల—ఇంతలో మఱచితివా? నాహృత్తాపముఁ బోకార్చితివి. నాఁడా చాళుక్య రాజనందనుని మరణమునుండి రక్షించితివి గదా!

శాంత—సోదరీ! ఔను, నీయభిమతము పూర్తినొందింపఁ దలఁచియే యట్టి పనికి సాహసించితిని; వానికిఁ బ్రాణదానము చేసిన పుణ్యము నీకేదక్కును.

జక్కుల—వానిని మరణమునుండి తప్పించుటే నన్ను మృత్యువునుండి తొలగించుట యగునే;

శాంత—ఈయంశము నేనొప్పుకొనను; నిన్ను మరణము నుండి తప్పించలేదు.

జక్కుల—ఏల యట్లనెదవు; వాఁడు ఘోరముగఁ జంపఁబడ ననుకొనుము. పిమ్మట నేను జీవించి యుండ లేను.

శాంత—వాఁడు బ్రతుకుటచేత నీవుపొందఁ బోవు లాభ
మేమి ?

జక్కుల—నేను బొందునట్టి లాభమా ? స్పష్టముగఁ
జెప్పుమనెదవా ? వానిని నాప్రాణేశ్వరునిగఁ బొందు లాభమే !
నేనతని వరించునిమిత్తమే సార్వభౌముఁ డతని నిటకురావించెను.
కాలవైపరీత్యమున నతఁడు తుదకట్టి కష్టమునకుఁ బాత్రుఁ
డయ్యెను. నేను వలచినట్లు ప్రపంచమందెవ్వతెయు నతనిని వలచి
యుండదు.

శాంత—నీవు వలచుటచేతనే యతఁడు పూర్తిగ నిన్ను
వలచె ననుకొంటివా ? అది యటుండ నిమ్ము; నిత్యవర్ష సార్వ
భౌముఁడు జీవించి యున్నంత దనుక, నీతండ్రి కర్కులమహారాజు
బ్రదికియున్నంతవఱకు నీ పని కొనసాగదని దృఢముగఁ జెప్పఁ
గలను. అక్కటా, వెఱ్ఱియింతీ ! సాధ్యాసాధ్యములు విచారింపక
తగని వానిపై మక్కువ నిల్పితివే !

జక్కుల—చెలీ, యత్నించితిమేని యెట్టికార్యమును సాధిం
పఁగలము. ప్రయత్నించుటచేతనేకదా యతఁడు బ్రతికెను !
ఇటులే ప్రయత్నించిన యెడల వానిని వరించుట దుష్కరముగాదు.

శాంత—చెలువా ! ఒకపక్షమునఁ బ్రయత్నముచేతఁ
గార్యము ఫలించు ననుకొందము. దానివలనఁ గలుగు ననర్థము
లూహించితివా ? నిత్యవర్ష చక్రవర్తి నీవు వలచినవాని ప్రాణ
ములకు నలిగెను; వాని జనకుని రావించెను; ఏదో కారణపఱచి
యతనిని నేఁడో రేఁపో నిర్మూలించి కల్యాణ రాజ్యము రట్టపా
డితోఁ గలిపికొనును. అట్టి ప్రబల శత్రువునకుఁ బుట్టినకన్యవు; నీ
వలపు నిజమనుకొందము; వాఁడు మనస్సార నిన్నెట్లువరించును ?

జక్కుల—సఖీ ! ప్రాణాపాయసమయమునఁ దోడ్పడిన వారిని మఱచునంతటి కృతఘ్నుఁడా యతఁడు? కాఁ డనుకొనె దను. ఆతఁ డుత్తముఁ డని వినియున్నాను. నేనుసందర్శించినప్పు డుత్తమ లక్షణము లతనియెడఁ గొన్ని కన్పట్టినవి.

శాంత—(నవ్వి) నీవెఱ్ఱి తలంపుల కేమందును ? వాని యాపద యిట్టిదని మనకుఁ దెలియునుగాని వానికిఁ దెలియదు. అటులే తెలియు ననుకొందము. వాని నాపదనుండి తొలగించిన దానవు నీవే యనుట వానికెంతమాత్రము దెలియదు ; అట్టి కార్యమును నిర్వహించినదానవును గావు. నీకుఁ గృతజ్ఞుఁడగునట్టి యుత్తమగుణములు గలవాఁ డనుకొందము. వానిని బరిణయ మాడుటచే నీవు పొందఁగలుగు సౌఖ్యమేమున్నది? ప్రాణములు దప్పించుకొని బ్రదుకు నిమిత్తము నేనే యతనిని మనదేశపుఁబొలి మేర నున్న యడవులకుఁ దరిమితిని ; వనవాసితో నేమిసుఖింపఁ గలవు ?

జక్కుల—వనవాసిని నగరవాసిని జేయుట కెంతసేపు పట్టును? నీవు దయయుంచిన నగరవాసి యంతఃపురవాసియుఁ గాఁగలఁడు.

శాంత—నీకోర్కి నిష్ప్రయోజనమైనది. నీవు మొండి పట్టు పట్టితివేని తప్పక పెద్దలనుండి తొలఁగి యిడుమలకుఁ బాల్ప డుదువు. ప్రయోజనమును గాన్పించదు. నీకీవలవని జోలియేల? నాహితము విని నీపెద్దలు పోవుమార్గము ననుసరింపుము.

జక్కుల—శాంతా! నీసదుద్దేశమునకుఁ బెక్కువేల వంద నములు.

శాంత—ప్రాణసఖీ, నీవు నన్నంత గొప్పచేసి పలుకవలసి నదిలేదు. నీహితముఁగోరి వానిపై వలపును మరల్చుకొనుమం టిని. ఇఁక నాతండ్రియొద్దకుఁ బోవలసియున్నది. అనుమతి యొసఁ గుము'' అని, అనుమతి గలుగుటకుమున్నే యాత్రముతో నా చోటువిడిచి తరలెను.

జక్కులదేవి శాంతకంటెను దెలివితేటలు గలది; సకల విద్యలయం దారితేరినది; వివేకవతి; ఇంగితజ్ఞయగు నా రాచ కన్నెకు శాంతహృదయ మిట్టిదని తెలియకపోలేదు. తనవలపు వెల్లడిపఱచు వ్యాజమున దానిహృదయము గనిపెట్టెను. ఇంతు లకున్నంత యోర్పు పురుషులకులేదనుట సత్యమే కాని, తాను వరించినవరుని విషయమై వారియోర్పు నిలుకడలేనిదగును. తమ వల్లభుల నొకరు వలచినను, వారొకతెను వలచినను ప్రణయ కోప మనునది ప్రళయకోపముగ మాఱును. జక్కులదేవి యీసంభాషణమందు ముఖ్యముగఁ గనుఁగొన్న యంశము శైలప గోదావరీ తీరారణ్య ప్రదేశములందుఁ గ్రుమ్మరుచున్నాఁ డనుటయే.

జక్కులదేవి తనహృదయ మనుభవించు రసోద్ధతిని వెలికిఁ గాన్పింపక చేడెలనుగూడి జలజాకరము జలముల నోలలాడినది. మడుఁగులుగట్టి యొప్పుల కుప్పలవలె యానములందుఁ గూ ర్చుండి పడఁతులు బలిసిరాఁగా, తాను సైత మొక శిబిక నారోహించి యంతఃపురమును జేరెను.

ఆబిడ హృదయము శైలపను చూఱగొనియుండెను; కనుక భోజనానంతర మొకచోటుఁజేరి వాని సందర్శించి సంభా షింప మార్గ మాలోచింపఁ దొడఁగెను.

## పందొమ్మిదవ ప్రకరణము

## ఒక్కఁడెవఁడు

నాయకుఁడు, రామన్నను బంపివేసి మల్లపస్కంధావారమునుగూర్చి వెళ్లెనని చెప్పియుంటిమి. వాఁడు, పురివోని యాలోచనకుఁజిక్కి కొంతదవ్వేగి తనతోవచ్చుచున్న భటునిఁజూచి "ఓరీ! నీవీ దివ్వెటీనిచటనేయుంచి నావెంట నప్రమత్తుఁడవై రమ్ము" అని యానతిచ్చి ముందేగుచుండెను. వాఁడును యజమానుని యానతిఁజొప్పునఁ జేసెను. తుదకు, వారిరువురును స్కంధావారమును జేరిరి. ఏఁబండ్రు యుద్ధవీరులు, ఎక్కిడిన బాణములతో సేనానివేశము చుట్టు గస్తుతిరుగుచుండిరి. శిబిరమంతయు సద్దణఁగియుండెను. అందలిభటులంతయు నొడలుమఱచి నిద్రించుచున్నారనియుఁ దాను మల్లపయొక్క పటకుటీరమును జేరి తన యుద్దేశము నెఱవేర్చుకొనుటకది తగినతరుణమనియును వాఁడు తలఁచెనుగాని యెడవిడక తిరిగివచ్చుచున్న గస్తువారి కన్నుబ్రామి శిబిరమును బ్రవేశించుట దుర్ఘటమని వానికిఁ దోఁచెను. క్రూరమృగములు చొఱకుండుటకై చుట్టుప్రక్కల యందును శిబిరమందును గట్టెలుమండుచుండెను. అయినను, బుద్ధిప్రసన్నతయుఁ గార్యమందు పట్టుదలయుఁ గలవాఁడగుట చేతఁ దటాలునఁ గూర్చుండి పరుండి తన యఱచేతులును గాలివ్రేళ్లును నేలకుఁదగులుచుండఁగా సద్దుసేయక మిగుల లాఘవముతోఁ దృణజలూకవలె ముందుకు నిగుడుచుఁ జీఁకటులు మెండుకొనియున్న తెన్నుల ననుసరించిపోయి శిబిరముఁజొచ్చెను. వానివలెనే వాని భటుఁడును వెన్నంటిపోవుచుండెను.

అచ్చటఁ బెక్కువందల డేరాలుండినవి ; ఒక్కొక్క గుడారమందును దీపములు వెలుఁగుచుండినవి. నాయకుఁడును భటుఁడును జేరి, ఒక్కొక్కఁడొక్కొక్కవైపున మల్లపయున్న డేరాను వెదుకఁజొచ్చిరి. ఒకగంటసేపు వెదకియు వారికి మల్లప జాడ గానరాదయ్యెను. తన పూనినపని యివ్విధముగా వ్యర్థ మగుటకు నాయకుఁడు మిక్కుటముగ ఖేదమొంది యెట్టెటులో శిబిరమునుండి వెలుపలకు వచ్చిచేరెను. వాఁడు, తనపని నెఱవేరక ఖేదమొందుట కిదియే మొదటితడవ యనవలయును. అంత, తన వెంటనేవచ్చి ప్రక్కన నిలుచున్న భటునిజూచి, "ఓరీ, మనమిం దాఁక పడినపాటు వ్యర్థమైనదిగదా! ఇప్పుడు మల్లప యెక్కడ నుండును?" అనిమెల్లఁగాను గంభీరముగాను బలికెను. వాఁడీ రీతి తనయుద్యమములను గూర్చి భటులతోఁ బర్యాలోచించి నదిలేదు. ఆ భటుఁడు, "అల్లదిగో, ఆ వంక వెలుఁగు కానవచ్చు చున్నది ; అచ్చట నాదళవాయి యుండునేమో చూచి వత్తమా" అనెను. "ఔను, నేఁటిరేయి వానిని జూడవలసినది నాకార్య క్రమణిక యందొక్కటి ; అటులుండియును వానిని జూచునట్టి తరుణము తప్పినది. ఇఁక నెన్నఁడో చూచుకొందము. ఇప్పటికి మనము మరలిపోదము" అని గూడెమును గూర్చి మరలెను.

"రామన్నను ధారానగరమునకుఁ బొమ్మని యాన తిచ్చితిని ; ఇదివఱకే పయనమయి, వాఁడొకటి రెండుక్రోశ ములు పోయియుండును. నేననుకొన్నపని నేఁటిరేయి నిర్వ హింపఁగల ననునమ్మకముతో నటకు వానిని బంపితిని. ఈపని తీఱుటకు మున్నే వాఁడు పోవుటవలన మేలు గలుగదు. ఒకవేళ వాఁడిచ్చటనే మసలుచుండినయెడల వాని పయనము నిలిపి

వేయుట మంచిది" అని తీర్మానించుకొని రామన్న నివాసమును గూర్చిపోయెను. అచ్చట, రామన్న లేఁడు. "సరి, నా యానతి చొప్పుననే రామన్నయు భటుఁడును ధారానగరమునకుఁ బయనమైరి. ఇఁక వారిని మరల్చుటలోఁ బ్రయోజనము గాన రాదు. వాఁడు, తనపనిని బూర్తిచేసికొని వచ్చునంతలో నేను పూనినపనిని పూర్తిచేయరాదా? " అని నిశ్చయించుకొనెను.

ఈ నిశ్చయముతో వాఁడు తనడేరానికిపట్టుఁ జేరఁగానే యొకభటుఁడు పాఱివచ్చి, "దేవరా! మనఱాతికోట కావలి వాఁడు మూర్ఛాలుఁడై పడియున్నాఁడు" అని వర్తమాన మందించెను. ఆ మాటవినఁగానే నాయకుఁ డులికిపడి యాచోటికిఁ బోయెను. అచ్చటఁదనకుఁ గుడిభుజమునఁదగిన మాలవ్యాఁడు మృత ప్రాయుఁడై పడియుండెను. నాయకుఁడు వాని యొడలిని దాఁకి చూచి వెచ్చగానుండుటనుగని, చావఁడని తెలిసి శైత్యో పచారములు చేయఁ జొచ్చెను. కొంచెముసేపటికి నూపిరి కొంచెము తిరుగఁజొచ్చెను ; మఱికొంతసేపటికి నిశ్వాసోచ్ఛ్వాసములు ధారాళముగా నిగుడఁజొచ్చెను. ఇంకఁ గొంతసేపటికిఁ గన్నులుదెఱచి చుట్టుప్రక్కలఁ జూచెను. నాయకునిఁ జూడఁగానే వాఁడు లేవఁ బ్రయత్నించెను. అవయవములు స్వాధీనము దప్పియుండెను. కత్తుక పచ్చిపుండుగ నుండఁబట్టి మాటవెడలుటయుఁ గష్టముగనుండెను. వాఁడు తనయిక్కట్టును సైఁగలతోఁ జూపెను. దానివలన నాయకుఁడు, "వానిపైనొకఁడు హఠాత్తుగపడి మెడవిఱిచి యేఁగె"నను నానుటను గ్రహించెను.

"ఆ యొక్కఁడెవ్వఁడు? ఈయరణ్యగర్భమున నాభటుల కన్నులకుఁ దప్పి, చొచ్చి, నాకోట కేర్పడియున్న కంటకవన

దుర్గమునుగూడ దాఁటి, నామూలబలమువారి కనుఁబ్రామి, లోకమునం దెట్టి పరాక్రమశాలియు భుజాయుద్ధమున జయింప లేని మాలవ్యుని సింహబలుని మెడ నులిమి ఘోరకృత్యమున కొడిఁగట్టిన మానవుఁ డెవ్వఁడై యుండును?" అని తలపోయుచుండఁగా వానిచూపులు తమయంత దాపుననున్న తలుపుపైఁ బ్రాఁకెను. తలుపునందుఁ దాళపుముద్ర గానరాదయ్యెను. వాని యచ్చెరువునకు మేరలేకుండెను. బీగములగుత్తును జూచెను; మాలవ్యుని యొద్దలేదు. "సరి, వాఁడీ మాలవ్యుని మెడవిఱుచుటకుఁ గారణము స్పష్టమయ్యెను" అనుచుఁ దలుపు తెఱువఁ బోఁగా లో గడియ వేయఁబడి యుండెను. అంతట, వాఁడొక నిముసమయినను జాగుసేయక యచటనుండి వెడలి హుటాహుటిని బోయి, వ్యాఘ్రశాలయము చొచ్చెను. బలిపీఠము పార్శ్వముననున్న తలుపుఁ దెఱచికొని జూతికోట మార్గమునఁ బడి పోయెను.

నాయకుఁడు కట్టడమును జేరి యచ్చటనున్న తలుపులకు లో గొండ్లెము వేసి యుండుటనుజూచి, వానిని దీసి లోపలఁ జొచ్చెను. అచ్చట వృద్ధుఁడు గానరాఁడయ్యెను. వానినాచోట వెదకిచూచెను. "హో, వృద్ధుఁడున్నటులుండి యెటకుఁబోయెను? అని తలుపులు దెఱచి ద్రావకములుంచియున్న యంకణముఁ జేరెను. అచ్చట ద్రావకములన్నియును దానుంచినట్లే యున్నవి. అంత, మఱియొక తడవ కా కోట లోభాగ మంతయు వెదకి వచ్చెను. తానుంచి యున్న వస్తువు లన్నియుఁ దొంటి విధముననే యుండినవి; కాని, ముసలివాఁ డొక్కఁడే కనఁబడఁ డయ్యెను. పిమ్మట, వెలుపలితలుపు గొండ్లెముదీసి బయట వచ్చెను. సింహ

బలుని దౌర్బల్యమప్పటికిని దొలఁగలేదు. వాని నిర్బంధించి జరి గినసంగతి తెలిసికొందునని నాయకుఁ డెంతమాత్రము తలఁచిన వాఁడు కాఁడు; మఱియొక బీగవుముద్దఁ దెప్పించి యాతలుపును మూసి తగిలించెను. వానికప్పు డిది చేయవలయునని తోఁచనందున నచ్చటనే కూర్చుండెను.

"హా, పులిమీసల నుయ్యేల లూగి ప్రాణములతోఁ దప్పించుకొని పోయిన చతురుఁ డెవ్వఁడై యుండును? వాఁ డన్యుఁడా? స్వీయుఁడా? అన్యుఁడేయైన వాఁడిందలి వారికిఁ గనఁ బడక చూటిగావచ్చి పరిచితునివలె, నాకొకనికిఁ దప్ప నన్యున కెవ్వనికిఁ దెలియని ముసలివాని యునికి మనుకులు దెలిసి, కన్నులు చెదరునట్లు జుట్టు ప్రక్కలఁ బడవైచియుంచిన నిధిని గన్నెత్తియుఁజూడక ముసలివానిని బిలుచుకొని, వానికి మాత్రము దెలిసియున్న గూఢమార్గము వెంబడి వెడలిపోవుట కన్యునకు శక్యమా? "ఔను, కొన్నాళ్లనుండి యొకరౌతు, ఈప్రాంతములందు నడయాడుచున్నాఁ డనుటకు నిదర్శనములు గానవచ్చెను. వాఁ డీచర్యకు సాహసించియుండునా? వాఁడే యనుటకుఁ దగినకారణములు లేవు; నేనాకళింగకన్యను దెచ్చిన నాఁడే కదా, నాకు వానిరాక దెలిసెను. వాఁ డాకన్యనుగూర్చి యీప్రాంతములందు మెలఁగుచున్నాఁడేమో యనుకొనినను, ముసలివానికిని రౌతునకును సంబంధము లేదుగదా? "ఒకవేళ వాఁడాకన్యనుగూడ,........."అని యేదో తలఁచుకొని,తటాలున నాచోటువిడిచి కన్నెను జెఱయుంచియున్న కాలికట్టడమునకుఁ బోయెను. అచ్చటఁగావలియున్న భటుఁడు లేఁడు. ఆభటుని వెదకించెను. వాఁడాయరణ్యమం దెచ్చటనులేఁడు. అక్కటా,

వాఁడీయడవిలోనే పొదచాటున దాఁగియున్నాఁడో? ఒకవేళ వాఁడే యీచర్యలకు లొంగినాఁడో? ఎట్లు నిశ్చయించుటకును వానికిఁ దోఁచదయ్యెను. తలుపు మూయఁబడి యుండినది; బీగముతోముద్ర నేలఁబడియుండెను. సరి, వాఁడే ముసలివానిని లేవఁదీసి యీకన్యక యున్నచోట దాఁగియున్నాఁడు. హో, వీని కెట్లో నాగుట్టు దెలిసెను. రేయి తలచూపఁగానే యిందుండి పాఱిపోవఁ దలఁచియున్నాఁడు" అని తలఁచి, ఎంతమాత్రము సద్దుసేయక, కట్టడములోఁ బ్రవేశింప నిచ్చెనను దెప్పించి, ఆవరణపుగోడను స్వయముగానెక్కి లోనికిదిగెను. దొడ్డివంక గది తలుపు సైఁతము లోగొండ్లెము వేయఁబడి యుండుటయును గదిలో సద్దణఁగియుండుటయును వాఁడు గుర్తించెను. వెంటనే వాఁ డాగోడనెక్కి వెలుపలకు దిగెను.

ఆకట్టడపు గదికి నిరువంకలఁ దలుపులు బిగింపఁబడి లోఁపల నెంతమాత్రము సద్దులేకయుండుటకు నాయకుఁ డత్యాశ్చర్యమునకు గుఱియయ్యెను. "ఇది యేమి? నేను జన్మించినది మొదలు, ఇదివఱకు నిట్టి సంభవములను గనుఁగొన్నది లేదు. ఇవ్విధముగా వంచితుఁడైనదియు లేదు. నన్ను వంచించినవాఁ డసాధారణ సామర్థ్యశాలియనుట కెంతమాత్రము సందియము లేదు. వాఁడెవ్వఁడు? ఎట్టివాఁడైయుండును?" అని తలపోయుచుఁ దన యునికిపట్టునకుఁ బోయెను. అచ్చట నేకాంతమున నాలోచించి, "సరిసరి, రామన్నయనుటకుఁ గొన్ని కారణములు గన్పట్టుచున్నవి. ఔను, నేను ఱాతికోటనుండి తొలఁగిన సంగతి వాని కొక్కనికే తెలియును. నిన్నరేయి వానితో సంభాషించునప్పుడు, కళింగరాజు ప్రస్తావమేర్పడఁగా, తానాకన్యను

పిలుచుకొనిపోయెదననెను. ఈవిషయమే వాఁడు రెండుమూఁడు తడవలు మందలించెను. దానార్ణవునిగూర్చి చెప్పినప్పుడు తన యనుతాపము వెల్లడిపఱచెను. ఈయిరువురకును రామన్నకు నేదోసంబంధమున్నట్లు తోఁచెడిని. ఒకవేళ, తనకుఁ జిక్కిన యత్యల్పకాలములో రామన్న వారిని బిలుచుకొనిపోయి యుండును" అని యూహించి, ధారానగరముఁగూర్చి పోవుచున్న రామన్నను గూడముట్టి చేపట్టుగఁబిలుచుకొని రావలయు" నని నలువురుభటుల కానతిచ్చెను. వారు వేగవంతములయిన తురగములెక్కి వెంటనే పయన మయిరి. తదనంతరము నాయకుఁడు మఱినలువ్రరు భటులనుఱాతికట్టడమునకుఁ బంపి దాని తలుపులను బగులఁగొట్టి యందున్న వారిని తొందరగాఁ బట్టుకొనిరండని పంపెను. తత్క్షణమేవారు ఖణపాది సాధనములను దీసికొని యటకుఁ బోయిరి.

---

## ఇరువదవ ప్రకరణము

## కవచధారి

కల్యాణ నగరమునకుఁ జూటిగా దక్షిణ దిశయందు మాన్యఖేట నగర మున్నది. ఈరెండు నగరములకు నడుమ దాదాపుగాఁ బదునైదు క్రోశముల వైశాల్యముగల పెద్ద యడవి యున్నది. దీనినే వ్యాఘ్రేశారణ్యమని మనము వ్యవహరించెదము. ఇప్పుడు 'గుల్బరగ' యనియు నింతకుమున్ను కల్బరిగ యనియుఁ జెప్పఁబడు ప్రదేశమే యీయడవికి దక్షిణపుటెల్లః అచ్చటనే శిబిర మేర్పఱచుకొని మల్లప మనలుచుండెను.

కల్యాణనగరా ధీశుఁడైన విక్రమాదిత్యుఁడు తన ప్రధానామాత్యునిపై రాజ్యభారము మోపి సైనికులను, సంవత్సరమునకుఁ గావలసియున్న వస్తుసామగ్రిని దీసికొని, పౌరులకును దెలియని విధమున నొకరేయి నగరము విడిచివెడలెను. అతఁడు శ్రీధరునితోఁ గొన్నిసంగతులుచెప్పి చేదిదేశమునకు పంపెను. (ఇప్పు డీదేశమును సెంట్రల్ ప్రావిన్సస్ అనెదరు.) విక్రమాదిత్యుఁడు పడమరగాఁబోయి యడవిని జుట్టివచ్చి, ప్రకృతము వేషాచ్ఛాదనఁ దగినచోటనున్న పెద్దిభట్టు సత్రమును జేరెను; అందుండి పెద్దిభట్టు సాయమున మల్లపయున్న యటవిని జేరెను. మల్లప యాలోచన చొప్పున నగరము పొలిమేరకుఁ గొంత దవ్వుల శిబిర మేర్పఱచుకొని మాన్యఖేటమందు మాఱు వేసములూని రాజ్యపుగుట్టు కనుఁగొనుటకై కొందఱు భటులను బంపెను. విక్రమాదిత్యుఁడు విచ్చేసి యైదాఱుదినములు గడిచియును చక్రవర్తి సందర్శనమునకు యత్నింపఁ డయ్యెను; నిత్యవర్షుఁడు, తన్నుఁ గనిపించుకొన వలయునని చారులమూలమున రెండుమూఁడు తడవలతనికి వర్తమానమంపియు నొక నెల దనుక సందర్శించుటకు వీలు గలుగదనిచెప్పి పంపుచు వచ్చెను.

నగరము వెలుపలి శిబిరములందున్న మల్లప విక్రమాదిత్యులకు తైలపను జూడవలయు నను కుతూహలము పెచ్చు పెరుగుచుండెను. మల్లపకుఁ దైలప పునస్సందర్శన భాగ్యమలవడలేదు. ఆతనిపుత్రిక శాంత యాతనిని సందర్శింపఁ గోరియే నగరవాసమును రోసి తండ్రియొద్ద దినములు గడుపుచుండెను. ఆబిడ యనుభవించు వెత యిట్టిదని మల్లపకు బాగుగాఁ దెలియును.

విక్రమాదిత్యుఁ డాచోటుఁజేరి మైదాఱు దినములు గడిచియును దనకొడుకునుజూచు భాగ్యము గలుగలేదు. తన ప్రాణమునకుఁ బ్రాణమయిన కొడుకును జూడవలయునను తమి క్షణక్షణ మతిశయింపఁ జొచ్చెను. అడవిలో నతఁడు నెమ్మదిగ నున్నాఁడని తలఁచెను; కాని, వానియునికి మనుకులు దెలి యవు. కావుననే యడవినుండి వచ్చునట్టి, లేక యడవిని గూర్చి పోవునట్టి ప్రతిమానవుని మల్లవయు విక్రమాదిత్యుఁడును బరి శోధించుచు వచ్చిరి. ఈ పని యడవి లోని దొంగలకుఁ జాల శ్రమగలిగించెను.

"నేనిటకువచ్చి యిన్నాళ్లు వ్యర్థముగఁ గడిపితిని. ఇంకను నా కొడుకును జూచు భాగ్యము లభింపలేదు; అక్కటా, ఈశ్వ రుఁడు మాకుటుంబము నేమిసేయఁదలఁచెనో? అడవిలోనికి నేనే వెళ్లి నాలుగు ప్రక్కల వెదకెదను; వాఁడు జీవించియుండు నేని కానరాకపోవునా? మానవులకు దుర్గమములయిన ప్రదేశ ములందు వాఁడేల యుండును? వాఁడు శ్రీధరునకుఁ గమ్మవ్రాసిన విధమున సైన్యముదెచ్చితిని; ఈసంగతి వానికిఁదెలుపవలదా?" అని యాలోచించు చుండెను.

అప్పుడు నలువురు భటులొక కవచధారియైన భటునిఁ బట్టుకొనివచ్చి విక్రమాదిత్య రాజు నెదుట నిలిపిరి. ఆ వీరయు వకుఁడు శరీరమును మోమును గవచములచేఁ గప్పియుంచికొని ఖడ్గపాణియై యుండెను. భటులు, "మహారాజ! వీఁడెవ్వఁడో వేఁగులవాఁడు; నిర్భీకుఁడై మన శిబిరముఁ జొచ్చి తిరుగుచు న్నాఁడు; నీవెవ్వఁడవని ప్రశ్నించినప్పుడు తగిన సదుత్తరమొసఁ గఁడు" అని విన్నవించిరి. విక్రమాదిత్యుఁడు కవచధారినిజూచి,

"ఓయువకుఁడా! వీరుచెప్పునట్లు నీవు వేఁగులవాఁడవా? కాదనియే నానమ్మకము" అనెను.

కవచధారి—"మహారాజ! మీరు తలఁచినట్లు నేను వేఁగులవాఁడను గాను" అనెను.

విక్రమా—అట్లైన నీవు మాశిబిరముఁజొచ్చి పరిశోధించుటకుఁ గారణ ముండక తప్పదు—

కవచ—ఔను, మీశిబిరమందుఁ బ్రవేశించి యంతటను దిరిగి పరిశోధించితిని. ఇప్పటికిని మీరువిడిసియున్న యీపటకుటీర మందుఁ బరిశోధన దృష్టితోనే చూచుచున్నాను. నాప్రాణము నకుఁ బ్రాణ మయిన మిత్రము వనవాసి యొకఁడు గలఁడు. వాఁడొకవేళ మీ స్కంధావారమందు మెలఁగుచున్నాఁడో యను నుద్దేశముతోఁ బరీక్షించు చున్నాను.

విక్రమా—ఓవెఱ్ఱి యువకుఁడా! వనవాసి స్కంధావారము లందెట్లు గానవచ్చును? నీవుచెప్పునట్టి కారణము ప్రజ్ఞావంతు లొప్పు కొనునట్టిదికాదే!

కవచ—మహారాజ! ఇందు సందేహాంశ మేమున్నది? కాల మహిమ గుర్తెఱిఁగిన వారి కిది చోద్యముగాదు. మహాత్ములు, సార్వభౌమ పదవిఁ దనరారుచుండిన ఘనులు, ఒక్కొక్కప్పుడు వనవాస క్లేశము లనుభవించుటయును, అసూర్యంపశ్యలై యంతఃపురములందు విలసిల్లు యోషిన్మణులు, మాఱువేసములతో నగరములందును జనపదములందును విడివడి తిరుగులాడుటయును కాలనాథుని చర్యలు.

విక్ర—సరి, ఓ వీరయువకుఁడా! నీప్రాణమిత్రుఁడు వనవాసి యీశిబిరమందుఁ గనఁబడఁడేని యేమిసేయఁదలఁచితివి?

కవచ—వనవాసిని వనమందే కనుఁగొనవలయును. అట్టి పని నుద్దేశించియే వెడలితిని. నామార్గము నీ శిబిరము నిరోధించి యుండుటచేత నిందుఁ బ్రవేశించితిని. కారణాంతరముల చేత, నామిత్త్రుఁడిచ్చటనే కానవచ్చునేమో యను నూహ పొడమి పరిశోధించితిని. మహారాజ! ఇంతకంటె నేను జెప్పవలసిన యంశమొకటియుండదు. నాకు మీసేనతోఁగాని మీరాజ కార్యములతోఁగాని జోక్యములేదు.

విక్రమా—ఓ యువకుఁడా! నీవు నాయొద్ద నేయుండుము. నీవు చూడఁగోరిన వనవాసిని నాభటులను బంపి వెదకించెదను. అక్కటా! యువకుఁడవు; అరణ్యములందెట్లు సంచరింపఁగలవు! నీమిత్త్రు నెట్లు కనుఁగొనఁగలవు? తిరిగి తిరిగి సొమ్మసిల్లుదువే?

కవచ—“ప్రభూ! మీయనుగ్రహమునకుఁ బెక్కువేల వందనములు! మీయాదరమున కనేక నమస్కారములు. నేనిచటనుండి నాపని నితరులచేఁ జేయింపలేను. ఖడ్గోపజీవులకు సుగమ దుర్గమ ప్రదేశముల నెడి వ్యవస్థలేదు. నామిత్త్రుఁ డిచ్చట లేఁడని తెలిసికొంటిని; సెలవిండు” అని యాచోటు విడిచి కదలెను. విక్రమాదిత్యుఁ డాయువకుఁడు కొన్నియడుగు లిడునంతలో, వానికిఁ దోడుగా వెళ్లిరండని యాయుధపాణులైన నలువురు భటులకానతిచ్చెను. కవచధారి తానెక్కివచ్చిన యశ్వము నధిరోహించి యరణ్యాభిముఖుఁడై పోవునప్పటికి, భటులును దమ గుఱ్ఱములెక్కి వాని వెంబడినే పోవుచుండిరి.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

### కోర్కులు

తైలప యిచ్చచొప్పున నావృద్ధుఁడొక చెట్టునీడ విశ్రమించెనంటిమికదా ! తైలపయును, మల్లపయిచ్చిన ఖడ్గ మెదుటనున్న యొకబండకు నానించి, దాపునఁ గూర్చుండెను. వాని చూపు లా ఖడ్గముపై వ్యాపించెను. దాని పిడిపైఁ జెక్కియున్న “సత్యాశ్రయవల్లభేంద్రుఁ” డను నక్షరములను జదివెను. వెంటనే వీరావేశముచే నతని యొడలు పెల్లుబికెను. ఆతని మనస్సులోఁ బెక్కుతలంపులు పొడచూపెను.

“ఆహా, ఈ సత్యాశ్రయ వల్లభేంద్రుఁ డవతారపూరుషుఁడు. నాఁడతని హస్త మలంకరించుచుండి, “ఖడ్గమా! అతనికి సార్వభౌమఖ్యాతి ననుగ్రహించితివి. నీవు, అశ్వమేధ యాగము చేసి దిగ్విదితయశము గాంచిన వల్లభేంద్రుని హస్తమునం దలరారుచుంటివి. ఆ మహాత్ముఁడు నిన్నాశ్రయించిగదా, హర్షవర్ధనుని, సంగరప్రియుఁడైన మహాయోధను, దిట్టముగఁగొట్టి తరిమి విజయముఁగాంచెను. పల్లవులను గాంగులను మద మణఁచి కుంతల దేశమంతయు నేక చ్ఛత్రాధి పత్యముగఁ బరిపాలింపఁ గలిగెను!

“ఓఖడ్గమా, అట్టి ప్రశస్తిని గాంచిన నీవు నన్నుఁజేరుట, కుంతల (రట్టపాడి) దేశమునఁ జాళుక్యపాలనము నెలకొల్పుటకే యని భావించెదను. ఔను, ఆకాలమునందుఁ గుంతల సామ్రాజ్యమునకు బ్రబలవిరోధిగ శ్రీహర్షవర్ధనుఁ డేర్పడి పరాజయమొందెను. ఈకాలమందుఁ గుంతలమునకుఁ బగవాఁడయి యంతశ్ఛిద్రములు రేఁపుచున్న హర్షదేవుఁడు, లాటదేశాధిపతి

నాచేతఁ బరాభూతి నొంద నున్నాఁడేమో? ఈ యూహాయే సరి యైనచో శ్రీసత్యాశ్రయ పులకేశి వల్లభేంద్రుఁడే నేననఁదగదా!" అని యేవేవో వెఱ్ఱితలంపులు తలఁచుచుండెను. అట్టియెడ వాని చూపు లాఖడ్గమునుండి మరలి చుట్టుప్రక్కలకు వ్యాపించెను. ముసలివాఁ డాయాసము దొలఁగి నెమ్మదిఁ జెందియుండుటను గాంచెను. అప్పుడావృద్ధుఁడు తైలపను జూచి, "నాయనా! నీ యందేలకో నాకుఁ బుత్రవాత్సల్య మొనఁగూడినది. దాని కిది కారణమని యూహింపకున్నాను. అందులకుఁ దగినటులే నాపుత్రులు చేయని మహోపకారముఁ జేసితివి" అనెను.

తైలప—అయ్యా, మీదేశమెది? ఇటకేల వచ్చితిరి? మీపుత్రులెవరు? వారెచట నున్నారు? మీకేల యిట్టి నిర్బంధ మొనఁగూడినది?

వృద్ధుఁడు—నాయనా! ఇప్పుడు వానిని ద్రవ్వకుము. మన మీ దొంగల గూడెమునుండి తొలఁగునంతవఱకు కోర్చి యుండుము.

తైలప—తాతా, నేను గొన్నాళ్లిచ్చటనే వసింపవలయు ననుట దైవసంకల్పము. మీరీచోటు విడువఁగోరెదరే! అందు లకుఁ దగిన కారణములు మాత్రము నాకు స్ఫురింపవు.

వృద్ధుఁడు—కారణములా! అట్టిదేవియుఁ గానరావు; కాని, మన మీ నాయకుని క్రోధమునకు గుఱియైతిమి. వాఁడు తనపద్దును సాధించుకొనఁగలఁడు; మనకీ స్థలము క్షేమకరమైనది గాదు.

తైలప—తాతా, నాయకుఁడును మానవమాత్రుఁడే కదా!

వృద్ధుఁడు—మానవ మాత్రుఁడే యన్నను, వాని యందు సమానుషశక్తి గలదు. అడవి నంతటిని దనకు విహారప్రదేశము గావించికొని, అచ్చటచ్చట దుర్గమస్థలములందు విడి విడిగాఁ దన భటులను నిలిపి, తానుబూనిన పనికి భంగమేర్పడునప్పు డట్టి ఘోరకార్యములకును వెనుదీయక మెలఁగుచున్నాఁడు. వాఁడు ప్రకృతిచేత సజ్జనుఁడు. ఏదో పరమార్థమునుగోరి యిట్టి చర్యకు సాహసించియున్నాఁడు; మహాతీక్ష్ణ శాసనుఁడు. వానియా జ్ఞనుల్లంఘించినవారికి మరణమే శరణ్యము. ఇంతదప్ప వాని చరిత్రము నాకుఁ దెలియదు.

తైలప—సరి, మీరు మరణమునకు వెను దీసెదరు. మీరు కోరునట్టి ప్రదేశమునకుఁ బిలుచుకొనిపోయి విడిచెదను. ప్రకృత మెవ్వఁడును నాదుర్గమును బ్రవేశింప లేఁడని మీరూహింప వచ్చును. మన మత్యంత రహస్య ప్రదేశమందున్నా మని నమ్ముఁడు. కొన్నాళ్లదనుక మీరిచ్చటనే యుండుట ప్రశస్తము.

వృద్ధు—నాయనా, నేను జావునకు వెనుదీయు పామరుఁ డనుగాను; ఉత్తమ క్షత్రియుఁడను; నేను కాలగతినొందుటకుఁ బూర్వము కొన్నికార్యములు నిర్వహింపవలసినది జన్మోద్దేశము. నాచరిత మిట్టదనిత్వరలోనే తెలిసికొనఁగలవు. ఈ వేళకు నాయకుఁడేమి ప్రయత్నమున నున్నాఁడో? మన మీ దేవాల యప్రాంతములందే దాఁగియున్నామని భావించి యేమిసేయు చున్నాఁడో? తెలియకున్నది. తెలిసికొందుమేని యందులకుఁ దగినట్లు మెలఁగ వచ్చునుగదా!

తైలప—వాని యుద్యమములను దెలిసికొనవలయునని కోరెదరా? మన మీ యాలయము విడిచి వెలుపలకుఁ బోవక,

చుట్టుప్రక్కల జరుగుచున్నవింతలను జూచుటకు వీలుగలదు. రండు; నావెంటనే రండు" అని ఖడ్గపాణియై యతనిని బిలుచుకొని యందుండి కదలి యాయుధాగారముఁజేరి కుడ్యాంతరమార్గము ప్రవేశించి గోడలలో నేర్పడియున్న రంధ్రములనుండి చూచెను. దొంగల రాకపోకలజాడ యొంతమాత్రము గానరాదయ్యెను. చుట్టుప్రక్కల మానవులు నడయాడు సూచనలును గన్పట్ట వయ్యెను. వారిరువురు కొన్ని గడియ లచ్చటనే నిలిచియుండి వెలుపల నేమి జరుగునో కనుఁగొందమని కనిపెట్టి యుండిరి.

## ఇరువది రెండవ ప్రకరణము

## యుద్ధము

నాయకుని యానతిచొప్పున నలువురు దృఢకాయులు కుణపాదిసాధనములను మోసికొనివచ్చి ఆాతికట్టడమును జేరిరి. ఆకట్టడము వాకిలి దుర్భేద్యమైనది. కావున, గదికి లోపలివంక నున్న ద్వారబంధము సులభముగాఁ బెకలింపవచ్చునని భావించి, గోడకు నిచ్చెన నానించిరి. మొదట నొకఁడు నిచ్చెననెక్కి గోడపైఁ గూరుచుండెను. ఇరువురు నిచ్చెనపై నిలుచుండునట్లే దిగువ నిలుచువాఁడు సాధనములను జేతి కందిచ్చుచుండఁగా నందికొని గోడపైనున్న వానికిచ్చిరి. వాఁడు, వానిని దీసికొని గోడ కావలివైపుననున్న దొడ్డిలోఁ బైనుండి దబాలు దబాలు మని వేసెను. తుదకందఱును గోడనెక్కి నిచ్చెన లోవంకకు నిలిపి దిగిరి.

ఆవేళకు దొడ్డిలోఁ దూఱియుండిన వ్యాఘ్రము, తనయొ
ఆను బూర్తిగఁ దిని యందుండి వెడలిపోవుటకు మార్గము
గానక, దొడ్డియంతయుఁ జుట్టి చుట్టి వచ్చుచుండెను. అది వెడలి
పోవుటకు వీలుగలుగనందునఁ బెద్దబోనులోఁ జిక్కువడినట్లు
తలఁచెను. అది లోఁపలనే పలుమాఱు తిరిగి చుట్టి వచ్చుటచేత
క్షుద్బాధయుఁ గోపమును బడలికయును ముప్పిరిగొని యతిశ
యించెను. ఇట్లుండ, భటులు సాధనములు పడవైచిన చప్పుడు
విని, తన కేదో యొఱ సమకూఱు నని భావించి, యచటనున్న
చెట్లచాటునఁ బొంచియుండెను. భటులు కనఁబడఁగానే భీషణ
ముగ బొబ్బరించుచు నొకనిపైఁ బడెను. దానియొడలు తాఁకున
నచ్చటనున్న నిచ్చెన దబాలునఁబడి యిరువురకు నపాయకర
ములైన గాయములు దగిలెను. పులిగొట్టినదని తెలిసి తక్కిన
ముప్వురును భీతిపెంపున హాహా యని యఱచిరి. ఆయఱపులకు
పులిబెదరి మిగిలినవారిపైఁబడి కొఱికి చంపెను.

దుర్విధిచే చిక్కటముగాఁ గొట్టువడి, దుర్భరమయిన
వియోగక్లేశమును భరించి, మనుష్యుని నోటఁగఱచికొని
లోనికిఁజొచ్చిన బెబ్బులిని సందర్శించి, చిత్తమవిసి మూర్ఛ
మునిఁగియున్న కళింగరాజకన్యకుఁ గొంచెము కొంచెము సొమ్ము
దొలఁగుచు వచ్చెను. ఆవేళ కుదయ మయి తొమ్మిదిగంటల
ప్రొద్దెక్కియుండెను. తలుపు సందులనుండి యెండ వెండికమ్ముల
వలె లోనికి నిగుడుచుండెను. ఆయింతి, దొడ్డివంక నున్నటులుండి
కలిగినసందడికి లేచి, తలుపునందున్న రంధ్రమునుండి చూచెను.
ఒకబెబ్బులి! తొలిరేయి తన్నుదిగులుకొలిపిన బెబ్బులి! తాను
గొట్టిన ప్రేతములతోఁ జెరలాడుచు వానిపై గంతులిడుచు,

తోఁకనాడించి గుఱుపెట్టుచు నీవల కావలకుఁ జెంగలించుచు-
నుండెను. కళింగ కన్య యా వ్యాఘ్రమును జూడఁ గానే భయ
విహ్వలయై యేమి సేయుటకుఁ దోఁచక మ్రాను పడియుండి కొంత
వడికి వెలుపలి తలుపుఁ దెఱచుకొని యచట నెవ్వరును గాన
రాక పోఁగా నీదెసకుఁ బోవలయునను నుద్దేశము లేక, వ్యాఘ్రే-
శాలయమునకుఁబోవుట కేర్పడియున్న కాలిబాటనుబట్టి పోయి
కోనేటిగట్టు చేరెను. ఆ యబల, పెక్కు కష్టములకుఁ జిక్కి-
చెన్నఱి, ఘోరదర్శనములఁ జిత్తము సెదరి వేళకుఁ దగిన యన్న
పానములు లేక వెతనొందినది గాన, శరీరాయాస వశమునను
దౌర్బల్యాతిశయమునను గాళ్లు నడుచుటకుఁ గాక పెనఁగు-
లాడుచుండ, ముందున కడుగెత్తి పెట్టలేక యందున్న యొక
చెట్టు నీడను గూలఁబడెను.

చుట్టుప్రక్కల సద్దణఁగి యుండెను. పక్షుల కలకలధ్వనుల-
ణఁగి యుండినవి. జనుల సందడియుఁ గన్పట్టవయ్యెను. వెలుపల
జరుగు వింతలను గనుఁగొనవలయునని గోడలో దాఁగియుండి-
రంధ్రముల వెంబడి నాల్గువైపుల బరికించుచున్న యువకునకును
వృద్ధునకు నేమియు నాయకుని సంబంధించిన చర్యలు గోచరింప
వయ్యెను. అట్టితరుణమందు వృద్ధుఁడు తైలపనుజూచి, "నాయనా!
ఇది మిగుల చోద్యముగనున్నది! నాయకుఁడిచట లేఁడో? ఉం-
డియు జరిగిన సంభవములను దెలిసికొనఁడో? వానికి జరిగిన
సంగతి తెలిసియుండిన యెడల నీయటవి కగ్గి దరికొలిపి వెంటనే
భస్మముగావించి యుండఁడా? నన్ను వెదకి దెచ్చుటకు భటులను
నాలుగు దెసలకుఁ బంపియుండఁడా? తనగుట్టు వెల్లడియగుట
కిందాఁక నోర్చియుండఁడే? బావిలో తాయివైచినట్లు వాని-

యత్నములు మిక్కిలి గూఢముగా నున్నవే!" అని చెప్పుచుం డఁగా, "హాహా" అను నార్తధ్వానము వినవచ్చెను. గాలి తమ వంకకే వీచుచుండుటవలన, కోనేటి యొద్ద నిగిడిన యా ధ్వనిని వృద్ధుఁడును యువకుఁడును బాగుగా వినఁగలిగిరి. అది, ప్రాణాతురయైన యొక పికవాణి యార్తనాదము! మఱిరెండు విఘటికలవఱకే సవ్వడియు లేదు. అంత, చెవిగూబలను జీల్చి వైచునట్టి బెట్టిదమైన యీల యొకటి నిగిడెను. దానివలన నా కాంతారసీమను బ్రతిధ్వనియుఁ గలిగెను. ఆ ధ్వని యడఁగి యొక నిముసమైనను గడువలేదు; కాయపుష్టిగల యొకఁడు, లతాంగి నొక్కరితను, మూర్ఛమునిఁగియున్న యన్నులమిన్నను, మోసి కొని దేవాలయమువంకకు వచ్చుచుండెను. ఆసమయమందే, పార్శ్వమందున్న చెట్లసందుల దారిచేసికొని, "ఓరీ! నీచులార! మానవపిశాచములార! మీరీరాష్ట్రమునఁ బడి దోఁచుకొను టతోఁ దృప్తిసెందక కన్యలను జెఱపట్టి హింసించు దుష్కా ర్యమునకుఁ గూడ నొడిఁగట్టితిరా?" అని, కవచధారియగు రాతోఁకఁడు మెఱపుమెఱసినట్లు తన గుఱ్ఱ మూదొంగపైదోలి ధారావిశుద్ధిగ వానికంఠము నఱికి వైచెను. వెంటనే యారౌతు గుఱ్ఱముదిగి, ఆ పడఁతి మూర్ఛమునిఁగియుండుటను దెలిసి, ఆబిడ 'నెటు లుపచరించి స్వస్థపఱుచుట?' అని తలపోయుచుం డఁగా నలుదెసలనుండి యాయుధపాణులయిన భటులు పదు గురు బాణవేగమునఁ బాఱివచ్చి యాచోటుఁజేరిరి. తమ వర్గమునఁజేరిన భటుఁడు దెగిపడియుండుటను గాంచిరి; దాపునఁ దమచేఱకుఁ జిక్కిన యువతి సొమ్మసిలి యుండుటను దాని నర యుచుఁ గవచధారి నిలిచియుండుటను జూచిరి. కొన్నాళ్లనుండి

తమ గుట్టరయు నెంచి యాప్రాంతములందు నడయాడుచున్న రౌతు వాఁడే యని నిశ్చయించికొని పైఁబడిరి.

వారియడుగుల సవ్వడి వినవచ్చినప్పుడే కవచధారి మరలి చూచి, తీవ్రునఁ దనగుఱ్ఱముసెక్కి, వారి లక్ష్యమునకుఁజిక్కక, కరవాలమును బెట్టిదముగఁ ద్రిప్పుచుఁ బోరఁ దొడఁగెను. అంతలో, నలుగురు రౌతులు దబదబమని యటకువచ్చి యొఱల నుండి కత్తులు దూసి యాదొంగలను దాఁకిరి. పదునైదు నిముసముల వఱకు పోరు ఘోరముగా జరిగెను. అయిదుగురు రౌతులు మెలఁకువఁ దెలిసి తమ యొడళ్లకు గాయము దగులనట్లు పగవారితోఁ బోరు సలిపిరి. దొంగలు సైఁతము తమ్ము మాఱొక్కన్నవారిని దాఁకి యాయుధములువీచుచుఁ బిశాచముల భంగి పోరాడిరి. అంతలో నేఁబండ్రు దొంగలు పలువిధములైన యుద్ధసాధనములఁబూని తమవర్గమువారికిఁ దోడుగా వచ్చిచేరిరి. ఏవురు రౌతులు తమ శక్తినంతటిని బ్రయుక్తపఱచి యెంతసామర్థ్యముతోఁ బోరినప్పటికి నఱువది మందికాలరులను మాఱొక్కని యుద్ధముసేయుట మిగుల శ్రమగానే యుండెను. రణమందుఁ గవచధారి బొత్తిగ నలయికఁ జెందెననుట స్పష్ట మాయెను. ఆ భయంకరారణ్యగర్భమందా యేవురు రౌతులకు బాసట రాఁగలరను నమ్మకము దోఁచదయ్యెను. దేవాలయమున కెడమప్రక్క నూఱుగజముల దూరమందు వారి యుద్ధరంగ మేర్పడియుండినది. ఆయుభయపక్షములవారిలో నొండొరులను బొడిచి పొడిచి కూల్చుటే ముఖ్యోద్దేశముగ నప్పటికేర్పడి యుండఁబట్టి, ఆవీరుల చూపులు పరిసరములకుఁ బ్రాఁకవయ్యెను.

కుడ్యాంతరాళమం దదివఱకు నిలిచి చూచుచుండిన యువకుఁడోపికను బిగపట్టఁ డయ్యెను. ఒక్కనిమిషమైన వ్యర్థపుచ్చక ముసలివాని నచ్చటనే నిలిపి ద్వారపాలక ప్రముఖునివైపునుండి వెలువడెను. బెట్టిదమైన యుఱుములతోఁ బిడుగురాలునట్టులు వీరహుంకారములతో ఖడ్గరాజముఁ ద్రిప్పుచు రణరంగమును జొచ్చెను, అందాఁక, రణవ్యగ్రులయిన వారిలో నెవఁడుగాని యువకుని గుర్తింపఁ డయ్యెను.

“ఓ కవచధారియగు మిత్రుఁడా! కొంచెమలసటదీర్చుకొనుము; ఇంచుక విశ్రమింపుము. అందాఁక నీపనిని నేను జేసెదను” అని యుపచారములు పలుకుచునే నలువురిని నఱికి కూల్చెను. అప్పుడు, కవచధారి తైలపనుజూచి, “హా! మనోహరుఁడ, నాకోర్కి నెఱవేరెను. నీదర్శన లాభమునఁ గూడెను. నాయలసట దొలఁగెను. నీవించుక నారణవిహారమును జూచుచుఁ దొలఁగియుండుము” అని పది నిముసములదనుక విరోధులు భయపడునట్లును తైలప యచ్చెరు వొందునట్లును ఘోరముగఁ బోరెను. తైలప సందర్శనవశమున నుప్పతిల్లిన రసాంతర మంతఃకరణమును బూర్తిగ నావరించుకొనుటచేత, వీరరస మాయోధయందు నిలుకడగా నిలువ లేక పోయెను. పైఁబైని బొంగి పొరలుచున్న రసోద్ధతికిఁ జిక్కి యాకవచధారి నిస్పృహతను జెంది నిలిచెను. అంతలోఁ తైలప, ఎచ్చటఁ గాంచినను దానయై యాపగవారి మూకపైఁబడి నిశ్శేషముగఁ జంపి కూల్చెను. అచ్చట వానినెదిరి పోరునట్టి వీరుఁడొక్కఁడును లేఁ డయ్యెను.

మల్లప, వీరయువకునితో మాటలాడుటకుఁ గొంతదె
ఱపి గలిగెను. ఆవేళకే మూర్ఛితయై పడియుండిన కన్యకకుఁ
గొంచెము కొంచెము సొమ్మదీఱుచువచ్చి నెమ్మది యొనఁగూ
డెను. అది కన్నులు దెఱచి నలువలంకులఁ జూచెను. తనకు
దాపుగా నార్గురు ఖడ్గపాణులు నిలిచియుండుటను గాంచెను;
వారు తన నిమిత్తమే, తనకు మేలొనఁగూర్చు నిమిత్తమే కాఁ
బోలు, అచట నున్నారనుట నూహించెను. అప్పుడు దానిగుండె
యదురించుక దీఱి నెమ్మది యొనఁగూడఁ జొచ్చెను. మెల్లఁగఁ దల
యెత్తి చుట్టుప్రక్కలఁ జూచెను. అనతిదూరముననే దొంగల
గాత్రములు ఖండితములై నేలఁబడి బీభత్సరసము నించుచుం
డినవి. దగ్గఱ నిలుచున్న యీవీరులే వారినికూల్చి యుందు రని
నిశ్చయించెను. అందులకు నిదర్శనముగా, వారు పూనియున్న
ఖడ్గములు రక్తలిప్తములై యుండెను. "హా, ఈ వీరోత్తుంగు
లెవరో యీయరణ్యమున ననదయై పడియున్న నన్ను రక్షింప
వచ్చిరి. వీరు తప్పక దేవదూత లగుదురు; మానవమాత్రులు
గారు" అని తలపోసి, "ఓ మహనీయులార! ఇట్టి యిక్కట్టున
నా కుపకరించి పుణ్యమున కొడిఁగట్టితిరి. మీకుఁ బదివేల నమ
స్కారములు; ఇంతకంటె నిట్టిస్థితియందు నే నేమి చేయఁగలను?
అని కనికరము గలుగునట్లు హీనస్వరముతోఁ బలికి, మెల్లఁగ
లేచి కూర్చుండి, చెదరియున్న ముంగురులను దొలఁగియున్న
పయ్యెదను సవరించుకొనెను.

ఏదో సంభాషింపఁ దలకొనియున్న తైలపయొక్కయుఁ
గవచధారియొక్కయు దృష్టుల నాయింతి పలుకు లాకర్షించెను.
అంత తైలప యా కళింగ రాజకన్యనుజూచి, "ఓకన్యకా! నీయుప

చార వాక్యములకంటె నీ యారోగ్యము మాకు మిక్కుటముగ
సంతోష మొనఁగూర్చెను. నీ వీ దొంగలకుఁ జిక్కి యీ
యరణ్యముజేరిన క్షణము మొదలుచేసి యీనీచులనుండి నిన్ను
విడిపింపఁ బ్రయత్నించు చుంటిని; తరుణము దొరక దయ్యెను.
తుదకు శక్యముగాకయే పోయెను. నే నుత్తమ క్షత్రియుఁడనై
పుట్టి ఖడ్గోపజీవినై యుండి నిన్ను రక్షింపనైతిని. ఈ కవచధారి
యెచ్చటనుండియో వచ్చి నిన్ను రక్షించు పుణ్యమునకుఁ బాత్రుఁ
డయ్యెను. యువతీ! నీ వీ వీరయువకునే మనసార యభినందింప
వలయును. "ఓ వీరవరేణ్యుఁడ! నీబుద్ధి ప్రశంసింపవలసి యున్నది.
ఇంక నీవు గాని నీయనుచరులు గాని యిచ్చట మసలరాదు.
ఈ కన్యయు నిచటనుండరాదు. ఇప్పుడే మీరిచ్చటనుండి కద
లుఁడు. నీ వంటి మిత్రునితో నొకటి రెండుపూటలకైనను
కాలము గడుపు భాగ్యమునకు నోఁచుకొనైతిని. ఈయరణ్యము,
ఘోరకృత్యములకు వెనుదీయని పాతకులకు వాసస్థాన మైనది.
మీరిప్పుడే యిందుండి తరలుఁడు. ప్రాప్తమున్నఁ బునర్దర్శనము
తప్పదు. తొందరగాఁ గదలుఁడు" అని త్వరపెట్టెను.

---

## ఇరువదిమూఁడవ ప్రకరణము

## క్రొత్తసంకటము

కొలనుగట్టుననున్న చెట్టునీడను గూలఁ బడియున్న
కళింగరాజ పుత్రికను నాయకుని భటులిరువురు జూచిరి. వారిలో
నొకఁడు, "అన్నా, నేనీకన్యను ఊతికట్టడమందుఁ జేర్చెదను.
నీవీసంగతిని మన యేలికతోఁ జెప్పి రమ్ము" అని మఱియొకనిఁ

బంపెను. వాఁడంతట నాయువతి యున్న చోటుఁ జేరఁగా, అది వానిని జూచి భయము పెంపున హా యని యఱచి మూర్ఛిల్లెను. వాఁడు యువతి దుస్థితినిఁ జూచి, దానికిఁ దన్నుఁ గారణపఱచి నాయకుఁడు ఘోరముగ దండించునేమో యని భయపడి తోడ్పాటునుగోరి యీలవేసెను. చుట్టుప్రక్కల నుండి సాయమునకు భటులు వచ్చునంతలో దాని మూర్ఛ దొలఁగునట్లు శైత్యోపచారములు చేయ నెంచి, యీలయము నొద్దకువచ్చి యొక చోటుఁ జేర్చెను. అప్పుడే కవచధారి వానిని నఱికి కూల్చెను. వర్తమాన మందింపవెళ్లిన భటుఁడు నాయకుని జూడఁగోరెను ; కాని వాని సందర్శనము లభింపలేదు. వెలుప లనే వాఁడొక చోటఁ గూర్చుండి నాయకునిఁ జూచుటకుఁ దరుణము కనిపెట్టి యుండెను.

నాయకుఁడు, ఏకాంత గృహముఁ జేరి జరిగిన సంభవములను గూర్చి పెక్కువిధముల నాలోచింపఁ దొడఁగెను. ఎన్నివిధములఁ దలపోసి చూచినను గారణమిట్టిదని వానికి గోచరింపలేదు. వాని ప్రయత్నముల కన్నిఁటికిని, వాని కోర్కుల కన్నిఁటికినిఁ గారణభూతుఁడని తలఁచియున్న వృద్ధుఁ డున్నట్టులుండి కనఁబడకపోయెను. ఆతని ముందిడుకొని తాను జేయ సంకల్పించుకొనిన పనులన్నియును తుదకు వెల్లిఁగలిపిన చింతపండాయెను. "ఇప్పుడా వృద్ధుఁ డెచట నుండును? అచటికి వృద్ధునిఁ బిలుచుకొనిపోయిన వీరుఁ డెవ్వఁడు ? వాఁడన్యుఁడా ? స్వీయుఁడా ? అను ప్రశ్నలే వాని మనస్సులో మాటి మాటి స్ఫురించుచు వచ్చెను. అవి యెటులున్నను, తుదకుఁ దనకుఁ గర్తవ్యములైనవి యిట్టివని నిర్ణయించుకొని, వాఁ డేకాంత గృహమునుండి

వెలుపలకువచ్చెను. ఆవేళకు సరిగా, రామన్నను జేపట్టఁగఁబిలు
చుకొని వచ్చుటకేఁగిన భటులు, అతనితోడ వెళ్లియుండిన
భటునిఁ దెచ్చి నిలిపిరి. నాయకుఁడు రామన్నవిషయమై యడు
గఁగా, "దేవరా! మేము పయనమై, హుటాహుటి నడలతో నీ
యరణ్యము పొలిమేరఁ దాఁటినప్పుడు పలపల తెల్లవాఱెను. మే
మొకగ్రామముఁ జేరి మజ్జన భోజనాదులను జరిపికొని పయనమగు
నట్లు నిశ్చయించుకొంటిమి. రామన్న గ్రామమునకు వెలుపలనే
యుండి, తగిన వసతిఁ జూచి రమ్మని నన్ను గ్రామములోనికిఁ బంపెను.
నేను వెళ్లివచ్చునంతలో నతఁడచ్చట లేఁడు. చుట్టుప్రక్కలఁ
బోయి వెదకితిని. ఎచ్చటను గానరాఁడయ్యెను. నేనచ్చటనే
యుండుటకుఁగాని తరలిపోవుటకుఁగాని తోఁచక తొట్రిలు
చుండు తరుణమందే దేవర సేవకులు నన్నుఁ జూచి రామన్నను
గూర్చి యడిగిరి. జరిగిన సంగతిని జెప్పి, వీరితోడ మఱియొక
తడవ కతనిని వెదకితిని; తుదకు, తమతో మనవిచేయుటకై
వచ్చితిని" అని వాఁడనెను.

నాయకుఁడు—వెంకా, నేను మీయిద్దఱను బంపిన పిదప
నీవు రామన్నతోడ నుంటివని నమ్మెదను.

భటుఁడు—ఔను, దేవరా! రామన్నను విడిచి నేనెట
కును బోలేదు.

నాయకుఁడు—సరి, నన్నువిడిచి వెళ్లిన పిమ్మట రామన్న
చేసిన ప్రతికార్యము నీకుఁ దెలిసి యుండవలయును గద!

భటుఁడు—తెలియును.

నాయకుఁడు—రామన్న ఱాతికోటను గూర్చి వెళ్లి
నప్పుడు నీవుకూడఁ బోయి యుందువని తలఁచెదను.

భటుఁడు—లేదు దేవరా! మేముజాలికోటకు వెళ్ల
లేదు. కాని, దారినడుమ నున్న జాలికట్టడము నొద్దకుఁబోతిమి.

నాయకుఁడు—జాలికట్టడమునకుఁ బోవలసిన యావసర
మేమి? అచ్చటరామన్న యేమిచేసెను?

భటుఁడు—అచ్చట రామన్న చేయఁదగిన పని యేము
న్నది? చెఱయందున్న యువతిని జూచుటకే పోతిమి. మేము
చూచినప్పు డాకన్య సోలి పడియుండెను. రామన్న యాబిడను
జూచి, భయపడవలదనియును దేవర యధీనమునందున్నంతవఱ
కామె మానప్రాణముల కెట్టి హాని గలుగదనియును ధైర్యోక్తులు
పలికి యాచోటుఁ బాసెను.

అదివఱకుఁ గనిపెట్టియున్న భటుఁడు తాను మనవిచేయు
టకుఁ దగినతరుణము తటస్థించిన దని యూహించి, "దేవరా,
కళింగకన్య యెటులో చెఱనుండి తప్పించుకొని, కోనేటి గట్టున
మసలుచుండుటను నేనును నామిత్రుఁడును జూచితిమి. ఆబాలి
కను జాలికట్టడమునఁ జేర్చుమని వానితోఁ జెప్పి, దేవర కీ సంగతి
విన్నవింప వచ్చితిని" అనెను. వాని మాటలకు నాయకుఁ
డచ్చెరువొంది, "ఓరీ! నీ వాకన్యను జూచినప్పుడు దానితో
నెవ్వరైన నుండిరా?" అనెను.

దేవరా, ఎవ్వరును లేరు. అది యొంటరిగా నచటఁ గూ
ర్చుండియుండెను. ఇంతకా కన్య జాలికట్టడమును జేరియుండును.

"నేను గన్నులారఁజూచినఁ గాని నమ్మలేను; పద!"
అనినాయకుఁ డా చోటు విడిచి కదలెను. అచటనున్న భటులంద
ఱతని వెంబడినే పోయిరి. వారు జాలికట్టడముఁ జేరినప్పుడు
వెలుపలితలుపు తెఱవఁబడి యుండినది. అచ్చటకన్యలేదు. దేవా

లయమునం దుండునేమో యని కొన్ని యడుగులు నడిచిపోఁగా ఘోరముగఁ బోరి పీరశయన మలంకరించిన భటుల మొండె ములు గానవచ్చినవి. తనకువర్తమాన మందించిన వాని మిత్రుఁడు నఱుకఁబడి యుండెను. పలుమాటలేల? అచ్చట బీభత్సరసము వెల్లిగొనుచుండినది. ప్రతిభటుఁ డెవ్వఁడును లేఁడు ; కన్నెయును లేదు.

"హా, ఇదేమివింత ! నామనుగడలో నిట్టిసంభవమెన్నఁ డును దటస్థించినదికాదు. నాభటులు సామాన్యులుగారు ; వీరు సాహసకార్యములం దాఱితేరిన వీరులు; మిగుల బలాఢ్యులు ; వీ రీ విధమునఁ గూలిరి. వీరిచేఁ గూల్పఁబడిన వాఁడెవ్వఁడును లేఁడు. ఇదేమి మాయ ! ఇట్టిచేఁతకుఁ దెగించిన వీరుఁడెవఁడై యుండును ? ఇట్టి పరిస్థితుల ననుసరించి చూడఁగా, ఈ విషయ మందు రామన్న జోక్యమెంతమాత్రము లేదని తోఁచుచున్నది. ఇది నాగుట్టుబాగుగాఁ దెలిసికొని యున్న పరులచేతనే జరుగు చున్నదని యూహింపవలసియున్నది. ఇందులకు మిక్కుటముగాఁ బ్రయత్నించిననేకాని యేమాత్రము ప్రతీకారమును జేయలేను. ఇది యిప్పుడు నాకేర్పడిన క్రొత్తసంకటము" అని తలపోసి, తనలోని సంకటము వెలిఁ బుచ్చక కప్పి పుచ్చి, పోరునందుఁ బడినవారిని తాతికట్టడము వెలుపల నిక్షేపించు నటు లానతిచ్చి నాయకుఁ డాచోటుఁ బాసెను.

నాయకుఁడు, తన చోటుఁజేరి యొకనిముసమైన వ్యర్థ పుచ్చక, భటులలోఁ బ్రముఖులను రావించి, "నేనొకపని నుద్దే శించి వెళ్లుచున్నాను; వచ్చుటకుఁ గొన్నాళ్లు పట్టును. మీరెల్లరు ప్రమాదమునకుఁ జోటీయక, ఈ యరణ్యమందు మీకొఱకు

నిర్ణీతములై యున్న స్థానములలో దాఁగియుండి పరుల చర్య లను గనిపెట్టి యుండుఁడు. ఈ యడవిలోఁ గ్రొత్తవారు ప్రవే శించినచో మీరు వారిని మార్కొనరాదు ; జాలికోటకేదైన యాపదవచ్చునట్లు దోఁచెనేని మాలవ్యున కాసంగతి దెలిపినఁ జాలును" అని దిట్టపఱిచి పంపెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము.

### అసూయ

తైలప యా కవచధారినిఁ జూచి, "మీరిప్పుడే యిం దుండి తరలుఁడు; తొందరగాఁ గదలుఁడు" అని త్వరపెట్టెనని చెప్పియుంటిమి. అట్లతఁడు వేగిరపఱచుటకుఁ గవచధారి యువ కునిఁజూచి, "ఔను, మనోహరుఁడ ! ఇది క్షేమకరమైన చోటు గాదని నాకును దెలియును ; నన్నుఁగూర్చి యేమియుఁ నడుగ కుము. నేను నిన్నుసందర్శింపఁగోరియే యిటకువచ్చితిని; వచ్చి యీయింతిబన్నముఁ దీర్ప నించుక పాటుపడితిని. తన్మూలముననే నీసందర్శనము గలిగి నాయుద్దేశము సఫలమయ్యెను. ఇఁక ననతి కాలముననే నాకర్ణములు నీ సల్లాపసుధను గ్రోలఁ గల వని నమ్మెదను. మిత్రుఁడా, నీకోర్కి చొప్పుననే యీయింతిని బిలుచు కొనిపోయి సురక్షిత ప్రదేశముఁ జేర్చెదను" అనెను.

తైలప—మిత్రమా, ఈయువతి నీయొద్దనే యుండఁ గోరెదను. ఒకవేళ—ఈబిడ పెద్దలను జూతువేని వారికడఁ జేర్పుము.

కవచధారి—నెయ్యుఁడా, నీజనకు నొద్ద విడిచెదను. అతఁ డిప్పుడు బలములతో నీయడవి పొలిమేర యొద్ద శిబిర మేర్పఱచికొని యున్నాఁడు.

కవచధారి తనతండ్రినిగూర్చి ప్రస్తావించుట చేత, తన కుటుంబమువారిని వానికి బాగుగాఁ దెలియునని తైలప యూహింపఁగలిగెను; కాని శౌర్యసాహసములను గూర్చి తలఁచునప్పు డట్టివాఁడు, తనవారిలో నెవ్వఁడును లేకుండుట వానికి స్పష్టమయ్యెను. కావునఁ దైలప తనయజ్ఞాత మిత్రునిఁ గూర్చి తెలిసికొనుట యందించుక తొట్రిల్లెను. వాని నడిగి తెలిసికొందమనినఁ గొన్ని నిముసములకు మున్నే, "నన్నుఁగూర్చియేమియు నడుగకుము" అని వాఁడు చెప్పియుండెను గదా! వాని కితర సంభవము లందువలెనే కవచధారి విషయమందును వింత గన్పట్టెను. యువకుఁడు తన యభిప్రాయ మెంతయును వెలిఁబుచ్చక, "ఔను, అజ్ఞాతమిత్రుఁడ! అటులేచేయుము; ఈరాజపుత్రిక నాజనకపాదుల యొద్దనే విడువుము. ఇది నీవు నాకొఱకుఁజేయు మహోపకార మని భావించెద"నని యాకవచధారిని గాఁగిలించుకొనెను. ఆకౌఁగిలి కా కవచధారి సాక్షి నిశ్చేతనుని వలె స్తంభీభూతుఁ డయ్యెను. అంత తైలప కౌఁగిలి వీడి, వానిచేతిని బట్టుకొని యేదోచెప్పుటకు నోరు దెఱచునంతలో కవచధారిదృష్టి వాని వ్రేలియందున్న ముద్రయుంగరముపై సోఁకెను. వాడందుఁ జెక్కఁయున్న, "శాంత"అను నక్షరములు చదివెను. వానియెదలో నింతంతయనరాని యసూయ తలచూపెను. విసుఁగుతో వానిచేతిని విదిర్చికొట్టి, "సెలవిమ్ము, క్షమింపుము" అనుచునే యశ్వమారోహించెను.

అప్పుడు తైలప, "అజితుఁడా, అజితుఁడా !" అని యఱచెను. వాయువేగమునఁ జెవులు ఱిక్కించికొని యా శ్వేతాశ్వము తటకు వచ్చి నిలిచెను. తైలప దానినోటికిఁ గళ్లెము మాత్రము దగిలించి, కళింగరాజపుత్రిక నాగుఱ్ఱముపైఁ గూరుచుండఁబెట్టి, "మిత్రుఁడా, ఈ యువతిని మాతండ్రియొద్ద విడుచుటతోడ నేను వారిని నేఁడో రేఁపో కలిసికొనఁ గలనని చెప్పి పుణ్యమునఁ గొడిగట్టుము. ప్రియమిత్రుఁడా! ప్రకృతము నిన్నింతకంటె నుపచరింపలేను; నాకృతజ్ఞతను దెలిపి కొనలేను" అనెను.

కవచధారి, "సరిసరి" యనుచునే తొందరగాఁ దన గుఱ్ఱమును బేరెము వాఱించెను. వానివెంబడి కళింగకన్యయును దానివెంబడి కల్యాణపురముభటులు నలువురును గుఱ్ఱములు పఱపి విక్రమాదిత్యుని స్కంధావారముఁ జేరిరి. కవచధారి యశ్వావరోహణముచేసి శిబిరము ప్రవేశించి, రాజ సందర్శనముఁ జేసి, "ఓమహారాజ! నీవు దయయుంచి నా వెంబడిఁ బంపిన భటులు తగిన సమయమందు నాకుఁ దోడ్పడిరి. ఈకన్య కళింగరాజు కూఁతురు. ఈబిడ దొంగలచెఱకుఁజిక్కి మూర్ఛితయై పడియుండఁగా నే నుపకరింపఁ గలిగితిని. అప్పుడు, కొందఱు దొంగలతో నాకుఁ బోరొనఁగూడెను. అట్టి తరుణమందు మీభటులు ప్రాణములకుఁ దెగించి పోరిరి. మీ కొడుకు పోరుజరుగుచోటుఁ జేరి మహోపకారముఁ జేసెను. తుదకతఁడు, నేఁడోరేఁపో మిమ్ము సందర్శించునట్లు నన్నుఁ జెప్పుమనెను".

తన తనయునిఁ గూర్చి కవచధారి చెప్పిన సంగతి విక్రమాదిత్యునకు సంతోషము పెంచెను. భటులను బిలిచి, "మీరు యువరాజ సందర్శనముఁ జేసితిరా?" అని యడిగెను. "మహా

రాజ ! మేము యువరాజును గుర్తుపట్ట మైతిమి. మాయెదల కాతని యుద్ధకౌశలము విభ్రాంతి నించెను. యుద్ధానంతర మీ ప్రభుకుమారుఁడు వారితో సంభాషించుచుండఁగాఁ గొంత తొలఁగి యుంటిమి. హా, వారు యువరాజా?" అనిరి.

వృద్ధరాజు, ఆకవచధారిని జూచి, "వీరుఁడా, నీకు మమ్ము దెలియునా?" అని ప్రశ్నించెను.

కవ—మహారాజ! మీసందర్శనలాభమున కిదియే మొదటితడవ యైనను మిమ్ముఁగూర్చి విన్నది గలదు. తొల్లి యొక్కప్పుడు మీ యువరాజును జూచి యుంటిని. కాని, అతనితోడి సల్లాపభాగ్యము నాకు నేఁడే యొనఁగూడెను.

విక్ర—సంతోషము, నీవు మాశిబిరముపవిత్రము సేయ నీరేయి యిచ్చటఁగడిపి మమ్ముఁ గృతార్థులను జేయుము.

కవ—ఇప్పుడది యశక్యము; ఇఁకఁ గొన్నాళ్లకుఁగాని యట్టిభాగ్యము లభింపదని తలఁచెదను.

విక్ర—వీరయువకుఁడా, నీవు చూడఁదలఁచిన వనవాసిని జూచి యుండవని భావించెదను.

కవ—నే నాయువకునిజూచి తీరవలయునను పట్టుదలతో యత్నింపలేదనుట సత్యమే; అయినను, అతని జూచుటకంటె నెక్కువ ఫలమబ్బినదని చెప్పఁగలను.

విక్ర—సరి, కుమారవీరా! నీవు నాపుత్త్రుని సందేశముఁ దెలిపితివి ; నాకమందానంద మొనఁగూర్చితివి. ఈకృతజ్ఞత నీ కెట్లు చెల్లించుట ?

కవ—"నాయందు మీకుఁ దయగలదేని యాకళింగ రాజకన్యను గొన్నాళ్లు మీయొద్దనుంచికొని యుండుఁడు. ఇది,

నాకొఱకుఁ జేయుమహోపకారము” అని విన్నవించిశిబిరము విడిచి యెటకో తొందరగా వెళ్లిపోయెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము.

## వాఁడే వాఁడే

దిక్కుల నావరించియున్న కాఱుచీఁకటులు వెలవెలఁ బోవుచుండెను. నక్షత్రపంక్తులు వెల్లఁబాఱి యచ్చటచ్చట మినుకుమినుకు మనుచుండెను. మందమలయానిలాంకూరము లలసగతులతో సంచరించుచు లతాంతకుట్మలపేటికల నల్లనల్లనఁ దెఱచి పరిమళద్రవ్యాపహారమున కుద్యమింపఁ జొచ్చెను. వనమయూరికలు, అడవియందంతటను మెందుకొనునట్లు గంభీర షడ్జస్వరంబుల రక్తినించుచుండెను. అరుణోదయ రాగప్రభలింకను బ్రాచీదిశాగ్రభాగమున వ్యాపింపలేదు. అట్టియెడ, రామన్న హుటాహుటిని బయనము సేయుచువచ్చి, వ్యాఘ్రేశ సరోవరము చెంతఁ దన యశ్వము నిలిపెను.

రామన్న, అశ్వమునుండి దిగి దానికళ్లెము వీడ్చి యొక చెట్టుబోదెకుఁ గట్టి, పయనపు టలసట దీఱునట్లు కోనేటిలో మునుక లిడెను. అతఁడు, స్నానముచేసి లేచునప్పటికిఁ గర్మప్రాధాన్యమగు భారతభూమికిఁదగిన జోదును బట్టాభిషిక్తుఁగావింపఁదలఁచి, త్రిదివాధిపతి యొక్క భద్రగజము, సప్తసాగరముల పవిత్రతోయములతోడి స్వర్ణకుంభమును గుంభస్థలమందిడికొని తోతెంచెనో యనఁ బూర్వ దిక్కునందు సూర్యబింబము పొడసూపెను. రామన్న, ప్రాతఃకాలకర్మ నిర్వర్తించి, కర్మసాక్షికి మ్రొక్కి యందుండి గట్టుమీఁదికి వచ్చెను.

నలువలంకులఁ జూచెను! దొంగలజాడ గనిపించలేదు. దాపుననున్న చెట్టునెక్కి నలుప్రక్కలను పరికించెను. మానవ మాత్రుని జాడ గోచరించుటలేదు. ఊపిరి బిగ్గపట్టి గట్టిగ నీలవే సెను. ప్రత్యుత్తరముగ నే ధ్వనియు నిగుడదయ్యెను. వెంటనే, వృక్షావతరణముచేసి యాలయపరిసరముల యందు దొంగలుం డఁదగిన స్థానముల నెల్లఁ బరిశోధించెను. ఎవ్వఁడును కానరాఁడు. అంతట జాగుసేయక కళింగరాజకన్యయుండు త్రాతికట్టడము నకుఁ జూటిగాఁ బోయెను. దాని కావలివాఁడు గోచరింపఁడు. దాని తలుపు తెఱవఁబడి యుండినది. లోపలకుఁ బోయి చూచెను. తనప్రాణధన మచ్చటలేదు. రామన్న నివ్వెఱపాటొంది, "హా, ఇదేమి? ఈవ్యాఘ్రారణ్యము దొద్దవోయెనా? ఎట్టి యిక్కట్టులందు నిట్లొనఁగూడి యుండదే. ఏమివింత!" అని యించుక యాలోచించెను.

"ఔను...నాయకునకును మల్లప విక్రమాదిత్యుల సైన్యములకును యుద్ధము జరుగుచున్నదో?" అని సందేహించి తత్క్షణమే వారి శిబిరములను గూర్చిపోయెను. మల్లప స్కంధా వార మేయులబలములేక తొంటివిధముననే యుండుటను దవ్వుల నున్నటులే కనుఁగొనెను. కావున, సమరసన్నాహమెట్టిదియు లేదని యతఁడు దెలిసికొనెను; విక్రమాదిత్యుని స్కంధా వారమును గూర్చిపోయెను. అచట శిబిరమున్న జాడయే కన్పట్టకుండెను; "ఇదేమి సంకటము! ఈయత్యల్పకాలమున ముక్కాఁకలనాఁటి తేరిన కల్యాణపుర సైన్యములును నాయకుని దళ ములు నెట్లుహాతములైనవి?" అని గూడెమునుగూర్చి పోయెను.

గూడెముచుట్టు నేర్పడియున్న రహస్య మార్గముల న్నియు దిట్టముగ నిరోధింపఁబడియుండినవి. రామన్న కేర్పడిన భ్రమకును దొట్రుపాటునకును విషాదమునకును మేర లేదయ్యెను. ఇదేమి దురవస్థ! నాయకుని నెట్లు సందర్శింపఁగలను? అతని కెట్టికీడుమూడెను? నేనూహింపఁగల యెట్టిసంకటముగాని యింత యల్పకాలమున ఘటిల్లుటకుఁ గారణములు గన్పట్టవే! అని చింతావిలుఁడై గూడెము నొద్ద నిలిచి యీలవేసెను. అవ్విధమునఁ బెక్కుతడవలకుఁ జేయఁగాఁ నొకవైపునుండి యాయుధపాణియగు పురుషుఁడొకఁడు రామన్నయొద్దకు వచ్చినిలిచెను.

రామన్న వానినిజూచి, "మాలవ్యా, ఏమిసంగతి? మన పరి జనులెక్కడను గాన్పించరేల? నాయకుఁ డెక్కడ? అత్యావశ్యకములయిన పనులు గొనసాగించికొని వచ్చియున్నాను. ఇప్పుడే నాయకునిఁ జూడవలసి యున్నది" అనెను. మాలవ్యుఁడు వాని భావము గుర్తెఱుఁగుటకేమో కొన్ని నిముసముల దనుక వాని మోమునే చూచుచు మిన్నకుండెను.

"మాలవ్యా, క్రొత్తమానిసినివలెఁ జూచుచున్నావే! ఏల బదులు పలుకవు?" అని రామన్న ప్రశ్నించెను.

మాలవ్యుఁడు ముసిముసినవ్వులు నవ్వుచు, "రామన్నా, నీయందు గ్రొత్తనడవడులేర్పడుటచేత, క్రొత్తమానిసిని జూచినట్లు చూడవలసియున్నది. అదియుండనిమ్ము; నీప్రశ్నకు బదులు పలుకలేదని యంటివి గదా? నీకృషికి ఫలరూపములయిన విషయములు నీకే తెలియవలయును; ఇందు నేను జెప్పఁదగిన యంశమే మున్నది?" అని గంభీరస్వరముతోఁ బలికెను.

"మాలవ్య! నీమాటలు బోధపడుటలేదు; నేను లేనప్పు డిచ్చట నేమిసంభవించెను? జరిగిన వానిని దాఁచియుంచక చెప్పుము".

మాలవ్యుఁ డించుక యాలోచించి, "రామన్నా, నీకే మియుఁ దెలియదా? నిజముగానే తెలియదా? నీకుఁ దెలియ దను నంశమున నాకు విశ్వాసము పుట్టకున్నది."

"ఔను, మిత్రమా! నేను లేనప్పుడు జరిగిన సంగతు లేవియు నాకుఁదెలియవు. తెలియుటకును గారణములు లేవు."

"రామన్న! ఇటసంభవించినవింతలకంటె, 'నాకేమియుఁ దెలియ'దని నీవనుట మిక్కిలి చోద్యము."

"మాలవ్య, నన్నే ప్రబలముగా సందేహించుచున్నట్లు న్నది. జరిగిన సంగతులను జెప్పక కప్పియుంచెదవు; ఏమి జరి గెను? ఇప్పుడు మన నాయకుఁ డెక్కడకు వెళ్లెను? అతని నెచ్చట నందర్శింప వచ్చును? జాగుసేయక చెప్పుము".

"ఔను, రామన్న, నిన్నుసందేహించుటకుఁ గారణము లున్నవి. నేనడుగుదానికిఁ దగిన సమాధానముఁ జెప్పుము. కొన్నాళ్లనుండి క్రొత్తమానిసి యీావనమునందు మెలఁగుచుం డుట నీకుఁ దెలియని యంశముకాదు. వాఁడు మన భటులకుఁ జిక్కక యీాధుడవియందే సురక్షితుఁడై మెలఁగుచుండు టకు నీతోఁడ్పాటత్యావశ్యకము. నీవును నాయకుఁడును లేని సంగతి తెలిసి, జాతికట్టడము కావలి వానిని జంపి, రూపు గాన రానట్టు లెచ్చటనో పాఱవైచి, అటనుండి యెట్టివానికిని బ్రవే శింప నలవికాని మనగూడెములోఁ జొచ్చి, జాతికోటను జేరి, నాకత్తుకఁ బిసికి పడఁగూల్చి, కోటతలుపులు దెఱచి లోపలఁ

ప్రవేశించి, మననాయకునకుఁ బ్రాణపదమైన యొకానొక ద్రవ్య మపహరించికొని వెళ్లెను. ఎట్టి సాహసికిఁ గాని నీయట్టి వాని సాహాయ్య మలవడకుండిన నిట్లు మెలఁగుటకుఁ గాదు ; నీవే యాలోచింపుము.”

రామన్న యత్యాశ్చర్యముతో మాలవ్యాని మాటలు విని, “వెట్టివాఁడ! నీయూహ సరికాదు; ముమ్మాటికిని సరికాదు. నిర్భీకుఁడై యిట్టిఘోరకృత్యమున కొడిఁగట్టిన మహాసాహసికి, శుద్ధవీరునకు నాతోడ్పా టేపాటిది? నే నేపాటి వాఁడను? వానిని లోకమం దసాధారణ పురుషుఁడనియే చెప్పవలయును? వాఁడే కాఁబోలును ఆాతికోటలోని యమూల్యవస్తువుతోడఁ గళింగకన్యను సైఁత మపహరించి యుండును. వాఁడెవ్వఁడు? తాళింగుఁడై యుండునా ? లేక యన్యుఁడా ?”

“రామన్నా! నీయూహ సరియైనదే ; వాఁడే, వాఁడే! వాఁడే కళింగరాజకన్యను బిలుచుకొనిపోవుచు, అడ్డపడిన భటులలో నఱువదిరెబ్బదిమందిని నటికి కూల్చి తన పనిని బూర్తి గావించికొని వెళ్లిపోయెను.”

“వానిని మననాయకుఁడేమియుఁ జేయక విడిచెనా ?”

“అతని కీ సంగతి తెలియునంతలో, అన్నిపనులను ముగించుకొని వెళ్లిపోయెను. నాయకుఁడు, ప్రకృతము సన్నీయరణ్య రక్షణమున నియోగించి యీకుట్ర దెలియు నిమిత్తము మహా ప్రయత్నమునకుఁ జిత్తము చెల్లించెను.”

“సరి, అతని నెప్పుడు చూడవచ్చును ?”

“ఇఁక నాలుగైదు దినములకుఁగాని యతనిని జూచుటకుఁ గాదు ; నీవలెనే నేనుగూడ నతనిని జూడవలసి యున్నది.”

"నీవతనిని సందర్శింపవలసిన యవసరమేమి గలిగెను ?"

"నీ కీ సంగతి చెప్పవలసినది యత్యావశ్యకము. మొన్న యావనవంతుఁడొకఁ డొక చిన్నదండుతో మనయడవిని బ్రవేశించెను. వాని స్థితిగతులనుగూర్చి విచారింపఁగా, వానిపేరు శ్రీధరుఁడనియు కల్యాణనగరాధిపతిని గూర్చి విచ్చేసిన వాఁడనియును దెలియవచ్చెను. వానివలన నాయకునకు మేలొనఁగూడ వచ్చునని యిచ్చటనే నిలిపికొంటిని."

"మాలవ్యా, మంచిపని చేసితివి. వాని మైత్రి ముఖ్యమైనదే. వానికి గూడెమునందే బసచూపితివా?"

"ఔను, వానికిని వానిదండునకును గూడెమునందే విడిది చూపితిని. అయినను, వారివలన మనకెట్టి కీడుమూడనట్లు దుర్గ ద్వారముల నడఁచివైచి మనపరివారము వారిని దిట్టపఱచి పైగస్తుగ నియమించితిని.

"మాలవ్యా, ఈపనిని జాగరూకుఁడవై నిర్వహించితివి. అతనితో సంభాషించి మన కతనివలన నెట్టిప్రయోజన మొనఁగూడఁ గలదో తెలిసికొందము రమ్ము" అనెను. అంత నాయిరువురును గూడెములోనికిఁ బోయిరి.

## ఇరువదియాఱవ ప్రకరణము

## కృతఘ్నుఁడు

కవచధారి కళింగకన్యను బిలుచుకొని వెడలిపోయిన నాలుగైదుదినములకుఁబిదప నొకవారమువఱకుఁ దైలపకుఁ బని పూర్తిగ నుండెను. తైలప, విక్రమాదిత్యుని శిబిరమునందలి

పటకుటీరములను రస్తుసామగ్రులను నంచెలమూలమున దేవాల యోద్యాన ప్రదేశమునకు సాగించెను. ఈయుద్యమము దొంగలకుఁగాని మల్లపదళపతికిఁగాని దెలియదు. ద్వారపాలక విగ్రహమున్న దారివెంబడి విక్రమాదిత్యుఁడును గళింగరాజపుత్రికయు వనముఁజేరిరి. తక్కిన భటులంద ఱెటులెటులో యాయుపవనముఁ జేరఁగలిగిరి. సైనికులు శిబిరము లేపునపుడే చేదిదేశమునుండి కొందఱు భటులతో శ్రీధరుఁడు వ్యాఘ్రేశారణ్యమును బ్రవేశించెను; అతని నరిగట్టుటయందు దొంగలు చిత్తము చెల్లించియుండిరి. తైలప యరుణోదయమునకుమున్నే ప్రాతఃకాలోచితకృత్యములు దీర్చికొని, కవచము దొడిఁగి, మల్లప యొసఁగిన ఖడ్గముఁబూని చూటిగా ద్వారపాలక విగ్రహమునొద్దకు వచ్చి నిలిచెను. దేవాలయమందు జనులసందడి మెండుకొని యుండుటఁ గాంచెను. ఉన్నటులుండి యందఱు జనులచ్చటఁ దిరుగులాడుట కేమికారణమని యాశ్చర్యపొంది ఆచోటునుండి కదలి యాలయకుడ్యరంధ్రములనుండి చూచెను. వెలుపలఁ జుట్టుప్రక్కల గుడారములు వేయఁబడి యుండినవి; జనులు, అశ్వాదివాహనములను జెట్లకుఁగట్టి మేఁతవెట్టుచుండిరి. కొందఱు వంటవార్పులు గొనసాగించుచుండిరి. ఆయుధపాణులై కొంద ఱచ్చటచ్చట గుమికూడి వినోదగోష్ఠి సలుపుచుండిరి. ఇవన్నియు నితరరాష్ట్రాధిపతి యచట శిబిరమేర్పఱచి కొననుటకు నిదర్శనములు కాఁగాఁ దైలప యత్యాశ్చర్య మగ్నుఁడయ్యెను. వీరు, ఖొట్టిగునకు మిత్రులా, శత్రువులా? మిత్రులే యైన కొందము; వీరిచ్చట విడియుటకుఁ గారణముండదు. శత్రువులే యగుదురు. ఎవ్వరయిన నేమి? నేను వెలుపలకుఁబోయి కనుఁ

గొనెదను" అని సింహద్వారమునొద్ద నెవ్వరును లేని సమయముఁ గనిపెట్టి మెలఁపున వెడలి నిలిచెను.

ఆలయమంతయుఁ దొంటివలె లేక శుభ్రము చేయఁబడి యుండెను. అక్కడఁ బుంజీభవించియుండిన దుర్గంధమంతయును దొలఁగెను. అచట విడిసిన సేనల కధిపతి యాగుడిని దనకు నివాసము గావించికొనెనని శైలపయూహించి ధారాళముగలోపలఁ జొచ్చెను. అందు, అధిపతి యనఁదగిన మానవుఁడు వానికి గోచరింపఁ డయ్యెను. తత్క్షణమే శైలప యాచోటువిడిచి యాలయము వెలుపలకు వచ్చెను. అచ్చటఁ దిరుఁగుచుండిన దొంగలలోఁ దా నిదివఱకుఁ జూచియున్న వాఁ డెవ్వఁడును గాన రాకుండెను. వారితో సంభాషించి వింతసంగతు లరయఁగోరి శైలప యా మూకలోఁ దిరుగఁజొచ్చెను. వారిలోఁ బ్రతిమానవుఁడును దనకార్యముపైఁ జిత్తము చెల్లించియున్నందునఁ దైలప ప్రశ్నలకుఁ దిన్నఁగాఁ బదులు పలుకు వాఁడు దొరకఁడయ్యెను.

తన్నుఁ బల్కరించు వాఁ డచ్చట లేకపోవుటయే కాక, వారిని బలుకరించినను బదులుపలుకక దమపనులయందే మెలఁగుచుండుటను జూచి, "ఎప్పుడో యేక్షణమందో శత్రువులను మార్కొనవలసి వచ్చును గాన మున్నే యన్నపానముల పనిని దీర్చుకొనుట ప్రశస్తమని, తొందరగా వారు పాటుపడు చున్నారు" అని శైలప యూహించి, ఆచోటువిడిచి యుత్తరముగాఁ గొన్నియడుగులు నడిచెను. ఆ తరుణమం దొకపురుషుఁడు శైలప యున్నెడకుఁ జూటిగా వచ్చుచుండెను. శైలప వానిని జూడఁగానే యీ యలసున కిచ్చట నేమి పని ? అని తల పోయుచు నొఱనుండి కత్తిఁదూసికొని నిశ్చలుఁడై నిలిచెను.

పురుషుఁడు—"మిత్రుఁడా! ప్రకృతము నీ వీప్రాంతము లందే మెలఁగుచున్నావని తలఁచెదను"

"ఔను, ఇప్పుడు నేనీప్రాంతములందే మెలఁగుచున్నాను. కాని, నీవు మిత్రుఁ డని పిలుచునంతటి నైచ్యము నాకేర్పడక పోవును గాక !"

"హా, మిత్రుఁడా! నీభావము గ్రహించితిని; నీవనుకొను నంతటి పాతకుఁడను గాను; ఏదో యనిర్వాచ్యమయిన కారణ ముండి సజ్జనునకు దుర్జనునితోడను, దుర్జనునకు సజ్జనుని తోడను సాంగత్యము గలుగుచుండును. ఇంతేకాదు; సజ్జనుఁడు దుర్జనుఁడుగాను దుర్జనుఁడు సజ్జనుఁడుగాను గాన వచ్చుటయుఁ గలదు. అంతమాత్రమున సజ్జనదుర్జనులయందు విపరీత లక్షణము లేర్పడవు; ఏర్పడినవనుట కేవలము భ్రాంతి; రజ్జువు నందు సర్పభ్రాంతి కలుగుట లేదా? అది యటుండ నిమ్ము. మిత్రమా! ఇది నీకు క్షేమకరమగు ప్రదేశము కాదు; తొలఁగి పొమ్ము" అనుచునే యాపురుషుఁ డాచోటువిడిచెను.

"నీమాటలచేత, నీవొక సత్పురుషుఁడవని నమ్మెదనుపో! శుద్ధవీరుఁడనఁదగిన నేను దుచ్ఛపు బ్రతుకుఁగోరి మరలుటకు సమ్మతింతునా?" అని, తైలప వానితో నడిచెను.

"మిత్రుఁడా, వలదు: నాతోడరావలదు. ఇప్పుడే యిందుండి తరలిపొమ్ము. ఇది మృత్యునిలయమని నమ్ముము. నీకాపద ఘటిల్లినచో నాకే నీరక్షణము భారమగును. తొందరగా వెడలి పొమ్ము" అని యాపురుషుఁడు త్వరగా నడువఁజొచ్చెను. తైలప, ధైర్యసమగ్రుఁడై వానితో నడచుచు, "రామన్న! నీకాశంకవలదు.

ప్రాణికి జననమప్పుడే మరణము సిద్ధముగ నేర్పడినది. నేను మర
ణమునకు వెనుదీయను" అనెను.

రామన్న యులికిపడి, "హా, వీనికి నాపేరెట్లు తెలిసెను ?
ఇంకను నన్నుఁగూర్చి కొన్నియంశములు వీనికిఁ దెలిసియుండును.
అక్కటా, వీనిని బలుకరించి తెలిసికొందమనిన స్థలము సరియైన
నది గాదే!" అని తలపోసి, "మిత్రుఁడా ! నీ కీ వనమునుగూర్చి
యించుక తెలిసియుండునని యూహించెదను ; అటులుండియు
నీవు నామాటలు సందేహించునట్లు తోఁచెడిని" అని యచట
నిలిచి వానిమోమును తెప్పవాల్పక చూచెను.

తైలప మందహాసముఖుఁడై, "రామన్న ! రెండు కార
ణము లడ్డపడకుండినచో నీయందేర్పడిన నాసందియమున కంత
ముండదు" అని చెప్పుచున్నప్పుడే రామన్న తొందరపాటుతో,
"నెయ్యుఁడా, నీవు చెప్పినకారణము లెవ్వి ? చెప్పుము,
చెప్పుము" అని త్వరపెట్టెను.

"చెప్పుమనెదవా ? చెప్పుటకు వెనుదీయను ; వినుము.
నీవు, అమాయికలగు నబలల నేచు పాతకివి, నిన్నుఁ బూర్తిగ
వలచియున్న కళింగకన్యను వంచించిన దుర్జనుఁడవు".

"హా, మిత్రుఁడా! ప్రకృత మాయన్నులమిన్న యెక్కడ—"

"ఏల తొందరపడెదవు ? నా రెండవకారణమును
వినుము. నీమాటల ధోరణియు నీయంగమచ్చమును పూజ్యుఁ
డయిన వృద్ధునిఁ బోలుచున్నది. నిన్నువలచి కుందుచున్న కళింగ
కన్యను నీవు త్రికరణశుద్ధిగ వలచియుండినచో, పుత్రునిఁగూర్చి
పరితపించుచున్న వృద్ధుని తనయుఁడవు నీవే యైనచో సజ్జనుఁడ
వనుటకు హేతువు గలదు."

"హా, ప్రాణమిత్రమా ! యథార్థముగా నొకటి నాయిహలోకధనము ; మఱియొకటి నాపరలోకధనము. నీవంటి యుత్తముని యాశ్రయమున వారు సుఖముగ నున్నారని నమ్మెదను" అని యేమో చెప్పుటకుఁ బ్రయత్నించునప్పుడే గూడెమును జేరిన దొంగలలోఁ బదుగురు మెఱపుమెఱసిన విధమున తైలప మీఁదఁబడి వానిని బట్టుకొనిరి. రామన్న యేమిచెప్పుటకును దోఁచక దిగ్భ్రమతో నించుక తొలఁగి నిలిచెను.

తైలప, బుద్ధిప్రసన్నతగలిగి యొక్క తిమురుతిమిరి వారి పట్టువిదిర్చివైచుటతోడ ధారాశుద్ధిగ వారిని నఱికివైచెను. అంతలో, ఆయుధపాణులగు దొంగలు మఱికొందఱువచ్చి మూఁగిరి. తైలపకు వారితోడి పోరాట మధికమగుచు వచ్చెను. ఆతరుణమందే మల్లపదండులోని భటు లచట విడిసిన యోధవారముపైఁ బడఁగా నిరుప్రక్కల వారికిని సంకుల సమరము ప్రారంభించెను. అపుడు, కవచధారియగు రౌతొకఁడు, తనకెదురు పడిన ప్రతివీరులను గూల్చుచు, "కృతఘ్నుఁడా ! వెనుదీయకు ; ఇదె నీకు బాసటగా వచ్చుచున్నాను" అని దవ్వులనుండి కేకలిడుచు మల్లపదండును వీడి మహావేగమున వచ్చుచుండెను.

అట్టితరుణమందు సింహాబలుఁడు, (మాలవ్యాఁడు) ఏవంకనుండియో మెఱపుమెఱసినట్లు నిగిడి పిశాచమువలెఁ దైలప పైఁబడి వాని రెండుమనికట్లు గట్టిగఁ బట్టుకొనెను. యువకుఁడు వాని పట్టు విడిపించుకో లేక పోయెను. వాఁడు, కనుమూసి తెఱచునంతలో యువకునిఁ ద్రోసికొనిపోయి, దాపుననేయున్న ఱాతి కట్టడములోఁ ద్రోసి, వాడు లేచి వెలుపలకు వచ్చువంతలోఁ దలుపుమూసి గొండ్లెమిడెను. రామన్న యంతకుమున్నే యా

చోటువిడిచి వెళ్లియుండెను. మాలవ్యుఁ డచ్చట నెవ్వానిని గావలి యుంచక తాళము దెచ్చుటకై యాచోటు వాసెను. వానివెం టనే యటనున్న దొంగలును వెడలిపోయిరి. "కృతఘ్నుఁడా, కృతఘ్నుఁడా!" అని యఱచుచు నశ్వారోహకుఁడైన కవచ ధారి యాచోటుఁజేరి నలువలంకులు చూచెను. తైలప కానరాఁ డయ్యెను. "ఒకవేళ—తెగి వీరశయనమలంకరించెనా?" అని తలపోసి రణనిహతులను బరీక్షించెను. వారిలోఁ గృతఘ్నుఁడు గానరాఁ డయ్యెను. "హా, ఉన్నటులుండి యాదివ్యపురుషుఁ డెట దాఁగెను? ఎటు లంతర్హితుఁ డయ్యెను?" అని చుట్టుప్రక్కలఁ జూచెను, ఏదో మనస్సునకుఁ దోఁచఁగా ఱాతికట్టడముఁజేరి గొండ్లెముదీసి తలుపు దెఱచెను. తైలప యొక్కఁదాఁటున వెలు పలకు దుమికి మోమెత్తిచూచెను. వెంటనే యారౌతు తన్ను రక్షింపవచ్చిన వాఁ డని తెలిసి, వానితో మాటాడనుదలఁచిన తలంపునకు లజ్జించి మిన్నక నిలిచెను. కవచధారి వానిని జూచి, "కృతఘ్నుఁడా, నేను నీవిరోధినిగాను; నిన్ను దర్శించునిమిత్తమే యిటకు వచ్చితిని" అనెను.

ఆ మాటలకుఁ దైలప విషాదమొంది, "నేను వీనికెట్లు కృతఘ్నుఁడనైతిని? వీనికంఠధ్వని నాకుఁ బూర్వపరిచితమైనది. కాని వీనిని బోల్చుకొనలేను; ఎవఁడైననేమి? ఇప్పుడు వీఁడుపకరించె ననుటలో సందియము లేదు, కావున వీనికి నేనుగృతజ్ఞుఁడనే కాని కృతఘ్నుఁడ నెట్లగుదును?" అని తలపోయుచుఁ బరాకున నా తలుపుమూసి గొండ్లెమిడి, యీవలకువచ్చెను. అంతలోఁ గవచ ధారియుఁ దనగుఱ్ఱము మరల్చి మఱియొకమాటయైనను బలుకక బాణవేగమునఁబోయి మల్లపదళముఁ జేరెను.

ఆవేళ కపరాహ్ణము దలచూపియుండఁబట్టి, తైలపయు నాచోటువిడిచి హుటాహుటి నడిచి దేవాలయముఁ జేరెను. వాడు వచ్చినప్పటివలె నాలయము చేరినప్పుడు జనుల సందడి లేదు. ఒకరిద్ద ఱా వైపు మెలఁగుచుండినను తైలపను గుర్తింప లేదు. ఆ సన్న తెలిసి తైలప ద్వారపాలక ప్రమథుని పార్శ్వము నుండి లోనికిఁ బోయి చేరెను. ఇన్ని సంభవములు పదునైదు నిముసములలోనే ముగిసెను. సింహబలుఁడు గట్టి తాళములను దెచ్చి తాతికట్టడము తలుపునకుఁ దగిలించి, బీగము వేసి లాగి యుఁ జూచెను.

## ఇరువదియేడవ ప్రకరణము.

## వేఁగిమండలము

పదియవ శతాబ్ద్యంతమునందు, "ఆంధ్రరాజ్యమయిన వేఁగి యెట్టి దశయందుండెనో యిటఁ బరిశీలింపవలసినది ముఖ్యము. రెండవచాళుక్యభీమదేవుఁడు, వేఁగిరాజ్యమును బాలించుచుండి దివికేఁగెను. ఆతని కిద్దఱు కొడుకులుండిరి. వారిలో నమ్మరాజవిజయాదిత్యుఁడు సింహాసన మధిష్ఠించెను. ఆతని సోదరుఁడు దానార్ణవుఁడు తోఁబుట్టువునకుఁ గుడిభుజమై యొప్పుచుండెను. అట్టియెడ వేఁగి కుత్తరమందున్న కళింగ దేశముఁ గృష్ణరాజు పాలించుచుండెను. ఆతఁడు జైనుఁడు; నిత్యవర్షున కంతరంగ మిత్రుఁడు. కృష్ణరాజు, స్వమతమం దెక్కువ యభిమానముంచి వైదికమతమును ద్వేషించుచు వచ్చెను. నిత్యవర్షుని మతసమానమారాజునకు లేదని చెప్పవచ్చును. కాఁబట్టి,

వైదికమతమున కాశ్రయభూమియైన వేఁగిని ధ్వంసపఱిచిననే స్వమతము నిరోధములేక వ్యాపించునని యూహించి, సైన్యములను వెంటఁబెట్టుకొని దండయాత్ర వెడలెను. విజయాదిత్యునకును కృష్ణరాజునకును మండలము నుత్తరపుఁ బొలిమేరయొద్ద బోరు ఘోరముగా జరిగెను. ఉభయబలములందును భటులనేకులు దెగి కూలిరి. జయాపజయము లేవంకను జూపట్టవయ్యెను. రస్తుసామగ్రులకు లోపము గలుగుటచేత వచ్చినదారినిబట్టి వెడలిపోవునంతటి దుర్దశ కళింగున కలవడెను.

విజయాదిత్యునకుఁ గళింగునిపైఁ బొడమిన కోపమునకు మేర లేకుండెను. రాష్ట్రమునుజేరి, సుదృఢమైన గొప్పదండును సమకూర్చి, రణరంగమందు విరోధిని జంపుటయో, లేక చచ్చుటయో కర్తవ్యమని నిశ్చయించుకొనెను. తన సోదరుని దానార్ణవుని రాజ్యమునకుఁ బరిపాలకునిగా నియమించి, సకల సన్నాహములతో, యుద్ధసన్నద్ధుఁడై గుండెకు బల్లెమై మెఱయుచున్న దాయపై దండయాత్ర వెడలెను. కళింగుఁడును విజయాదిత్యుని ప్రయత్నములు దెలిసి, తనయుని రాజ్యమునకుఁ బట్టముకట్టి, ప్రచండసైన్యమును గూర్చికొని వెడలెను. ఉభయసైన్యములు గోదావరి నది కుత్తరపుదెస నొండొంటినిదాఁకి పోరఁజొచ్చెను. ఈ సంగ్రామ మెడవిడక యొకసంవత్సరముజరిగెను. విజయలక్ష్మి విజయాదిత్యునే వరించు నటులుండెను. క్రమక్రమముగఁ గళింగసైన్యములు దఱుఁగుచువచ్చుటతోడ నుత్సాహభంగ మప్పుడప్పు డొనగూడుచుండెను.

అట్టియెడ ఖొట్టిగుఁడు గొప్పసైన్య మొకదానిని సమకూర్చి, నాగమయ్యను దాని కధిపతిఁగావించి, వేఁగిమండ

లముమీఁదికి బంపెను. నాగమయ్య, తనసైన్యములను మూఁడుపాయలుగఁజీల్చి యొకభాగమును విజయాదిత్యుని మీఁదికిఁ బంపెను. ఆదండు, విజయాదిత్యుని దక్షిణపార్శ్వమున మోహరించి, వేఁగినుండి సైన్యములను రస్తుసామగ్రిని జేరనట్లుచేసి వైచెను. దానివలన జయశీలమైన కొద్దిపాటి దండుతో నుత్తర దక్షిణములఁ దన్ను మార్కొన్న కళింగ రాష్ట్రకూట సైన్యములను దాఁకి సుస్థిరుఁడై పోరవలసిన యావస్థ విజయాదిత్యునకుఁ దటస్థించెను. పరిస్థితులిట్లు మాఱుటచేత, విజయాదిత్యుఁడు ధైర్యసమగ్రుఁడై కొన్నాళ్లు పోరు సలిపి పగవారి యుద్ధతి కాఁగలేక యొకరేయి హతశేషులగు పరివారము వారితో రణభూమినుండి యెటకో పలాయితుఁ డయ్యెను.

నాగమయ్య, మఱియొక భాగమును వేఁగిమండలమునకు దక్షిణపు సరిహద్దుమీఁదికిఁ బంపి, శైవులై యొప్పుచున్న చోళుల సాహాయ్యము వేఁగిరాజ్యమున కలవడని విధమున నరికట్టెను. పిదప, శేషించియున్న సైన్యమును దీసికొని చూటిగాఁ బోయి వేఁగిరాష్ట్రమును మట్టడి వేసెను. ఇన్నివిధముల నరికట్టుటచేత దానార్ణవుఁ డేమిసేయుటకును దోఁచక తొట్రిల్లెను. పురరక్షణార్థముండిన యల్పసైన్యము శత్రువులను మార్కొని పోరుసలుపునట్టి స్థితియందుండ లేదు. రట్టపాడి రాయబారులు నిరాఘాటముగఁ బురముసొచ్చి, నగరుఁ జేరి, "నీవు జైనమత మవలంబించి, నీప్రజలలో జైనమతము వ్యాపింపఁజేసి, మారారాజునకుఁ గప్పముకట్టుచు సామంతుఁడవై యుండవలయును; దీనివలన నీరాజ్యమునకును బ్రజలకును నెమ్మది యొనఁగూడును. ఇట్టి యొడంబడికకు సమ్మతింతువేని నీయిద్దఱు కొడుకులను

దాకట్టుగఁ బంపుము; సమ్మతింపవేని నీరాజ్య మంతమొందును" అని పలువిధముల భయపెట్టుచు దానార్ణవుని మెఱుముఁ జొచ్చిరి. ఇట్టి యిక్కట్టునకుఁ జిక్కి దానార్ణవుఁ డేమి చేయఁగలఁడు? సంధికి లోఁబడినచోఁ దన ప్రజల యాగ్రహమునకుఁ బాల్పడి యవయుట యటుండఁగా, మహాధ్వరకర్తలను శౌర్యధనులను వహించిన సత్యాశ్రయవంశమునకుఁ గలంక మొనగూర్చిన వాఁ డగును; సంధికి లోఁబడని యెడలఁ దన మనుగడ యటు లుండఁగా, ప్రజలతోడ దేశమునకు వినాశము గలుగును. ఇట్టు లిరుప్రక్కల మండుచున్న కొఱవిలోని పురువువలె నేమార్గము వినాశోన్ముఖమై చూపట్టఁగా, దానార్ణవుఁ డారాయబారుల కేమియు బదులు పలుకక మిన్నకుండెను.

రాయబారు లొకటి రెండుదినములు, దానార్ణవుని ప్రత్యుత్తరమునుగూర్చి వేచియుండిరి; ఇంచుకంతయు రక్తపాతములేక రాష్ట్రము చేతఁ బడునట్టి స్థితియందుండెను. నాగమయ్యయనుజ్ఞచే భటులు ధారాళముగఁ బురములోఁ బ్రవేశించి, విచ్చుకత్తులతో, నగరము వాడ వాడలను సందుగొందులను దిరుగఁజొచ్చిరి. వారి నాటంకపెట్టు పౌరుఁ డొక్కఁడును లేఁడు; పౌరుల గుండెలు భయవిహ్వాలతచేత నవయఁజొచ్చెను. తమ్మెదిరించు భటులు లేమిచే, వారు నగరములోని గోపురములను దేవాలయముల నున్నతహర్మ్యములఁ బడఁద్రోయఁజొచ్చిరి. వారు, దేవాలయములఁ బడఁగొట్టుటకు మతద్వేష మొక్కటియే కారణము గాదు. ఇంతకుమున్ను వేఁగిని పరిపాలించిన చాళుక్యార్జున విజయాదిత్యుఁడు తన్ను నూటయెనిమిది తడవలు మాఱొక్కన్న రాష్ట్రకూటరాజును బోరున జయించి పాఱఁదటి

మెను. ప్రతివిజయమునకు స్మారకచిహ్నముగా నొకశివాలయము వినిర్మించుచు వచ్చెను. యాలయము లున్నత గోపురములతోను గనకకలశములతో నొప్పుచుండినవి. అవి రాష్ట్రకూటరాజుల యపయశ ముగ్గడించు నిర్మాణములగుటచేత, వాప పూనికతోఁ బడఁద్రోసి మఱియు, కోటబురుజుల నాక్రమించికొనిరి. రాష్ట్రములోని కోశములన్నియుఁ వారి పాలయినవి.

అక్కటా, వారిదౌష్ట్యమింతటితోఁదనివిసెంద దయ్యెను; తోడిబాసలకుఁ దలమానిక మనిపించుకొని, పెక్కు యుగముల నుండి ప్రశస్తికెక్కియున్న యాంధ్రభాషకుఁ దలవంపు లోనఁ గూర్చిరి. ఆంధ్రజాతీయతకుఁ బ్రాణమై, మేధానిధుల విజ్ఞానసంపదకు స్వర్ణపేటికలై, చిరకాలాగతములై విలసిల్లుచుండిన తాళపత్రసంపుటములతో నిండారి యొప్పుచుండిన సరస్వతీభాండాగారములను రెంటిని బరశురామ ప్రీతిఁ గావించిరి. ఒక్కొక్క యింటను జొచ్చి, గ్రంథములను లాగి దెచ్చి యందుఁ బడవైచి యాయగ్నిని బ్రవృద్ధము గావించిరి. విబుధుల చిరపరిశ్రమముచే బహుకాలములనుండి మెనక మెనఁగుచు వచ్చుచుండిన, సకల కళలకాస్పదమయిన యాంధ్రవాఙ్మయమున కొక్కపెట్టున విలయ మెన గూడెను.

రట్టపాడిభటులు యజ్ఞశాలల నన్నిఁటిని గర్బ్రహ్మమైన యగ్నిభగవానునకే యాహుతి సేయఁ దలకొనిరి. సోమయాజులను లాగిదెచ్చి, వారి చెవితమ్మెలు తెగునట్లు కుండలముల నూడఁబెరికిరి. పగిలి కూలియున్న దేవాలయములయొద్ద వర్హాతులు నిలిచి వైదికమతమందలి లోపములను వర్ణించి చెప్పుచు, జైనతీర్థంకరుల చరిత్రముల నుగ్గడించి యుపన్యసించిరి.

ఇవ్విధమున విరోధులకుఁ జిక్కి, శోభదక్కి పురము పొగయుచుండఁగా, పౌరులడెందములలో భయానకరసము మూర్తీభవించి చిందులుద్రొక్కుచుండఁగా, పాపము! దానార్ణవుఁ డేమిసేయును? అట్టి యిక్కట్టున నతని కొడుకులు గానరారైరి. వారు, శత్రువుల కోపాగ్నికి శలభాయమానులైరో, ఏమయిరో యెవ్వరికిని దెలియదు. ఆపద లొకటి వెంబడి నొకటిగాఁ బిడుగులు రాలునట్లు పైఁబడుచుండఁగా దానార్ణవునకు బ్రతుకుపై రోఁతపుట్టెను. మరణముకంటె నానందప్రదమయినది యతనికి వేఱొండు గన్పట్ట లేదు.

భానుఁ డపరవారాశి మునుక లిడుచుండెను. అట్టితఱి నాదిక్కంతయు రక్తిమనువహించి, భావికాలమున రట్టపాడియు వహ్నిజ్వాలలకులోనై యిట్టికాంతిని వహింపఁ గలదనుటను సూచించుచుండెను. దానార్ణవుఁడు హర్మ్యోపరిభాగముఁజేరి చూపుమేర దూరము నలువలంకుల దృష్టిసారించెను. ఏవైపునఁ జూచినను మిన్నువంకకుఁ బొగ లెగయుచునే యుండెను. వజ్రాయుధప్రహారమునకుఁ బర్వతరాజమువలె నా ఘోరదర్శనమున కతనిగుండెలు బ్రద్దలైనవి. "హా, పరాక్రమాతిశయమునకు జన్మభూమియైన యాంధ్ర విష్ణువర్ధనవంశమున కెట్టియెడరు సంప్రాప్తమయినది? ఎట్టి దుర్దశ యొనఁగూడినది? ఘోరకృత్యములకు వెనుదీయని కుత్సితులు, వసించుట కనువైన యీకుతలమందు నే నింకను బ్రతికియుండ లేను. ఓకాలుఁడా! నన్నుఁ దుదముట్టింపవేమి? అని బిగ్గఱగా నఱచి పలికెను. అప్పుడు, సంజకెంజాయదొలఁగి యాచోటఁ జీఁకటులు వ్యాపింపఁ జొచ్చెను.

ఒక దృఢకాయుఁడైన పురుషుఁడు! ఆయుధపాణియగు యోధుఁడు! వాఁడెటు లటకు వచ్చెనో చింతావిలుఁడైన దానార్ణవునకుఁ దెలియదు. వాని శరీరచ్ఛాయ నలుపు; వాఁడు ధరించియున్న దుస్తులును నలుపు; వాఁడు, దానార్ణవునిచేతిని బట్టుకొని, "రాజా, మంచి సమయమందే నన్నుస్మరించితివి; కాఁబట్టి నీచావు దప్పినది. నిన్నుఁ జంపఁగోరిన పగవారు నుశియుటయుఁ దటస్థించును" అని మెల్లఁగాను స్పష్టముగాను బలికెను.

దానార్ణవుఁడు, వాని పట్టునుండి చేతిని విడిపించు కొనలేక తిన్నఁగ మోమెత్తి వానిని జూచెను. తాను వానిని మున్నెన్నఁడును జూచియుండలేదు. అత్యాశ్చర్యముతో, "స్వామీ! నీవు కాలుఁడవా? నన్ను రక్షింపఁదలఁచి విచ్చేసితివా?" అని భక్తిపురస్సరముగఁ బలికెను.

"ఔను, నేనొకవిధమున కాలుఁడనే! భూలోకకాలుఁడనుకొనుము; నిన్నును నీమండలమును రక్షింపఁ దలఁచియిటకు వచ్చితిని".

"స్వామీ, అటులయిన కర్తవ్యమేమో తెలిపి పుణ్యముగట్టుకొందురా?"

"కర్తవ్యమా? నీవింతకు ముందు తలఁచియున్న దానికంటె ఘోరమైనది కాదు. కొంతకాలము నీవెవరి కంటను బడక నాయధీనమందే మెలఁగు చుండవలయును. ఈ రాజ్యము, తొంటి విధమున నీ పేరనే పరిపాలింపఁ బడుచుండును. నీపగవారు తమయంత నాశమొందుదురు" అని యాభూలోకాంతకుఁడు దానార్ణవునిఁ బిలుచుకొని కాఱుచీఁకటులలోఁ బడిపోవుచుఁ బురబాహ్యప్రదేశముఁ జేరునప్పుడు, రెండుగుఱ్ఱములు కట్టిన

కంచరమొకటి సిద్ధముగ నుండెను. వారు, దాని నెక్కి కూర్చుం డఁగానే శకటచోదకుఁడు వేగముగాఁ దోలెను. అట్టియెడ, అచ్చట వృక్షవాటికలోఁ దిరుగుచుండిన రౌతొకఁడు కంచరము వెంబడినే పోవఁదొడఁగెను.

నాఁటి నడురేయి నాగమయ్యాశిబిరమం దగ్నిభగవా నుఁడు చొచ్చి జ్వాలామాలియై ప్రజ్వరిల్లెను. పురములోఁ బ్రమత్తులై నిరాఘాటముగ మెలఁగుచుండిన జైనభటులపైఁ గాలుని భటులు పడి నిర్దయులై నఱికి కూల్చిరి. ఇంచుమించుగ నా వేళకే వేఁగిమండలము నుత్తరదక్షిణ సీమలందు విడిసియున్న రాష్ట్రకూట స్కంధావారము లగ్నిదేవున కర్పితములైనవి. దానివలన నచట మైమఱచి కూర్కుచుండిన భటులు గొందఱు హతులయిరి. వారి వస్తుసామగ్రియు బూదిఁగలిసెను. ఇట్లు నిరీక్షించుటకుఁగాని గొప్ప యాపదకుఁ జిక్కి, నాగమయ్యా హతశేషులను వెంటఁబెట్టుకొని పయనమయి కొన్నాళ్లకు మాన్యఖేటముఁ జేరెను.

మఱునాఁడు మొదలుచేసి వేఁగిరాజ్యమందు నెమ్మది తల చూపఁ దొడఁగెను. రాజున్నప్పటివలెనే రాజ్యతంత్రము కొన సాగుచువచ్చెను. రాజశాసనములు, దానశాసనములు, శ్రీము ఖములు, మనవులమీఁది తీర్మానములు మున్నుగునవి రాజు సంత కముతో వెలువడుచుండినవి. రాజసందర్శనము మాత్రము ప్రజలకుఁ గఱవయ్యెను. ప్రజలలో నెట్టికొఱఁతయు నతృప్తియుఁ దలచూపవయ్యెను. పరమండలముల రాజు లడుగిడ ననువుగాని విధమున దేశము రక్షింపఁ బడుచుండినను, దారిద్ర్యము విద్యా విహీనత నానాటికిఁ బెచ్చుపెరుఁగుచుండెను.

# ఇరువదియొనిమిదవ ప్రకరణము.

## చాళుక్య చంద్రుఁడు

వ్యాఘ్రేశారణ్యమందుఁ దనపనులకు భంగమొనగూడు సూచనలు గానరాఁగా నాయకుఁడు కొన్నాళ్లవఱకు కాచోటుఁ బాసియుండె నని చెప్పితిమి. అతఁడు దానార్ణవునిఁగూర్చియే తల పోయుచుండెను. మెఱపుమెఱసినటులొక తలంపతనిమదికి స్ఫురింపఁగా, జాగ్రత్తతోఁ దన యునికిపట్టును గనిపెట్టియుండఁ గొంద అను నియమించి చూటిగాఁబయనమయి వేఁగిరాష్ట్రముఁ జేరెను. అచ్చటఁ దాను సందేహించిన చోటులందెల్ల దానార్ణవుని వెద కెను. అచట నియమించియుండిన యుద్యోగస్థుల నందఱను దానార్ణవుని గుఱించి యడిగెను. ఎన్నివిధములఁ బ్రయత్నించి యును బ్రయోజనము కన్పట్టదయ్యెను. తుదకతనికొక యూహ పొడమెను. "సరి, దానార్ణవుఁడు వృద్ధుఁడు; అతఁడు లేఁడను కొందము. అతనిచేఁ జేయించుపని కతని కొడుకు తగియుండఁడా?" అని యనుకొని, "చాళుక్యచంద్రుని జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. వాఁ డెచటనున్నాఁడో? వానియునికి యెవ్వరికిని దెలియదు; ఇఁకఁ గర్తవ్యమేమి? ఆంధ్రరాజవంశాంకురమైన విమలాదిత్యుని వేఁగికి రాజుఁజేసి, చాళుక్యరాజ్య సంస్థాపనమును, దన్మూలమున వైదికమతోద్ధారణమును గావింపవలయునని నిశ్చయించుకొనెను. ఈపనులు నిర్వహింపఁబడునేని, తన ద్వితీయోద్దేశమైన జైనమతోన్మూలనము దనయంతఁ గొనసాగునని తలఁచెను. ఇపుడు విమలాదిత్యుఁ డెచట నున్నాఁడు? ఎటులున్నాఁడు?

నాఁడు వేఁగిరాష్ట్రము, రాష్ట్రకూటులదాడికిఁ జిక్కి సొంపఱియున్నప్పుడు ఖొట్టిగుని రాయబారులు, 'నీకొడుకులను దాకట్టుంచు'మని దానార్ణవుని నిర్బంధించుచున్న సమయమునఁ జాళుక్యచంద్రుఁడును విమలాదిత్యుఁడును బలాయితులైరని చెప్పి యుంటిమి గదా! వారు మాఱువేసములూని గుఱ్ఱములెక్కి పురబాహ్యప్రదేశముఁ జేరిరి. తమకు మంచికాలము వచ్చుపర్యంత మేదేశమున వసింపవచ్చునని యాలోచించి, తమయజ్ఞాతవాసమునకుఁ జోళమండలము దగియుండునని నిశ్చయించుకొనిరి. కాని, అట్టిచర్య యనుచితమని చాళుక్యచంద్రునకుఁ దోఁచెను. తండ్రిని దుర్దశలపాలుచేసి, ప్రాణభీతిచే దేశత్యాగియగుట యనుచితమని యతఁడు తలఁచెను; తన తమ్మునిఁ బండ్రెండు పదుమూఁడేండ్ల బాలుని నొంటరిగాఁ బరదేశములకుఁబంపుటయు హేయమని భావించెను. ఇవ్విధముగాఁ దొట్రిలుచుండి తుదకప్పటి పరిస్థితులను దలఁచి, విమలాదిత్యునిఁ జోళమండలమునకుఁ బంపివేసెను. పిదపఁ గర్తవ్యము దోఁచక, మఱునాటి రేయివఱ కచ్చటనే మసలుచుండి, నల్లని యుడుపులు దాల్చిన పురుషునితో నొకఁడు త్రొందరగా నడిచివచ్చి యటనున్న కంచరము నెక్కుటనుజూచి, పురుషునితోవచ్చిన వాఁడు తన తండ్రియే యని సందేహించి, బండిని వెంబడించెను. చాళుక్యచంద్రుని గుఱ్ఱము మిక్కుటముగ నలసినందునఁ గంచరముఁ గూడముట్టలేక వెనుకపడెను. అటులుండియు నతఁడు చక్రముల గుఱుతుపట్టిపోవుచు నెల్లిట్లో కాలుఁడుచేరిన రెండు దినములకు వ్యాఘ్రశాటవిఁజొచ్చెను. తన జనకుని బిలుచుకొని పోయినవాఁడు దొంగల ఱేఁడేయని యూహించి యతఁడు

వాని నాశ్రయించెను. నాయకుఁడు తొలుదొల్తఁ జాళుక్య చంద్రు ననేకవిధములఁ బరీక్షించి "సత్యసంధుఁడు, శౌర్యనిధి" అని గుర్తెఱిఁగి రాయబారిగఁ జేసికొనెను. ఇట్టియెడ రామన్నయే చాళుక్యచంద్రుఁడని మేము పాఠకులను మందలింపవలసిన యవసరము గన్పట్టదు. అతఁడు పెక్కునిదర్శనముల చేత దనతండ్రి యతనియొద్ద నున్నాఁడని గుర్తెఱిఁగెను.

జాతికోటలో నేకాంతమున్న దానార్ణవునకు నాయకుఁ డట్టివాఁడని తెలియదు; ఆతని యభిమతము లిట్టివనియుఁ దెలియదు. ఆతఁడు, నాయకుఁడు దెచ్చు పత్రములమీఁద సంతకము లిడుటతప్ప నన్యమెఱుఁగఁడు. అట్టి సమయములందు దానార్ణవుఁ డతనితోఁ బలుకుట లేదు; పలుకరించినను, అతఁడు బదులు పలుకఁడు. కావున, నాయకుఁడు సజ్జనుఁడనియు నేదో పరమార్థముఁగోరి యట్లు మెలఁగుచున్నాఁడనియు దానార్ణవుఁడు దెలియఁ గలిగెను. ఆతఁడు, తన కన్నపానములు దెచ్చిపెట్టు పరిచారకులు నాయకునిఁగూర్చి యాడికొను మాటలనుబట్టి, అతఁడు తీక్ష్ణశాసనుఁడనియును నజేయుఁడైన ప్రతిభాశాలియనియు నూహించెను. ఇంతకంటె మిక్కుటముగఁ దెలిసికొనుట కతని కచ్చట వీలులేదు. దానార్ణవుఁడు తైలపయొద్ద సురక్షితస్థలమునం దున్నప్పటికిని నాయకుని నెడఁబాసినందులకుఁ జింతిల్లుచునే యుండెను. ఇఁక విమలాదిత్యునిఁగూర్చి యించుక పరిశీలింతము.

విమలాదిత్యుఁ డన్న నెడఁబాసి దక్షిణాభిముఖుఁడై పయనముచేసి కొన్నాళ్లలో మధురాంతకముఁ జేరెను. ఈచరిత్రకాలమందు దక్షిణాపథమునందలి రాజులలోఁ జోళులు మహా

న్నతదశ నలరారుచుండిరి. పురాంతకోపమానుఁడయిన పరాంతక చోళుఁడు దివంగతుఁడుకాఁగా నతని తనయుఁ డాదిత్యచోళుఁడు మధ్యందినగత గ్రీష్మాదిత్యునిమాడ్కిఁ బ్రతాపజ్వాలల దశదిశలఁ గ్రమ్ముచుఁ దేజరిల్లెను. ఆతఁడు బాల్యమందే, సింహకిశోరము మదోత్కటమాతంగమునువలె వీరపాండ్యుని జయించి విజయ లక్ష్మిఁగాంచెను. ఆదిత్యచోళుని పితృవ్యపుత్రుఁడు మధురాంతకుఁడు తన యన్నకుఁ గుడిభుజమై కావేరీనది కుత్తరమునందుఁ దనపేరఁ బురము వినిర్మించుకొని, పరమండలేశులు చోళమండలమునం దడుగిడనివడువునఁ జేయుచుండెను.

ఆదిత్యచోళుని పుత్రుఁడు రాజరాజు; అతఁడు పినతండ్రి యొద్దనే పెరుఁగుచు యుద్ధవిక్రీడలకు సుశిక్షితుఁ డగుచుండెను. విమలాదిత్యుఁడు మధురాంతకముఁ జేరి రాజాశ్రయము సంపాదించి, రాజరాజుతో నాయుధవిద్యనభ్యసించుచు వచ్చెను. ఇరుగుపొరుగు రాజులతో సంగ్రామమేర్పడు సమయమున మధురాంతకుఁ డీకుమారవీరులను, సేనాధిపత్యమొసఁగి పంపుచుండును. వారును రణరంగములందు సామర్థ్యము వెలయించి చోళసామ్రాజ్యమునకు విజయము లొనఁగూర్చుచుండిరి.

నాయకుఁడు వేఁగినగరమువిడిచి మధురాంతక మేఁగినపుడు, రాజరాజ విమలాదిత్యులు ప్రచండసైన్యమున కధినాథులై రట్టపాడి విషయముమీఁదికి దండయాత్ర వెడల సంసిద్ధులై యుండిరి. నాయకుఁడు, తాను శ్రీహర్షుని రాయబారినని యుక్తసమయమునందే మధురాంతకు నాస్థానముఁ జేరెను. సేనానులు, సామంతులు, పలుదేశముల రాయబారులు, రాజసభను నిండుకొని యుండిరి. యువరాజయిన రాజరాజును

విమలాదిత్యుఁడు నాసభయందే పొలుపారుచుండిరి. నాయకుఁ డేకాంతగోష్ఠి సలుపవలయునని మధురాంతకునిఁ గోరెను. అతఁ డందులకు సమ్మతించి, నాయకునితో సంభాషించి, అతని రాయబార మంగీకరించెను. పిదప, నాయకుఁడు విమలాదిత్యుఁ డున్నెడకుఁ బోయి యతనితో నొకటి రెండు మాటలు చెప్పి యందుండి వెడలి వేఁగిని జేరెను. అచ్చట, కొన్ని యేర్పాటులుచేసి యందుండి తరలి తిన్నఁగా వ్యాఘ్రశారణ్యము దారిపట్టెను.

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

## వ్యాఘ్రయుద్ధము

ఇమ్ముదప్పినవేళ నాపదలొక్కుమ్మడి మానవునిఁ బొదివి హింసించుట లోకమున సర్వసాధారణము. ఇప్పు డట్టిస్థితికే నిత్యవర్షుఁడు గుఱియయ్యెను. శత్రువులు ద్రేకించి నాలుగు ప్రక్కల దాడివెట్టఁ బ్రారంభించిరి. దేశమం దంతశ్ఛిద్రములును మెండుకొన్నవి. ఏకకాలమునఁ బొడసూపిన యిక్కట్టులను బోకార్చి తన్నును దనరాజ్యమును రక్షించుకొనుట యతనికి భారమయ్యెను. తన యుపాయములన్నియు వ్యర్థములయి దండోపాయముననే తెగువచేయవలసివచ్చెను.

రట్టపాడివిషయము దక్షిణపుఁ బొలిమేరనున్న గంగవాడి సామంతుఁడు తొల్లి, నొళంబవాడి రాజును జయించి నొళంబకులాంతకుఁడన్న బిరుదమును ఖొట్టిగునివలన బొందియుండెను. ఇపుడు నొళంబేశుఁడయిన 'పెరుమానడి' కసిదీర్చుకొన యత్నించి సేనలను సమకూర్చుకొని యున్నటులుండి గంగవాడి సామంతునిఁ దాఁకెను. అట్టి యిక్కట్టుననే రాజరాజు గొప్ప

సైన్యముతో వచ్చి దక్షిణపు వైపున గంగవాడిరాజును దాఁకెను. పాపమా సామంతుఁడు దన్నిరుప్రక్కలఁ బొదివిన సైన్యవారాను లలో నీఁదలేక తల్లడిల్లుచుండెను. చోళులు గంగవాడిని హతము చేసి నొళంబుని సేనలను గలిపికొని రట్టపాడినిఁజొచ్చి పెక్కు దౌష్ట్యములు నెఱప సంసిద్ధులై యుండిరి. ఖొట్టిగుఁడు, సమయ స్ఫూర్తితో నా వాహినులను మట్టుపెట్టు నిమిత్తము కర్క లునిఁబంపెను. కర్కలుఁడు, తన కుమారు నకాలవర్షుని సేనాని నాగమయ్యను బార్శ్వరక్షకులుగాఁ జేసికొని గొప్ప దండుతో దండయాత్ర వెడలెను. ఆసమయమందే జయశీలమైన యాంధ్ర సైన్యమున కధిపతియై విమలాదిత్యుఁడు, వేఁగిరాష్ట్రమునుండి వెడలి పడమరగా రట్టపాడిఁజొచ్చి గ్రామములను జనపదములను గాల్చివైచుచు మాన్యఖేటమును గూర్చి వచ్చుచుండెను. వీరా వేశపరవశులై పోరు నాంధ్రయోధలను మార్కొనఁ దగిన దిట్ట నాగమయ్య. అతఁడు దక్షిణ దండయాత్ర వెడలెను. కావున, విమలాదిత్యుని దాఁక ఖొట్టిగుఁడు మల్లపను బంపెను.

మాన్యఖేటము నుత్తరపుఁబొలిమేరనున్న యడవినుండి మల్లప శిబిరము లేవఁగానే యదివఱకా యరణ్యమున దాఁగి యున్న శ్రీహర్షుని భటులు విజృంభించి నగరములోఁజొచ్చి కోట లగ్గలుపట్టుటకే యుంకించిరి. చక్రవర్తి, సైనికులతో వెడలి వారిని ద్రెంచికూల్చుచు వ్యాఘ్రశారణ్యము దాఁటికట్టడము వఱకుఁ దరుముకొనిపోయెను. అతఁడా యడవి చేరఁగానే పగ వానిబలములోఁ గూలినవారు పోఁగా మిగిలిన వారు గానరా రైరి. సూర్యుఁ డస్తమించి చీఁకటులు గ్రమ్మఁజొచ్చెను. ఖొట్టిగుఁ డింకను గరవాల మొఱలోఁ జొనుపలేదు; భటు లేలిక యానతి

నిరీక్షించుచునే యుండిరి. కొందఱు కరవాలములు కోశము లలోఁదూర్చిరి; కొందఱు కాగడాలు వెలిఁగించిరి; కొందఱు విచ్చుకత్తులతోనే మసలుచుండిరి.

అట్టియెడ ఖొట్టిగుఁడు, "ఓరిపందా! ఇట్టి క్షుద్రోపద్రవముల కోడిగట్టి, మార్కొన్నచో నిలువలేక పరుగిడుట యెట్టి శూరధర్మము? హర్షుఁడా! ఇఁక నిన్నుఁ బ్రాణములతో విడుచుట లేదు. నేఁడో రేఁపో కొంకణ ఘూర్జరసైన్యము లిటకు రాఁగ లవు; వెంటనే ధారానగరముపై విడిసి నిన్నుఁజంపి మాల్వమును ముంటఁగలిపెదను. నీపరమార వంశమును నిర్మూలించెదను. దానికి నిదర్శనముగా నీతుచ్ఛసైన్యము తలదాఁగియున్న యీయటవి నిప్పుడు కాల్చివైచెద" నని తలపోయుచుండెను.

ఖొట్టిగుఁ డివ్విధమున నాలోచించుచుండు నప్పుడే నాయకుఁడు గూడెముఁ జేరెను; అతఁడు, తాను లేనప్పుడు జరిగిన సంగతులు రామన్నయు మాలవ్యుఁడును జెప్పఁగా విని, మిగుల సంతసిల్లి, తనపనికి ననుకూలించు సూచనలే యివి యని లోలోన ననుకొనెను. పిమ్మట, మాలవ్యునితో నేకాంతగోష్ఠి సలుపుచు, యువకుని ఖాలికట్టడమందుఁ జెఱయుంచుటను దెలిసి, పోయిన ప్రాణములు వచ్చినట్లు తనివి నెందెను. యువకుఁడు చేతికిఁ జిక్కుట దానార్ణవుఁడు దొరికినటులే తోఁచఁగా, నాయకుఁడు వెంటనే మాలవ్యునిఁ బిలుచుకొని యటకుఁ బోయెను. రామన్నయు వారివెంబడినే వెళ్లెను.

అప్పుడు, ఖొట్టిగుఁడు కొందఱ నచ్చట గాఁపుంచి నగరు చేరి యుండెను. పగవాఁడెవ్వఁడును గానరాకపోఁగా భటులు పరాకుచెంది యుండిరి. నాయకునితో వచ్చిన మాలవ్యుఁడు

ఊఱికట్టడము తాళము దీసి తలుపు దెఱచెను. లోపలఁ జెఱ యుంచిన యువకుఁడు లేఁడు. "వేసినతాళము వేసినటులే యుండఁగా వాఁడెట్లు మాయమయ్యెను" అని శంకించి లోఁదలుపు దెఱచెను. ఆశ్చర్యము! బెబ్బులి! బాణవేగమున వెలుపలకు నొకగంతునఁ బ్రాఁకి, ఆ పరిసరములయం దాయుధపాణులై యున్న భటులను జూచి బెదరినది ; దీపపువెల్తురు దాని క్షుద్బాధకుఁదోడై దిగులును బెంచినది. ఎటుపోవుటకును దోఁచక కొంతవఱకుఁ దొట్రిలుచుండి, తుదకుఁ దూఁగిపడుచున్న భటునొకని కుత్తుకఁబట్టి గుటగుట నెత్తురుగ్రోలెను. ఆసందడికి జుట్టుప్రక్కల వా రులికిపడి, "పులిపులి" యని యఱచుచు బల్లెములతో దానిఁ బొడువ సంసిద్ధులైరి. వారి కనుబ్రామి తొలఁగి పోవుట యాప్రాణి కశక్యమయ్యెను. నరమాంసము రుచిగన్న యాబెబ్బులి, ఆఁకట నకనకలాడుచుండి యెరఁబట్టియున్నందునఁ గోపఘూర్ణితమై వారిమీఁదికిఁ జెంగలించినది. అట్టియెడ నోట నుండి యెరజారుటయు నెఱుఁగ దయ్యెను.

"బెబ్బులి! బెబ్బులి! పొడువుఁడు! నఱుకుఁడు! అను కేకలు వారిలోఁ బెల్లుమీఱెను. కొందఱు భయాతిరేకమునఁ బరిసరములకుఁ బాఱిరి. "ఇదిగో పులి! అదిగో పులి!" అని యఱచుచు బయలుపొడుచుచు విజృంభించిరి. దాదాపుగా నైదువందలభటు లా యిమ్ముదప్పిన వేళ నొకపులిని బొరిగొనుట యశక్యమయ్యెను. ఆ మూఁకలో నెచ్చటను పులి చెంగలించుచుండుటచే వారి భ్రమ యినుమడించెను. తెఱపిలేక పులి పులి యను నఱపులు పిక్కటిల్లెను. చిమ్మచీఁకటుల కిమ్మయిన యానడికి రేయి నచ్చటచ్చటఁ గాగడాలు మండుచుండఁగా రక్త

పానమత్తతచే నాబెబ్బులి, దిగులునకుఁ దోడు నిదురమబ్బుగు చుండఁ దబ్బిబ్బులొందుచున్న వారిమూఁకలోఁ జెలరేఁగి మీఁది కుఱుకుచుఁ గొఱుకుచు అర్కు–చు విజృంభించెను. అది యొక నిమిషపుఁ బడునపుడు ప్రక్కనున్న వాని బల్లెము పోటు దప్పినది గాదు. అట్టిసమయములం దది సేయు భీకరధ్వానములు వారి గుండె లవియింపఁ జొచ్చెను. అసహాయశూరుఁడై పద్మవ్యూహ ముఁజొచ్చి బలములఁద్రెంచి కూల్చి, రథికు లనేకు లొక్కుమ్మడి పైఁబడిపోరఁగా నందఱ కన్నివిధముల నాయోధనమొసఁగి రణ రంగమునఁబడిన యభిమన్యు కుమారునివలె నావ్యాఘ్రము జీవ ములున్నంతవఱకుఁ బోరుసలిపి వీరశయన మలంకరించెను.

పులి తెగి కూలినను, హతశేషులలో భ్రమ వ్యాఘ్ర రూప మున మూర్తీభవించి తమపైఁ జెంగలించునటులే తోఁచెను. ఎదుటనున్నవాఁడే పులియై తన్నుఁ బొరిగొనునటులుండెను. హా! ఏమిభ్రాంతి! పులి పులి యని కేకలిడుచు నొండొరులు పొడు చుకొనఁ దొడఁగిరి; కొంతదవ్వులకుఁ బాఱిన వారే యాప్రళ యమునకుఁ దప్పి కొన్నినిముసములకుఁ బిమ్మట నొకరివెంబడి నొకరుగా నటకు వచ్చిచేరిరి. ఆ పులిని జూడఁగానే వారిలోఁ గొందఱకు భక్తిరసముప్పొంగి, "ఓరియన్న! ఇది పులికాదు; దీనితత్త్వము గుర్తెఱుఁగక చంపఁబోయి యెందఱు మడిసిరిరా?" అనిరి.

"ఔను, మనము దానిజోలికిఁ బోకుంటిమి; కావుననే బ్రతికియున్నాము. ఎందఱనైన నీభూమి భరించునుగాని శివ భక్తి రహితులను భరింపదు. నాఁడు, శివుఁడు విశ్వేశ్వరభట్టు రూపమున ప్రత్యక్షమయి మనయేలికకు తనమహిమఁ దెలిపి

తిరోహితుఁడయ్యెను. మన యేలికమూర్ఖుఁడు; వినరందున నేఁడీ వ్యాఘ్రరూపమునవచ్చి చీల్చి చెండాడెను" అని మఱికొందఱఁ డనెను. ఆ మాటలువిన్న యింకఁ గొందఱు భక్తి పెంపున "జయ జయవ్యాఘ్రేశా!" యని కేకలిడిరి.

అందున్న మఱి కొందఱుజైనభటులకు వారిచర్య యపహాస్యమయ్యెను. "ఓరి వెఱ్ఱులార! ఈపులిదేవుఁడయినఁ జచ్చి కూలునా? నోరుమూయుఁ"డనిరి; ఆ మాటలు మతాభిమానుల యిన వైదికులకుఁ గోపము పెంచఁగాఁ గలహము ముదిరి, యొకరినొకరు పొడిచికొను దుస్థితికిఁ బాల్పడిరి.

తుదివఱ కోపికతోఁ గొంతదవ్వుల నిలిచిచూచుచుండిన నాయకాదుల కందలి భటులయిక్కట్టు, అచ్చెరువొనగూర్చెను. నాయకుఁ డత్యాశ్చర్యముతో, "రామన్నా! ఇట్టి సంభవము నేనెప్పుడును జూచియుండలేదు. మనమొకటి తలఁచి చేసిన మఱి యొకవిధమున నాపని పరిణమించుచున్నది. మనపౌరుషము గాల్పనా?" అనుచు మాలవ్యుని రామన్నను బిలుచుకొని యందుండి వెడలిపోయెను.

## ముప్పదియవ ప్రకరణము.

### వనదహనయత్నము

మాన్యఖేటనగరమునఁ దొలినాటి వలెఁగాక పౌరులచ్చుటచ్చటఁ దిరుగఁ జొచ్చిరి. నిత్యవర్షుఁడు, తొలినాడు తీర్మానించుకొన్నవిధమున వ్యాఘ్రేశారణ్యము పీతిహాత్రున కర్పించు నుద్యమమునందుండెను. ఆ పనిని గొనసాగించు నిమిత్త

మతఁడు కొందఱను బంచెను. వారు, సకలసన్నాహములతో నడవిఁ జొచ్చిరి. ఎచ్చటఁజూచినను భీమఁగుఁ జెంటలు వారికి గోచరించెను. వారందఱు రట్టపాడిభటులే; వారిలో విరోధి భటుఁడు మందునకైనను లేఁడు. విరోధులచేఁగూలినవారి సంఖ్య కంటెఁ బులికాటు తగిలిన వారు మిక్కుటముగ నుండిరి. ఒక వైపునఁ గత్తివాటులు సీసపుపోటులు దిని యొకబెబ్బులి చచ్చి పడి యుండెను; వేయేల? ఎట్టి వాని కా చో టడలుపుట్టించును.

గ్రద్దలు రాబందులు నక్కలు తోడేళ్లు మున్నగునవి రణాంగణమున నొఱఁగియున్న భటులప్రేతములను గొఱికి తినుచుండెను. దానిని జూచునప్పు డా భృత్యులమొదలలో బొడ లిన చింతకు మేరలేకుండెను; బీభత్సభయానకరసములు మూర్తీ భవించి నర్తించునట్లు వారికిఁ దోఁచెను. ఆ యడవిలోఁ గాఁపు న్నభటులు, తమ వనదాహోద్యమమునకుఁ దోడ్పడుదురని తలఁచిరాఁగా, వారి ఖననాదికృత్యములు సేయునట్లు తటస్థించెను. "హా! ఈ వ్యాఘ్రేశారణ్యమెట్టిదో కాని రట్టపాడి భటవర్గము నకు మృత్యునిలయమైనది" అని వారు భావించిరి.

"ఏమివింత! ఎందఱు శూరులు రణ నిహతులై కూలిరి. వీరుపాడిచికొనికూలునంత వెట్టివాండ్రా? ఈ వింతసంభవము మన యేలికకుఁ జెప్పక తప్పదు" అని యెట్టకేలకుఁ దీర్మానించుకొని, వనదాహమునకై తాము తెచ్చిన వస్తుసామగ్రి నచ్చటనే యుంచి పురాభిముఖులై పోయిరి. ఈ వర్తమానము సార్వభౌము నకుఁ దెలుపుటకుమున్నే పౌరులలో వ్యాపించియుండెను. జాతరకుఁ బోవునటు లాబాలగోపాలము, వ్యాఘ్రేశారణ్యమునుగూర్చి పోవుచుండఁగా పురమంతయు దొడ్డవోయినటులుండెను. భటులు

నిత్యవర్షున కాసంభవమును విన్నవించునపుడు, వ్యాఘ్రేశార
ణ్యము జనసమ్మర్దముచేఁ గ్రిక్కిరియుచుండినది. "ఈవేళకగ్నిదరి
కొని యడవిలోఁ బొగలెగయుచుండు" నని నిత్యవర్షుఁడు
భావింప వలసినతరుణమందు, నాచోటఁ బౌరులు మెండుకొని
యుండిరి. నాయకుఁడును రామన్నయు మాఱువేసములూని
యాగుంపులో నడయాడఁ జొచ్చిరి.

"ప్రభులింగలీల లెవరి కెఱుక? ఆ మహాదేవుఁ డిచ్ఛా
మాత్రమున నేరూపము నైనను దాల్చి యెట్టికార్యము నైనను
జేయును" అని తన్మహిమలనుగూర్చి సంభాషింపఁజొచ్చిరి.
నిమిష నిమిషమునకు నారిభక్తి యతిశయింపఁ జొచ్చెను.
వారు, చచ్చిపడియున్న వ్యాఘ్రమును జేరి రుద్రాభిషేకముఁ
జేసిరి. విభూతితో నర్చించి వనపుష్పదామముల నలం
కరించిరి. ఊరేఁగింప నగరమునకుఁ గొంపోవలయునని, కఱ్ఱలు
సమకూర్చుచుండునప్పుడే నిత్యవర్షుఁడు పరిజనులతో నటకు
వచ్చెను. తొలిరేయి తనభటుల కచ్చట తటస్థించిన యాపద
కంటె, పౌరులు తండోపతండములుగ వచ్చుటయు నటపడి
యున్న పులిని సేవించుటయు నతని కాశ్చర్యముఁ బెంచెను.

సార్వభౌముఁడు వారినిజూచి, "ఈమృగము నిట్లేల
సేవించెదరు?" అని మందలింపఁగా వా రతనిని జూచి యాస్తి
కత్వ ముదేశింపఁ దలకొనిరి. వారిమాట లేవగించుచు, తన
భటులను జూచి, యాపులిని బూడ్చునట్లును, అచ్చటి జనులను
దొలఁగించి జాగుసేయక యడవిని గాల్చునట్లును గట్టడచేసి,
యతఁ డా చోటు విడిచెను. చక్రవర్తి యాజ్ఞ పాలించునప్పుడు
రామన్నయు నాయకుఁడును దగ్గఱనేయుండిరి; వెంటనే వారు

నందుండి తొలఁగి గూడెమును జేరిరి. భటులచ్చట మూఁగి
యున్న జనులను దోలుచు పోనివారిని కశాఘాతములచే జడి
పించుచు నొకగోయి త్రవ్వి పులినిబూడ్చివైచిరి. ఈచర్యకుఁ
బ్రజలలోఁ బొడసూపిన వైరస్యమింతంతకాదు. రాత్రియై
యొకటి రెండుగడియలయ్యెను. సందడి మెందుకొనియుండుటచేఁ
గ్రూరమృగము లెర కొఱకు నిర్గమింప సాహసించినవిగావు. నిత్య
వర్షుని భటులు వేవురకుఁ దగ్గరయుండిరి. వారిలోఁ గొందఱు
కాగడాలను దైలసిక్తములు గావించిరి. కొంద ఱెండిన కట్టెలు
మున్నగు వానిని మహోన్నత వృక్షముల మొదళ్లయందుఁ
జేర్పఁజొచ్చిరి. కొందఱు, దట్టములైన పొదలు గాల్చుటకునై
పేలికల నుండలుగాఁజుట్టి నూనెలఁ దడుపుచుండిరి. అప్రమత్తుఁ
డయిన యూయుధపాణి వారిలో నొక్కఁడును లేకుండెను.
రాత్రికాలమున నరణ్యగర్భమందుఁ దమ్ముమార్కొనుదిట్ట యెవ్వ
డని యందఱును దమ యుద్యోగమునందుఁ జిత్తము చెల్లించి
యుండిరి.

ఆ వనము దరికొనుటకుఁ బ్రారంభించిన యెడల, వనదుర్గ
మంతయు నగ్నికాహుతియై తుదకు మాన్యఖేటనగరముకూడ
భస్మము కావలసి వచ్చును. అంతటితో మానెనా? దొంగల
గూడెమునకును బర్వతదుర్గము నడుమనున్న దేవాలయోద్యాన
మునకును దప్పక వినాశ మొనగూడును. అగ్నిస్పర్శ తగిలిన
జాలును; ఱాతికోటలోని ద్రావకములు మండి, ముక్కంటి
కంటి మంటలకంటె మిక్కుటముగఁ బ్రజ్వరిల్లి వ్యాఘ్రేశవన
మును దత్ప్రాంతారణ్యములను మాన్యఖేటమును దత్పరిసర
జనపదము లనేకములను దగ్ధపఱచి విజృంభించును.

భటులు కాగడాలను వెలిఁగించిరి; ఇంకను వనము దరి కొల్పుటకు మొదలిడలేదు. అపుడు వారిలో నొకఁడు, "అన్నలార! వనదాహమున కిదిసమయము గాదని తోఁచుచున్నది. ఈ కటికి చీఁకటిలో నలువైపుల నిప్పు రగిలి మండుచుండఁగాఁ బొగలో దోవ తెలియక, మనము జీవములతోఁ గాలి బూడిద కావలసివచ్చును. ఈపని కుదయమునఁ బ్రారంభింతము" అనెను.

'తగదు; మనము రాజాజ్ఞను నిర్వహించియే తీరవలయును. మరణమునకు లోఁబడియే రాజు కొలువునఁ జేరితిమి; ఏల యాలస్యము చేసెదరు? ప్రారంభింపుఁడు' అని యొకఁడు కేక వేసెను.

ఇటులే వనదాహమునకుఁ బ్రారంభింతమా వలదా యను సంశమున వారిలో రెండు కక్షలు లేర్పడెను. వాదము పైఁబైని ముదిరెను గాని కార్యమున కింకను బ్రారంభించలేదు. అట్టియెడ నందున్న జన సముదాయము రానురాను బెచ్చుపెరిఁగెను. వారెందుండివచ్చిరో యందలి వారికే తెలియదు. మిక్కుటముగనున్న వారు సందులకుఁ దగినటులే, వారికక్షలలోఁ జాల్గొని కొంతవఱకు వాదను బెంచి, తుదకు సార్వభౌముని భటుల నందఱనుబట్టి కాళ్లుసేతులకు సంకెలలు దొడిగి కూడెమునకుఁ గొంపోయిరి. అవ్విధమున, రక్తపాత మించుకంతయు లేక రమారమి వేవుర భటులనుబట్టి చెఱయందుంచిన వారు నాయకుని భటు లని పాఠకులకు సూచింపవలసిన యవసరము లేదు. వనదాహయత్నము తుదకిట్లు ముగిసెను.

---

## ముప్పదియొకటవ ప్రకరణము.

### ఏకాభిప్రాయము

తమస్విని, భూతకోటిని దన యంకపాళినిడి జోకొట్టి నిదురింపఁజేసి, యామత్రయా నంతరము మెల్ల మెల్లగఁ దడివి యిచ్చుచు లేఁపుచున్నదో యన, శీతలగంధవాహాంకూరము లంతట నల్లనల్లనఁ బ్రసరింపఁ జొచ్చెను. పిల్ల తెమ్మెరల సోఁకునకు, పుష్పకుట్మలముల ఛదములు కొంచెము కొంచెము విచ్చుటతోడఁ గులాయములోని పక్షినికరముల పక్షములు విడివడినవి; వికసితములయిన లతాంతములనుండి గుభాలునఁ బరిమళములు నిర్గమించి చుట్టుప్రక్కల వ్యాపించునటులే యెల్లెడలను మనోహరముగఁ బక్షికూజితములు పిక్కటిల్లినవి. సూర్యబింబము ప్రాచీదిశాంగనయొక్క నొసటజెందిరపుంబొట్టు ననుకరించునదనున దేవాలయోద్యానమునందున్న తైలపాదుల కహర్ముఖోచితకృత్యములు దీఱినవి. వారు తమ పటకుటీరములందు సుఖాసనాసీనులైరి గాని, వారి హృదయములు పురిపోని యాలోచనకుఁజిక్కి బాహ్యప్రపంచము మఱచి యుండెను.

విక్రమాదిత్యుఁడు, పర్వతదుర్గాంతరాళమున నజ్ఞాతవాసము సలుపుట కిష్టపడఁడయ్యెను. రణదుర్జయులయిన నిజసైనికులతో మాన్యఖేటనగరముపైఁబడి విరోధినిఁ జంపుటయొండెఁ జచ్చుటయొండెఁ గర్తవ్యమని నిశ్చయించి కొనెను. చేదిదేశమునకు వెళ్లియుండిన శ్రీధరుఁడు పని నేమిచేసికొని వచ్చెనో యతనికిఁ దెలియదు. ఆవేళకు శ్రీధరుఁడు వచ్చేసి యుండవలయును ; తన్ను, వానికిఁ దెలుపువారు లేరు; కాఁబట్టి

దేనికిని జంకక, దేవాలయ బాహ్యప్రదేశమందు శిబిరమేర్ప
఼ఱచుకొనుటే మంచిదని యతఁడు నిశ్చయించుకొనెను.

దానార్ణవుఁడు దేవాలయోద్యానమందు నివసించుట
ముండ్లపైఁ బరుండినట్లు కష్టము పెంచెను. శత్రువులుమూఁగి తన
కును బ్రజలకును గొప్ప యాపద సంఘటింపఁ జేసినపుడు ప్రాణ
ములు గాఁపాడి, పగవారినుండి తప్పించి, యేకాంతస్థలమునఁ
దనయుపచారముల కేలోపము లేక రక్షించిన 'కాలున'కుఁ గృత
ఘ్నుఁడై మెలఁగుట యతనికి వేదననే పెంచెను. తాను
వెలుపలకు వచ్చి యుపకర్తను దర్శించి, తననేరము విన్నవించి,
యతఁడలిగి చంపినను బ్రాణము లర్పించుటకు సిద్ధపడియుండెను.
విక్రమాదిత్యుఁ డచ్చట నుండుట తటస్థించినప్పటికి నదివఱ
కతనితో సంభాషించిన వాఁడు గాఁడు. వెట్టివానివలెనే యేమి
యును దోఁచక ప్రొద్దులు పుచ్చుచుండెను.

కళింగరాజకన్యకకు నాచోటు నచ్చినదికాదు; అస్థలము
కాలికట్టడముకంటె మేలని తోచదయ్యెను; తానాకట్టడము
నుండి వెలువడకయుండిన నావేళకు రామన్న సందర్శన మొన
గూడియుండునే యను తలంపు దాని హృదయమును సదా వెత
కొలుపుచుండెను. కాఁబట్టి, రామన్నను జూడఁగోరి యాబిడ
యెట్టి యిక్కట్టులకు భీతిల్లక యుద్యానస్థలినుండి తొలఁగుటకు
సమయము నిరీక్షించుచుండెను.

తైలప కొకవంక మాన్యఖేటనగరముపైఁబడి హాతము
సేయవలయుననియు మఱియొకవంక దొంగలగూడెమును గూఁ
కటివేళ్లతోఁ బెఱికివేయవలయుననియు నిచ్ఛపొడముచుండెను.
వాఁడు, అనన్యగోచరమగు దుర్గమును సైన్యబలము తనకొన

గూడియుండుటచేత నాపనులను త్వరలోనే నెఱవేర్పఁగలనని తలపోయుచుండెను.

శైలప యావేఁకువ నుద్యానమందొక వేదికపైఁ గూర్చుండి తనకృత్యములనుగూర్చి తలపోయఁజొచ్చెను. ఆయదనున మెఱపుమెఱసినటుల జక్కులదేవి దివ్యసుందరాకారము మదికిఁ బొడకట్టెను. వెంటనే, నాటిరేయి పెద్దిభట్టు సత్రమునందు, తాను నిదురమబ్బుచే నించుక గొడలు మఱచి యున్న వేళ, నేమో చెప్పుచు నున్నట్టులుండి మాయమయిన యువతీవతంసము గన్పట్టినటులాయెను. శైలప, తత్క్షణమే తన వ్రేలిని జూచుకొనఁగా 'శాంతి' యను నక్కరములుచెక్కిన ముద్దుటుంగరముండెను. "ఔను, ఆబిడయే.....కోకిలాలాప! ఆబిడ చిహ్నములు కోకిలాలాపయందును గన్పట్టినవి. హా, ఏమిమౌఢ్యము! కార్యభారముచేఁ బోల్చుకోనైతిని. అటులైన నన్ను నవరోధస్థలమునుండి విడుదలగావించిన కవచధారియగు యువకుఁడెవఁడు? వాని ముఖలక్షణములు కోకిలాలాపయందలి కన్పట్టెను; వీరు ముగ్వురొక్కరా భిన్నులా? భిన్నులెట్లగుదురు? మూఁడుసందర్భములయందు ముప్విధములఁ దోతెంచిన యువతి యొక్కతెయే! ఏల? నన్ను ఱాతికట్టడమునుండి విడిపించి కృతఘ్నుఁడా' అని సంబోధించిన జోటియు నదియే! తొలుదొల్త ధరించిన కవచములే తుట్టతుదఁ గాన్పించినప్పుడు నుండెను; కాని, ముఖకవచమొక్కటే విశేషము. అక్కటా, అది నన్ను వలచినది; వలపించుకొనుటకై యిన్నిపాట్లుపడినది. కృతజ్ఞత నుపదేశించు వ్యాజమున నాముద్రయుంగరమును మిగులఁ జాకచక్యముతోఁ దీసికొనినది. ఆ యన్నులమిన్న సాభిప్రాయ

ముగనే నన్నుఁ గృతఘ్నుఁడాయని పిలిచెను. ఈశత్రుమధ్యమున నాప్రాణములను బరిరక్షించుచున్న కామినీమణి యదియే! దానిని వరింపనేని నిక్కముగ నేను గృతఘ్నుఁడనే!

అటులైన నన్ను సందర్శింపఁగోరి యిటకువచ్చి, కళింగ కన్యకనై పోరుసలిపినది 'శాంత' యగునా? ఇరువుర యాకృతు లందును కంఠధ్వనులందును భేదము కన్పట్టుచున్నదే! ఇరువు రును భిన్నులే! ఆపాదమస్తకము కవచములు దొడిగియుండు టచే నావ్యక్తి యువతియా యువకుఁడా యని నిర్ణయించుట కలవిగాకున్నది. యువకుఁడే యనుకొందము! మహాసాహసియై యరణ్యగర్భముఁజేరి యాయుధపాండిత్యముగల చోరులతోఁ బోరి నాసందర్శన సౌఖ్యమనుభవించినట్టి ప్రాణమిత్రుఁ డీప్రాం తములం దెవ్వఁడును లేఁడే? నాస్పర్శచే బారవశ్యమొందెను; ఇది పురుషులందు విపరీతలక్షణము; గాఢానురాగమును నమ్ర తయుఁగలిగి, సల్లాపించుచుండిన యామిత్ర మున్నటులుండి నా చేతులు విదిర్చివైచి వైరాగ్యాతిశయమున నిలువలేక నాయెడ నౌదాసీన్యముచూపి వెడలిపోవుట కేమి కారణము? ప్రాణ ములకుఁ దెగించినంతటి ప్రేమ యున్నటులుండి నైరాశ్యమున కెట్లుమాఱెను? అంతటి యపరాధము నాయందేమి కన్పట్టెను? ఔను, పరస్పర ప్రతిస్పర్ధములయిన యిట్టిరసములు స్త్రీలయం దప్పుడప్పుడు పొడముచుండును" అని, క్రీఁజూపులతోఁ దన చేతులను జూచుచుండఁగాఁ జూపులు 'శాంత' ముద్దుటుంగర ముపై సోఁకెను. వెంటనే శైలప, "ఔనౌను, ఈ యుంగరమే యాయింతి కట్టివైరాగ్య మంకురింపఁ జేసినది. సరి, ఒకవిధ ముగా నెత్తునం దాసుందరియుఁ గవచధారిణియు నొక్కరే

యనుట కెంతయు సందియము లేదు; కాఁబట్టి యీముద్దు టుంగరముఁజూచి, నామనస్సపహరించిన సుందరీమణి విరక్తి చెందినది. హా! ఏమిదింత ! ఒకఁడె నామనస్సపహరించి మఱి యొకతె మెలఁకువనుగాంచి విరక్తిసెందినది; మఱియొకతె దాని యందలి నామకుఁడను గుర్తెఱిఁగి నన్నుఁ 'కృతఘ్నుఁడా!' యని సంబోధించినది; ఈచిక్కున కేమిసేయుదును?

"ఇప్పటికి నాకీచింతయేల? శాత్రవులనెల్లర సంహరించి, సత్యాశ్రయవంశమునకు వన్నెదెచ్చినప్పుడు గదా యిట్టియంశ ములనుగూర్చి యాలోచింపవలయును! అప్పటికిఁ జూచుకొం దము; నాయిప్పటి కర్తవ్యాంశము పగవారిని దెగటార్చుట యొక్కటియే" అను తీర్మానముతో నందుండి లేచెను. తైలప విక్రమాదిత్య దానార్ణవులకును కళింగరాజకన్యకకు నాశయ ములందు భేదమున్నను, వనమువిడిచి వెలికి నిర్గమించుటయం దేకాభిప్రాయమే!

తైలప యందుండి లేచి తండ్రియున్నడకుఁ బోవున ప్పుడు, దానార్ణవుఁడు గనిపించెను; "తాతా! ఇచ్చట నేమి చేసెదరు? నాతోరండు" అని యతనిని బిలుచుకొని పోయెను. విక్రమాదిత్యుఁడు తైలపను జూడఁగానే పుత్రప్రేమ మతిశ యింపఁ గౌఁగిలించి తనదగ్గఱనున్న యాసనముపైఁ గూర్చుండఁ బెట్టుకొని బుజ్జగించెను. "హా, ఇతనివలె నేనును నాతనయులఁ దనివితీఱ నెన్నఁడు కౌఁగిలించుకొందు" నని దానార్ణవుఁ డువ్విళ్లూరఁజొచ్చెను. ఆవేళకు భోజనకాలమయినందున సేవకులు పళ్లెరములందు భోజన వస్తువులను దెచ్చిరి. వారు భుజింప నాసన ములను జేరినప్పుడు, తైలప, విక్రమాదిత్యున కావృద్ధునిఁ

జూపి, "వీరు రాజర్షి; వీరొకగూఢప్రదేశమున నజ్ఞాతవాసము సేయుచుండి, కారణాంతరములచే నాచోటుఁజేరి మరల నటకుఁ బోలేక నాయొద్దనే ప్రకృతమున్నారు; వీరిచరిత్ర మతి గూఢమ యినది" అనెను విక్రమాదిత్యుఁ డొకముహూర్త మతని మోమునే చూచుచుండి, నాయనా వీరు మనవారు. ఎవరని తలఁచెదవు? నాసోదరులు! వీరే దానార్ణవ భూపులు" అనెను. ఆమాటలకుఁ శైలప మిగులనచ్చెరువొందెను. విక్రమాదిత్యుఁ డతనిని గౌరవ పురస్సరముగ సమ్మానించి, యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి తానును దాపునఁ గూర్చుండెను. వారితోడ కళింగరాజకన్యయు నటకువచ్చి కూర్చుండెను. అందఱకును బళ్లెములందు భోజనమువడ్డింపఁ బడెను.

విక్రమా—"పూజ్యుఁడా! ఇటీవల మీకేర్పడిన యిక్కట్టు దుస్సహమైనది. మీరట్టి యాపదకుఁ జిక్కి యంతరించితిరనియే యిదివఱకుఁ దలచియుంటిని. మీపేర రాజ్యము పరిపాలింపఁ బడుచుండుటయు మీపుత్రులు పేరు వినఁబడని యనువున నెటకో ప్రవాసమేఁగుటయువిని సత్యాశ్రయవంశమున కలవడిన యిడుమలకు మఱిమఱి దురపిల్లుచుంటిని; నేఁడుగదా సుదినము! మిమ్మీస్థితియందైనను సందర్శింపఁ గలిగితినే!" అని యతనినిఁ జూచి చెప్పెను.

దానార్ణ—"ఔను; నేనిక్కట్టులకుఁజిక్కి యవయుచుండుట సత్యమే! ఇవన్నియు నాదుష్కృతఫలములే" యని మోము వాంచి పలికెను. అప్పు డతని నేత్రములనుండి యొకటి రెండు దుఃఖాశ్రువులు రాలినవి; పైమాట నిగుడదయ్యెను.

తైలప, వృద్ధునిదుఃఖమోర్వలేక, తనతండ్రిని జూచి, "వీరికిఁ బుత్రులున్నారా!" అని ప్రశ్నించెను.

విక్రమా—నాయనా! ఉన్నారు; "ఇద్దఱు కొడుకులున్నారని వినియుంటిని" అని దానార్ణవుని జూచుచు చెప్పెను.

తైలప—అటులైన నేనొక తరుణవయస్కునిఁజూచితిని. పెక్కుతడవల కతనిఁ జూచియున్నాను ; మొన్న నొకటిరెండు నిముసము లతనితో మాటలాడియు నున్నాను. తాత యందలి గుఱుతులన్నియు నతనియందుఁగలవు. ఒకవేళ యతఁడే...వీరి...

దానార్ణ—అతిశయానందము మనస్సునం దిముడక మోమున వెల్లి విఱియుచున్నదో యన ముఖము వికసింప నాత్రము పట్టలేక, "తండ్రీ! వానిని జూచితివా ? వాఁడే, వాఁడే!. చూచువారందఱు వాఁడు నన్నొలిచికొని పుట్టెనందురు. నాయనా, వాఁడే చాళుక్యచంద్రుఁడు !

తైలప—తాతా, అతనిపేరు చాళుక్యచంద్రుఁ డనుట తెలియదు. అతఁ డిచ్చటనే మెలఁగుచున్నాఁడు; అతని యిచ్చటి వ్యవహార నామము రామన్న.

రామన్న యను మాట వినఁగానే మేఘ గర్జను విన్న మయూరిచందమున సంతోషముపట్టలేక కళింగకన్య, "అన్నా! వారిని జూచితిరా! మొన్న నెచ్చటఁజూచి సంభాషించితిరి?" అని తమి నాఁగలేక పలికెను.

దానార్ణవుఁ డచ్చెరువుపట్టలేక మహారాజ ! "ఈబిడను గొన్నాళ్లకు మున్నెచ్చటనో చూచితిని; మీకూఁతురా?" అనెను.

విక్రమా—"కాదు; కాని—కూఁతురివలెనే ప్రకృతము పాటించుచున్నాను. ఈకన్య కళింగరాజపుత్రిక !"

'కళింగరాజ'నుమాట వినఁగానే దానార్ణవుఁడు, సూర్య కిరణములకు భానూపలమువలె బగ్గునమండి వికృతదృష్టులతో నాయన్నల మిన్ననుజూచెను. కేవలము ముగ్ధయగు నాబాల కతని భావము దెలియలేదు. అట్టియెడ, తైలప, "తాతా! ఈ నాసోదరి మాతండ్రిగారికిఁ గూఁతురుగాకున్నను దేవరవారికి గోడలు గాఁగలదని నమ్మెదను" అనెను. ఆమాటలకు దానార్ణవుఁడు క్రోధముతోనవ్వి, "నాయనా! ఈకన్య కళింగ కృష్ణునకుఁ గాక యెవనికిఁ బుట్టియుండినను బాగుగ నుండునే" అనెను.

ఇటులే సంభాషించుచు వారు భుజించిలేచిరి. భోజనానంతర మాముగ్వు రొకచోటుఁజేరి, వినోదగోష్ఠి సలుపుచు నడుమనడుమ కార్యవిధానమును గూర్చి ముచ్చటించు చుండిరి. తుదకుఁ దైలప వారినిజూచి, "రెండుమూఁడుదినములుగ వెలుపల నేమి జరుగుచున్నదో తెలియకున్నాను. నేఁడరసివచ్చెద" నని యచ్చోటువాసెను. దానార్ణవుఁడును జింత తొలఁగి తాను విడిసియున్న పటకుటీరమును జేరెను.

---

## ముప్పదిరెండవ ప్రకరణము.

### శ్రీధరుఁడు

సూర్యుఁ డాకాశమధ్య మలంకరించి దుర్నిరీక్ష్యుఁడై యొసఁగుచుండెను. ఆవేళకుఁ దైలప యాయుధశాలఁ బ్రవేశించి తన యిచ్చకుఁ దగియున్న కంకటముఁ దొడిఁగికొనెను. మల్లప యొసఁగిన సత్యాశ్రయఖడ్గమును గేలఁ గీలించి కుడ్యాంతర మార్గముఁజేరెను; ఆలయమునకు వెలుపల జనులు మెండుకొని యుండునట్లు లలబలము విన రాఁగా, గోడల సందులనుండి

చూచెను; దేవాలయప్రాంతమం దంతటను భటులు వరుస దీరి యమ్ములేయుచుండిరి. వారు మాన్యఖేటభటులని తెలప తెలిసి కొనెను. ఇంచుకంతయుఁ దెఱపిలేక వారమ్ము లేయుచుండుటను జూచి, పగవారిబలములు కొంతదవ్వులనుండి సంగరము సలు పుచున్నట్లు వాఁ డూహించెను. ఎదిరి దెసనుండియు దట్టముగ నమ్ములు వచ్చిపడుచుండినవి. ఆయేటుల కీ బలమునఁ గొందఱు కూలుచు నుండిరి. మాన్యఖేటముభటులు నిలిచినచోటు నుండి కాలుకదల్పకయే యమ్ములేయుచుండుటవలన, విరోధిభటులు వెనుదీయక పోరుచున్నారనియును వారు శ్రీహర్షుని భటులని యును దెలప భావించెను.

ఇటులే యొకగంటవఱకుఁ బోరుజరిగెను. రమారమి రెండువేలరౌతులు బల్లెములు చేతఁబూని, పగవారు ప్రయో గించునమ్ములకు డాలొడ్డుచు బాణవేగమున నిత్యవర్షుని దళముల పైఁ బడిరి. వారేమండలము వారో తెలప మొదటఁ బోల్చుకో లేక పోయెను. వారిధాటికి నిత్యవర్షుని కాలరు లాఁగకపోయిరి. వారు, తమగుఱ్ఱములను జిత్రగతులఁ ద్రిప్పుచు బల్లెములతోఁ బొడిచి కూల్చుచుఁ బోరుసలుపుచుండ, మెఱపుమెఱసినట్లు నిత్యవర్షుని రౌతులటకువచ్చి పగవారినిఁ దాకిరి. వారి సైన్యసా గరమునఁ జేదిభటులు మడిసిపోవున ట్లుండెను.

ఆశ్వికుఁడొకఁడు ఖడ్గమువీచుచు, "యోధులారా! వెను దీయకుఁడు. మీసామర్థ్యము నెదుట, మీపౌరుషము మ్రోల నీ యలసు లేపాటివారు? పొడిచి కూల్చుఁడు! జయశీలములయిన చేదిబలముల ఖ్యాతిని నిలుపుఁడు!" అని యఱచుచు నారౌతు లలోఁ దిరుగుచు నెదిరిన రౌతులను బొలియించుచు, రణరంగము

నందంతటను దానే యయి కన్పట్టెను. వానిని జూడఁగానే, వీరా వేశపరవశుఁడై తైలప, "సోదరా! శ్రీధరా! ఇదిగో నేనును నీకు బాసట వచ్చెదను" అని కేకలిడుచు ముందు వెనుకలు చూడక ప్రమథవిగ్రహాము ద్రిప్పి వెలికి నిగిడెను. దేవాలయము వెలుపలఁ గొంతదవ్వుల రామన్న కొందఱు భటులకు నాయకుఁడై పోరుచుండెను. మఱియొకవంక మాలవ్యుఁడు సేనానియై నిత్య వర్షునిఁ దాఁకి యుద్ధము సేయుచుండెను.

తైలప, అందలి సందర్భములను జూపుచేతనే గుర్తెఱిఁగి, కనుమూసి తెఱచునంతలో మాన్యఖేటభటు నొకనిఁ గొట్టి పడఁద్రోసి, లాఘవముతో వాని తురగ మధిరోహించి శ్రీధరునిఁ జేరవలయునని ప్రయత్నించెను; విరోధులు నివ్వెఱపాటొందునట్లు, దళములపైఁబడి చాకచక్యముతో భటులను ద్రెంచి కూల్చుచుఁ గొంతసేపటికి శ్రీధరుని సమీపించెను.

మిత్రసందర్శనమిచే రణవిహారమునఁ గ్లాంతిచెందిన హృదయమునకు ధైర్యమొనఁగూడి దేహమాశ్రయించిన యల యొక తొలఁగఁగా శ్రీధరుఁడు పెల్లుగ గర్జిల్లెను. మేఘాడంబరము మయూరములకువలె శ్రీధరుని గర్జారవముచేదిభటవర్గమునకు ధైర్యము నించెను. ప్రాణములు తృణీకరించి, సంకులయుద్ధమున తమ్ము మార్కొన్న వారిని పొడిచి కూల్చుచు వారు విజృంభించిరి. ముప్వురు నలువురొక్కరినే తాఁకినపుడు, పోటుసలుపుట యెట్టిశూరునకును దుర్భరముగానే యుండును. అటులుండియు చేదిభటుఁడొక్కఁడొక్కఁడును దన్ను రక్షించుకొని విరోధి భటులను గెడపుచునే యుండెను. రెండుగంటలదాఁక జరిగిన యాఘోరసంగ్రామమునందు నుభయపక్షములందును బెక్కండ్రు

హతులైరి. తైలపయు శ్రీధరుఁడును ధైర్యమువిడువక వైరులను బోరిగొనుచుండిరి. వారి యుద్ధవిక్రీడ తమ్ము ప్రేరేచఁగాఁ జేది భటులు మాన్యఖేటబలముల నువ్వెత్తుగాఁబొడిచి త్రోయుచుఁ జెలరేఁగిరి. వారి పరాక్రమాతిశయము భరింపలేక నిత్యవర్షుని సైనికులు కాందిశీకులగు సూచనలు గన్పట్టెను. అట్టి యిక్కట్టున సేనాని, 'అమిత్రఘోషుఁడు' తనసైనికుల నుత్సాహపఱచుచువచ్చి బెట్టిదముగఁ దైలపను దాఁకెను. తక్కిన రౌతులు నూత్నోత్సాహముతో శ్రీధరుని వాని భటులను మార్కొనిరి.

రామన్న, తన కాల్బలమువారినిఁ బ్రోత్సాహపఱచి తమ్ముఁ దాఁకిన బలములతో సమరము సేయుచుండెను. మాలవ్యుఁడును నిర్భీకుఁడై సార్వభౌమునే మార్కొని ఘోరముగాఁ బోరాడుచుండెను. వారి పోరునుజూచినవారు, వృత్రేంద్రుల సంగ్రామ మిట్టిదే కానోపు ననక మానరు. మాలవ్యుఁడు కొండొకవడికిఁ జక్రవర్తి తురగమునుబొడిచి కూల్చెను. అతఁడు, వేఱొండు వాహన మధిరోహించునంతలో మాలవ్యుఁ డతనిని ద్వంద్వయుద్ధమున కెలయించెను. ఇరువురును గదలనుబూని పోరిరి. రట్టపాడిభటులు, తమ యేలిక కెడరు గలుగునేమో యని దబ్బుదబ్బున వచ్చి మాలవ్యుని బొదివిరి.

మాలవ్యుఁడు, భటుల వ్రేటులను లెక్కపెట్టక తన్నుఁ బొదివిన వారికందఱకు నన్నివిధముల సంగరమిచ్చుచు, సార్వభౌముఁడు తప్పించుకొని పోనీక యరిగట్టి యితఁడభినవఘటోత్కచుఁడో యను సందియ మొనగూర్చుచు క్రీడించెను. తుదకుఁ జిత్రభ్రమణముల జోదుల ప్రహారములు డాలుచేఁ దట్టివైచుచు లాఘవముతో ఘోట్టిగుని మీఁదికి వచ్చెను. అంతలో

ఖొట్టిగుఁడు గదను ద్రిప్పి యావీరునిపైఁ గొట్టఁగా నామోదున కతఁడు విసంజ్ఞుఁడై నేలఁగూలెను. మూర్ఛమునిఁగిన యాశూరునిఁ బొదువ వైరులు యత్నించుచుండ, నాయకుని భటులు ప్రాణములపై నాసవిడిచి, వారితోఁబోరి కూల్చి మాలవ్యుని మోచికొని వెడలిపోయిరి.

అస్తగిరి నధిరోహించిన సూర్యుఁడింక నపరవారాశిలోఁ గ్రుంకలేదు. ఖొట్టిగుఁడు సమరము చాలించి తనవిడిదలఁ జేరెను. ఉభయపక్షముల సైనికులు సంగ్రామము చాలించి తమతమ విడిదలలకు మరలఁజొచ్చిరి. తైలపామిత్రఘోషుల యుద్ధము ముగియలేదు. శ్రీధరుఁడును యుద్ధము చాలించు తరుణమయ్యెను.

తైలప యుత్తమాశ్వమునే యధిరోహించి యున్నప్పటికిని, సాది యిచ్చుచొప్పున మెలఁగి యది యలసియున్నందున రణవిక్రీడ కింకఁ దగియుండలేదు; దాని యొడలంతటను జెమ్మట పట్టి, నోట నుఱుఁగులు క్రమ్ముచుండెను. అప్పుడయ్యశ్వము, అమిత్రఘోషుని గుఱికిఁ జిక్కి వ్రేటు దిని నేలకొఱఁగెను. దానితోఁ దైలపయు నిమ్ము దప్పి చలికిలఁబడెను. వెంటనే యమిత్రఘోషుఁడు తనగుఱ్ఱమునుండి వానిపైకుఱికి యెదపైఁ గూర్చుండి కటారిని దూసి పొడువఁ జేయి పైకెత్తెను. కొంతదవ్వులనున్న శ్రీధరుఁ డదిగాంచి హాహారవములతో గుఱ్ఱమటకు మరల్చెను. కనుమూసి తెఱచునంత యవకాశము లేదు; పగవాని పోటునకుఁ జావ వలసినగతి తైలపకు సమకూడెను.

అట్టియిక్కట్టునఁ బైకెత్తిన యమిత్రఘోషుని కరము నొక యర్ధచంద్రబాణము ద్రెంచివైచినది. ఆయమ్ము వెంటనే

యొకరౌతు 'కృతఘ్నుఁడా!' అని సంబోధించుచు వచ్చిచేరెను. తైలప, తెప్పపాటు కాలములోఁ దుల్లిపడి, తనపగవానిఁ గ్రింది కిఁద్రోసి ఱొమ్ముపై మోఁకరించి, దాఁపలిచేతితోఁ గంఠము నొక్కిపట్టి ముష్టి ప్రహారముల వానిని దుద ముట్టించెను.

"హా! కృతఘ్నుఁడ? ఏమి యీసాహసము! ఈశ్వరుఁడు నిన్ను రక్షించెనని నమ్ముము. పెద్దల దీవెనలు నిన్ను బ్రతికించెను; కాని, నీవు పెద్దలమాట విస్మరించినందుల కీ ఫలము గంటివి" అని ఆపాదమస్తకము కవచములు దొడిఁగియున్న యారౌతు సాభిప్రాయముగఁ దైలపను జూచి చెప్పెను.

ఆమాటలకు మందహాసము ముఖమలరింపఁగాఁ దైలప, "నెచ్చెలీ! నన్నుఁ గృతఘ్నుఁడంటివి; నీకు గృతజ్ఞుఁడై యుండఁగాఁ గృతఘ్నుఁ డెటులైతిని? నేను బెద్దలమాట శిరసావహింతును; విస్మరించితి నని యెట్లనెదవు? అయినను నిష్కారణముగఁ జెప్పవని నమ్మెదను" అనెను. ఆరౌతు, తైలప తొంటివలెఁ దన్ను సోదరీ యని సంబోధింపక నెచ్చెలీ యన్నందులకు లోలోన సంతసిల్లినదిగాని, ఇంకను బ్రియుఁడు ప్రాణేశ్వరీ యని నోరారఁ బిలువఁడయ్యెనే యని యించుక కోపము వహించినది. దాని యను తాపము బొత్తిగఁ దొలఁగలేదు. అంత తైలపనుజూచి, "నెయ్యుఁడా, కారణములు దెలియఁ గోరెదవా? నీమొదటి సంప్రశ్నమునకు నీహృదయమే సమ్మతి చెప్పఁగలదు; రెండవదానికి బదులు చెప్పవలసివచ్చిన, నీవు మల్లపయొక్క యుపదేశము పాటించి యజితుని వాహనముగ వహించి యుందువేని యిట్టి యిక్కట్టునకుఁజిక్కియుండవు" అని పటపటమని పలికి యుండుండి

మరలెను. ఆవేళకు శ్రీధరుఁడటకువచ్చి "హా! మిత్రుఁడా! గండము తప్పినది" అని తైలపను గౌఁగిలించు కొనెను.

అంత వారిరువురును సల్లాపించుచు కోనేటివంకకుఁ బోయిరి. వారు కోనేటిలో ఖడ్గములు గడిగి కోశములలో జొనిపి, ముఖప్రక్షాళనాది కృత్యములు నెఱపునవసరమున రామన్నయు నటకువచ్చెను. అతఁడటకు రాఁగానే తైలపఖడ్గ మతని దృష్టులనాకర్షించెను. దానిపైఁజెక్కియున్న శ్రీపులకేశి సత్యాశ్రయ వల్లభేంద్రుని పేరును జదివి, "హా! ఈఖడ్గరాజమును బట్టు నితఁడు...అసాధారణ పురుషుఁడు! ఈశస్త్రమితని హస్తమలంకరించుటకుఁ గారణముండక తప్పదు" అని సందేహించుచు, "సోదరా! నేఁడు నీపోరితము గన్నులారఁ జూచితిని; నీవు కారణజన్ముఁడవని నమ్మితిని" అని రామన్న చెప్పెను.

శ్రీధరుఁడు—రామన్న! యదార్థము పలికితివి; ఇతఁడు తప్పక కారణజన్ముఁడే! ఈతఁడొక్కరుఁడే నాకీ యిహమందు మిత్రుఁడు; ఇతని సందర్శనార్థమే యిదివఱకుఁ బరితపించుచుంటిని.

తైలప—(మందహాసముచే శ్రీధరుని పలుకుల నాదరించి రామన్నను జూచి) చాళుక్యచంద్ర! నన్ను సరిగానే సంబోధించితివి; నేను నీకు సోదరుఁడనే! నాతోరమ్ము; నీప్రాణసఖిని నీజనకుని సందర్శించి వారిహృత్తాపములు పోకార్తువుగాక!

రామన్న, తైలప తన్నుఁ జాళుక్యచంద్రుఁడని సంబోధించుట విని యత్యాశ్చర్య పరవశుఁడయ్యెను. "హా! ఇతఁడెట్టి కుశాగ్రబుద్ధి!" అని తలపోయుచు, "సోదరా, వారు నీయొద్ద సుఖముగా నున్నారని నమ్ముచున్నాను. రేపటికి నీవెంటవచ్చి వారిని సందర్శించెదను" అనెను.

"కూడదు; ఇప్పుడే నావెంబడి రమ్ము" అని తైలప చాళుక్య చంద్రుని చేయిపట్టుకొని చెప్పుచు; శ్రీధరునిఁ జూచి, "నీవును రమ్ము; రాజుగారిప్పటికి రెండుమూఁడు తడవలకు నిన్నుఁ జూడ వలయునని ప్రస్తావించి యుండిరి" అనెను. అందులకు శ్రీధరుఁడు సమ్మతించెను. చాళుక్యచంద్రుఁడు, "సోదరా, నీమాటలు చిన్న వుచ్చలేను; ఈపూటకు నన్ను మన్నింపుము. ఇన్నాళ్లు సేవిం చుచుండి మంచిసమయమున నేను నాయకుని విడిచియుండ రాదు; ఆతఁ డెప్పుడెట్టి యాజ్ఞపాలించునో తెలియదు; ఇప్పటి యుద్ధవృత్తాంత మతని కెఱిఁగించి యాతఁడు సెలవిచ్చువిధమున మెలఁగవలసినవాఁడను; ఎట్లు నీవెంట రాఁగల" ననెను.

"చాళుక్యచంద్రా! అటులైన నిపుడు నిన్నుఁ బిలుచుకొని పోయి యొకటి రెండు గంటలలోనే యిటకుఁ దెచ్చివిడిచెదను. ఇంతలో మునిఁగిపోవున దెదియు నుండదు. నాతోడరమ్ము" అని నొక్కిచెప్పెను. చాళుక్యచంద్రుఁడు బదులుపలుకక పోవుట కొడఁబడెను. అంతవారు, కోనేటినుండి నిర్గమించి తమగుఱ్ఱము లచ్చటి తరుకాండములకుఁగట్టియుంచి తైలపతో నాలయముఁ జేరి యందుండి యుద్యానవనముఁ జొచ్చిరి.

---

## ముప్పదిమూఁడవ ప్రకరణము.

### సంతర్పణ

పైనిజెప్పిన సంగ్రామము జరిగిన దినమునకుఁ దొలినాటి యుదయమున మాన్యఖేటనగరమునందుఁ గ్రిక్కిరిసి జనులు నడ యాడుచుండిరి. వారు, చుట్టుప్రక్కలనున్న గ్రామములనుండి వచ్చిన కాఁపులు మున్నగువారు. కాషాయాంబరములు ధరించి

పొడుగాటి దండములు పూని యేకదండసన్న్యాసులు పెక్కండ్రు వీథులవెంబడిఁ దిరుగుచుండిరి. పంచకచ్ఛములతో దోవతులు కట్టి, సాలువులు కప్పికొనియు నెత్తికిఁ జుట్టుకొనియుఁ వైరాగికు లచ్చటచ్చటఁ గానవచ్చుచుండిరి. కావిదుస్తులు దొడిగి కంఠము లందును జెవులయందును రుదురాక పేరులును బోగులును బొలు పారుచుండఁగా నిరుప్రక్కల గంగా జల పూరితములయిన కుంభము లొప్పుచుండఁ గావిళ్లను మోఁచికొని, "జయశంకర్ జయశంకర్" అని మహాదేవునిఁ బేర్కొను విరాగు లాపుర మునఁజొచ్చి యచ్చట మెలఁగఁ దొడఁగిరి.

కాఁపులు, చేత నిడుపాటిదుడ్డుకఱ్ఱలనఁబూని మోటు బట్టలు దొడిగి, నగరములోఁ బ్రవేశించి, వాడవాడలఁ దిరిగి దరిద్రుని కుటీరము, ధనికుని మందిరము, అను నియమము లేక ప్రతిగృహమునందును దూఱి, "అయ్యా, ఇట నొకసిద్ధపురు షుఁడు విచ్చేసియున్నాఁడఁట ; అతని సందర్శనమాత్రమున నభీష్టావాప్తి యగునఁట, అతని యనుగ్రహము పొందిన వా రాధివ్యాధులు దొలఁగి సుఖింతురఁట ; వృద్ధులు యువకు లగుదురఁట ; అతఁడు పరమశాంభవుఁడు; అతనిబస దెలిసియున్నఁ జెప్పి పుణ్యము గట్టికొనుఁడు" అని యడుగఁ జొచ్చిరి. వారు తెలియదనినను వినిపించుకొనక, విసుఁగుచెందు వఱ కడుగుచు, ఆయవకాశములో గృహముల నిర్మాణవిధమును, అందలి జనుల పరిస్థితులును జూపుచేతనే తుదముట్ట గ్రహించుచుండిరి. ఇటులే యాటకు వచ్చిన విరాగులు నేకాంగులు నింటింటఁదూఱి తిరిపె మెత్తుచు నందలి పరిస్థితుల సూక్ష్మబుద్ధిచేఁ గనుఁగొనుచుండిరి. వారు, పెక్కువిధముల వృత్తులను గలవారుగా నున్నప్పటికి నంద

ఆరోగ్యదృఢగాత్రులై కన్పట్టుచుండిరి. అందఱును సిద్ధపురుష సందర్శనార్థము విచ్చేసిన వారుగాను గోచరించిరి.

నగరమునం దాగ్నేయదిశ నొక పెద్ద యుద్యాన వనముండెను. ఒకగొప్పవర్తకుఁడు, సంతానహీనుఁడైనందున మనోహరముగ నావనము వినిర్మించి పురజనుల యుపయోగార్థ మిచ్చియుండెను. పౌరుల వసంత మాధవపూజలు, చైత్ర మాస వనభోజనము లచ్చటనే జరుగుచుండును. ధనాఢ్యులు కూడ పెండ్లిండ్లచట సంబరముగా జరుపుటగలదు. ప్రకృతమా పౌర వనమందే, కాఁపుజనులు వెదకుచుండిన సిద్ధపురుషుఁ డసంఖ్యాకులయిన శిష్యులతో బసచేసి యుండెను. మధ్యాహ్న మగునప్పటి కతని శివపూజ పూర్తిచెందినది. శివప్రసాదము స్వీకరింప నెల్లరును విచ్చేయవలయు నన్న వార్త పురమందంత టను వ్యాపించెను. ఇంతకుమున్నే కాఁపులవలన సిద్ధుని మహిమ లను గూర్చి వినియుండియు, "జోగిపెట్టు భోజన మేపాటి"దని తలఁచి పౌరులలో ననేకులు పోరైరి. కొందఱుమాత్రము భక్తి తో భుక్తి కేఁగిరి.

భోజనము సేయుటకు విచ్చేసినవారు వేవురకుఁ దగ్గరు. విశాలరమణీయమగు నావనమందు వృక్షచ్ఛాయల వరుసలు దీరి వారుగూర్చుండిరి. పరిచారకులు విస్తరలు పఱచి పలువిధ ముల ఫలములతోను భక్ష్యములతోను గలమాన్నములతోను వడ్డన సాగించిరి. భోజనకాలమందు పంక్తులలో, "హరహర మహాదేవ" అనెడి నామస్మరణలులేచి మిన్నుముట్టెను. అట్టి యెడ, భోక్తలకుఁ దృప్తిగ వడ్డించిరా? యనుటను దెలియు నిమిత్తము, యోగి పంక్తి విచారణకు మొదలిడెను. అతఁ

డాయూపం క్తిలోఁ బ్రవేశించి, "అయ్యలార! ఏమికావలయును? సంకోచింపకుఁడు! ఓరీ, వీరికి ఫలములు పెట్టుము; వీరికి పాయసము దెమ్ము; వీరికిఁగలమాన్నము వడ్డింపుము; స్వాములార, ప్రొద్దుపోయినది; కడుపార భుజింపుఁడు; ఆహారవ్యవహారములందు లజ్జతగదు; అవసరపాటువలదు" అనియుపచరించుచు వి_స్తరలందు లేనివస్తువులు దెప్పించి వడ్డించుచుఁ దిరుఁగుచుండెను.

యోగిస్వరద్రూపి; అతని శరీరచ్ఛాయ యుపరంజిని దిసంతులు గొట్టుచుండెను. అతఁడు, త్రింశద్వ త్సరప్రాయుఁడై, త్రిదశుఁడో లేక త్రిదశవల్లభుఁడో యనుసందియము ప్రేక్షకులకుఁ గలిగించుచుండెను. అతనిమోము కరుణారసమునకు నివాసస్థలము. అతని విశాలవక్షము, విశాలనేత్రములు, ఉన్నతములయిన భుజములు, ఆజానుబాహువులు చక్రవ_ర్తి లక్షణలక్షితములై యొప్పారుచుండినవి. అతనిని సందర్శించినవారు, "ఆహా! సిద్ధపురుషు లిట్లేయుందురు కాఁబోలు! ఎట్టిమహారాజులయందు నిట్టి దివ్యలక్షణములు గన్పట్టవే!" అని యాచ్చెరువొందుదురు.

ఆయోగిపుంగవుఁడు, అందఱుభుజించిలేవఁగానే, "మహాస్వాములార! నామనవిచి_త్తగించి, రేఁపు రెండుపూటలు శంభుప్రసాదము స్వీకరించి, రాత్రిభోజనానంతరము హరభజనముతో నూరేఁగింపు జరిపి నన్నుఁ బంపివేయుఁడు" అని దోసిలి యొగ్గి ప్రార్థించెను. ఒక్కరొక్కరికిఁ బిడికెఁడేసి పూలవరహాలు భూరిదక్షిణలిచ్చి కర్పూరతాంబూలము లొసఁగి పంపివేసెను. వారు లెల్లరుఁ బరమాహ్లాద పరవశులై యునికిపట్టులకు మరలిరి. వారు పురములోఁ బెక్కువిధముల సిద్ధపురుషుని శ్లాఘించి యతని సంతర్పణను వేనోళ్లఁ బొగడిరి. వానిపొగడ్తలువిని, వెళ్లనివారు

తమబుద్ధి జాడ్యమునకు వగచి, "రేఁపటికిఁ దప్పక శివప్రసాదము స్వీకరింపవలయును" అని నిశ్చయించికొని యుండిరి.

మఱునాఁడే తెల్లవాఱుజామున వ్యాఘ్రేశారణ్యమందుఁ జేదిబలములును నాయకుని బలములును బహాటముగా శిబిరము లేర్పఱచికొని, నగరములోఁ జొచ్చుటకుఁ బ్రయత్నించినవి. ఈసంగతి తెలియఁగానే నిత్యవర్ష సార్వభౌముఁడు తనమూల బలములోని యాశ్వికులను పదాతులను సమకూర్చుకొని తరలి, తొల్లిమల్లప విడిసియున్న చోట స్కంధావార మేర్పఱచి కొనెను. తన్ను మార్కొన్నవి హర్షదేవుని దళములే యని యతఁడు భావించి, "నేనుహర్షునిఁ జంపి మాలవము పూర్తిగా లోఁబఱచు కొనునంతవఱకు నగరమునకు మరలను" అని సంకల్పించు కొనెను. నాఁడుజరిగిన యుద్ధమునందు నిత్యవర్షుని భటులనేకులు కూలుటయు శూరనిధి యగు నమిత్రఘోషుఁడు త్రెళ్లుటయు నతని విచారముపెంచెను.

నిత్యవర్షుఁ డా దినము యుద్ధమున గాయములు దగిలిన యోధలకుఁ జికిత్ససేయఁ దగువారిని బంపి, శరీరాయాసము దొలఁగున ట్లుష్ణోదకస్నానముచేసి మితభుక్తి సలిపి లేచెను. వెంటనే, మంత్రులను సేనానులను రావింప సేవకులను బంపి, వారు వచ్చునంతలో నుత్సాహమతిశయింప మేలయిన యాసనముఁ గ్రోలి కూరుచుండెను. భోజనాది కృత్యములను దీర్చికొని మంత్రులు మున్నగువారు సన్నిధానముఁ జేరిరి.

అట తైలపాదు లాలయోద్యానమును చేరిరి. చాళుక్యచంద్రుఁ డందు విడిసియున్న భటవర్గమును జూచి, నాకుఁ దెలియక వీరిటకెట్లువచ్చిరని యచ్చెరువొందెను. ఆచోటు లక్ష్మీ

నివాసమున కర్హమైన యొక చిన్ననగరముగఁ గానవచ్చెను. తైలప యదివఱ కెవ్వరును గనిపెట్టని సురక్షితమగు గూఢ ప్రదేశము గుర్తెఱిఁగెనని యతని బుద్ధిసూక్ష్మతను మిక్కుటముగ మెచ్చుకొనెను. మొట్టమొదట విక్రమాదిత్య మహారాజును దర్శించి నమస్కరించి యతని దీవెనలు పడసెను. తండ్రియు న్నెడకుఁబోయి వినయము వెల్లడించి యొకటి రెండు మాటలలోఁ దనయొక్కయుఁ దమ్మునియొక్కయుఁ బరిస్థితులు దెలిపి, అందుండి కదలి కళింగరాజకన్యను గనిపించుకొని యుక్తసంభాషణములచే నాబిడ హృత్తాపముఁ బోకార్చెను.

అట్టియెడ, శ్రీధరుఁడు విక్రమాదిత్యమహారాజును సందర్శించి, తాను జేదిదేశమునకుఁ బయనమైనది మొదలుచేసి యదివఱకు జరిగిన సంగతులను గొన్నిమాటలతో విన్నవించెను. త్వరలోనే వారి కచ్చట భోజనపుఁ బనియు ముగిసెను. అంత తైలప తండ్రినిజూచి, "ఈ రేయి ముగియునంతలోఁ బరిజనులను దానార్ణవరాజును బిలుచుకొని కుడ్యద్వారము వెడలి దేవాలయము విడిదలగావించు కొనుఁడు; ఇప్పుడే నేను వెళ్లి చేదిబలములు దేవాలయము ముట్టడింపక యుండ...

తదనంతరము తైలప తనమిత్రుని సోదరునిఁ బిలుచుకొని యాలయబాహ్యప్రదేశమునకువచ్చి చేరెను. తరుకాండములకుఁ గట్టియున్న తత్తడులను విప్పి శ్రీధరుఁడును జాళుక్యచంద్రుఁడు నధిరోహించిరి. తైలప, "చేదిబలములను దేవాలయ పరిసరములందు విడియు నట్లు కట్టడఁజేసి ర"మ్మని శ్రీధరునిఁ బంపివేసి యజితతురంగము నాహ్వానించెను. కొన్ని నిముసములలోనే

యది యటకు వచ్చిచేరెను. దానిమీఁది పల్యాణము ధూళి గ్రమ్మియున్నందున దానిని దట్టివైచి కళ్లెమును మడిచి నోటికిఁ దగిలించెను. ఆయశ్వమును జూచి చాళుక్యచంద్రుఁ డబ్బుర పాటొందెను. అంతలో నటకు శ్రీధరుఁడు వచ్చెను.

అప్పుడు, నాయకుని భటుఁ డొకఁ డావంకఁ దొందరఁగా బోవుచుండుటను రామన్న చూచి, "పీరన్నా, మన యేలిక యిప్పుడెచ్చటనున్నా"రని ప్రశ్నించెను. అందులకు వాఁడు, "దొరా, వారి నీరేయి చూడలేరు" అని పలికి యటనుండి వెడలిపోయెను. అట్టియెడఁ దైలప, తొల్లి వెలుపలనుండి శిబిరము నుద్యానమునకు మార్చినట్లు లోపలినుండి వెలుపలి కిప్పుడు మార్పవీలగునా యనుటను దెలియఁగోరి, తన మిత్రుని సోద రునిఁ జూచి, "మన మీప్రాంతములను ద్రిమ్మరి పగవారి వర్తనము లారయుదము" అని నిత్యవర్షుని శిబిరమున్న దెసనుగూర్చి తురగము మరల్చెను; వారిరువు రతనితోడనే పోవుచుండిరి. విస్రంభాలాపములాడుచుఁ జుట్టుప్రక్కల దృష్టిపఱపి పరిశీలించుచు జాగరూకులై కటికిచీఁకటిలోఁ బడి గుఱ్ఱములను మెల్లఁగఁ బోనిచ్చుచుండిరి. ఆవేళకు రాత్రి పండ్రెండు గంటలుండును. చూపుమేర దూరమునందు నిత్యవర్షుని గుడారమున్న దనఁగా వారు మువ్వురు చెట్లచాటునఁ బొంచి నిలుచుండిరి.

అట్టియెడఁ జుట్టుప్రక్కల ఘోరమైన యట్టహాసధ్వని వినవచ్చెను. అది, నలువలంకులనుండి నిగుడున ట్లుండెను. ఒక్కొక్కప్పుడు బయలునందలి గాలి యురవడిచేత మిన్ను వంకనుండి వినవచ్చునటు లయ్యెను. ఆ భీకరధ్వాన ముఱుము వలెఁ బ్రాణి నిచయమునకు దిగులు వెంచెను; పొదలలోను

బొరియలలోను గుహాలలోను డాఁగియున్న క్షుద్రజంతువులును క్రూరసత్త్వములును గుండె లవిసి యీవలకావలకుఁ బరుఁగు లిడఁజొచ్చెను. చుట్టుప్రక్కల నేర్పడిన వాని యలబల మాభీక రారావములకుఁ దోడయి యావనమందుఁ బ్రతిధ్వనులు నింపఁ జొచ్చెను. దాదాపుగాఁ బదునైదు నిముసములవఱకా బెట్టిద మైన ధ్వనులు నిగుడుచుండినవి. తైలపాదు లాధ్వనికిఁ గారణము దెలియక తొట్రిలి కోశములనుండి ఖడ్గములుదూసి యుంచి కొనిరి. నిత్యవర్షుని కార్యాలోచన మింకను సాంతమొంద లేదు. అతఁడా భయంకరా రావము విని నిర్భీకుఁడై యుద్దండగదాదండ మొకదానినిబూని పటకుటీరము వెలుపలకు వచ్చినిలిచెను. నల్లని యుడుపులు దొడిగిన యైదువ్యక్తులు వాని మోలనిలిచినవి. వానినిజూచి, "ఓరీ పిశాచములార! మీరీయడవి దొంగలా ?" అని గర్జిల్లి పలికి యతఁడు భీకరముగ గదనుద్రిప్పివైచెను. ఆగద వారిలో నొకనికిఁ దగులుటకుమున్నే మఱియొకఁడు చేతనున్న దండముతోదాని నవలీలఁదట్టివైచి పెల్లుగ గర్జిల్లెను. ఆదండము తాఁకున కాగద తుత్తుమురుకాఁగా, నిత్యవర్షుఁడు నివ్వెఱ పాటొందెను. దవ్వులనుండి చూచుచుండిన తైలపయు శ్రీధరుఁడు నత్యద్భుత రసమగ్నులయి గుబ్బములనుండిదిగి సద్దుసేయక కొంత దాపునకువచ్చి యావింతను ఱెప్పవాల్పక చూచుచుండిరి. చాళుక్యచంద్రుఁడును వారియొద్దనే యుండెను.

"ఓరీ, ఖొట్టిగ! నీయాయువు ముగిసినది. ఇంక త్వరలో నీప్రాణానిలము బొందినుండి నిర్గమించును; పరలోకమున్నదని భావించితివేని భగవంతుని ధ్యానింపుము"అనెను. ఆమాటలలోని ప్రత్యక్షరము పిడుగురాలినప్పటివలె భీకరముగ వినవచ్చెను.

అప్పటికే మంత్రులు మున్నగు వా రాయుధపాణులై రాజు నకుఁ దోడువచ్చిరి. సేవకులు కాగడాలు తెచ్చిరి. ఆవెల్తురు నందు తైలపాదు లా వికృతరూపులైన వీరపంచకమును జూచి, వారు నల్లని యుడుపులు దొడిగికొని యుండుటచేతఁ బిశాచము లనియే తలఁచిరి.

"ఓరి యలసుఁడా! నీయఱపులకును వికార వేషములకును భయపడు వాఁడా యీ నిత్యవర్షుఁడు? మీకుఁ బోఁగాలము తారసిల్లెను; ఇంక నెటకుఁబోఁగలరు?" అని కోపోద్దీపితుఁడై చక్రవర్తి పలుకుచుండునపుడే యచటనున్న దళపతులు మహోగ్రులై యావీరులను దమఖడ్గములతోఁ బొడిచిరి. ఆ వీరులా వ్రేటులు లెక్కసేయక సుస్థిరులై యుండిరి. అపుడు వారిలో నొకఁడు, "ఓరి మానవాధమ! బ్రతుకుఁగోరితివేని, నీసామ్రాజ్యము మాకర్పించి, జైనమతమునుండి తొలఁగుము" అనెను.

ఆమాటలకు ఖొట్టిగుఁడు పెల్లలిగి, "ఓరీ, ఈ పిశాచములను జీవములతోఁ గాల్చివేయుఁడు" అని యాజ్ఞపాలించెను.

అంత నాయేవురలో నలువురు పెల్లుగ గర్జిల్లుచు గంతులిడుచుఁ గన్నుమూసి తెఱచు నంతలోఁ బలాయితు లయిరి. దండపాణియగు వికృతాకారుఁడు మాత్రము నిశ్చలుఁడయి తన పైఁబడవచ్చిన కాగడాలవారిని లాఘవముతోఁదోలి, "ఓరీ, నీకు రెండు తడవ లవకాశ మొసఁగితిని గాని తప్పెను; ఈకాలాగ్నిరుద్రసదృశుని గాల్పుమంటివి కదా! అదిగోచూడు. నీనగర మెట్లు కాలుచున్నదో! మింటికెగయు పొగలతో జ్వాలాజాలము లెట్లు ప్రజ్వరిల్లి విజృంభించుచున్నవో కన్నులారఁ జూడు"మని దక్షిణదిశకుఁ జేయిచాచి చూపెను. మాన్యఖేట నగరమునం

దగ్నిప్రవేశించి యెటుచూచిన నొక టేమంటగా మండఁజొచ్చెను. అదిగాంచి ఖొట్టిగుఁడును వాని పరిజనులును నివ్వెఱపాటొందిరి. దండధారి పెల్లుగ గర్జిల్లి, హా! అని యఱచి తనదండము దిగువ గొట్టెను. అది విల్లువిరిటినట్లు కొన్ని యడుగులు పైకెగసి సెగలు గ్రక్కుచు దగదగ మండుచు వానిపట్టునకుఁ జిక్కెను. దండము చేతికందఁగానే వానిమొడలంతయు నొక్కజ్వాలగా మండఁదొడఁగెను. ఆ జ్వాలలలో నగ్నిసంకాశమగు మానవాకార ముండెను. అయ్యాది భయంకరముగ గర్జించుచు ఖొట్టిగునిపైఁబడి వాని కంఠమొడిసి పట్టినప్పుడే, దగ్గఱ నున్న గుడారమగ్గిలేక మండఁ జొచ్చెను. వాఁడు ఖొట్టిగునిమెడనుబట్టి నేలకుఁ గొట్టఁగా వాని ప్రాణవాయువు లెగిరినవి. ఈవికృత దర్శనముచే భీతులయి ఖొట్టిగుని పరిజనులు పాఱిపోయిరి. ఆవ్యక్తి కొంతవఱ కాయాసము పెంపున రొజుచుండి దబాలున నేలపైఁబడెను. తొంటివలెనే యాచోటను దత్ప్రాంతములందును జీఁకటులు క్రమ్మెను. కొన్ని నిముసములలో నలువురు సేవకులు కాగడాలతో నటకువచ్చిరి. శైలపాదులు మువ్వురు నా చోటుఁ జేరిరి. సేవకులు తొందరగా నేలఁబడియున్న వ్యక్తిని బొరలించి తొడిగియున్న కవచములను విడఁదీసిరి. శీతలోదకములు మోముపైఁజల్లి శైత్యోపచారములు చేయఁజొచ్చిరి. రామన్నయు వారికిఁ దోడ్పడెను. ఏమి వింత! అతఁడే దొంగలనాయకుఁడు; అప్పుడు శైలపకును శ్రీధరునకును బొడమిన యాశ్చర్య మింతంతకాదు; అట్టియెడ దవ్వుల గుఱ్ఱపుగిట్టల ధ్వని వినవచ్చుటచేత, వెల్తురు గానవచ్చు నాప్రదేశమునకే యెవ్వఁడో యోధ వేగముగా వచ్చుచున్నట్లు శైలపాదులు తలఁచిరి. ఆచోటు క్షేమకరమయినది కాదని

తైలప యూహించి దొంగల నాయకుని దేవాలయమునకుఁ జేర్చి నట్లు చాళుక్యచంద్రునితోఁ జెప్పెను. ఒక యందలమందతనిఁ బెట్టి సేవకులు మోఁచికొని పోవుచుండిరి; ముప్పురును గుఱ్ఱము లెక్కి వారి వెంట వెళ్లిరి.

---

## ముప్పదినాల్గవ ప్రకరణము.

### బాదప

శౌర్యసమగ్రులైన సార్వభౌముల పరిపాలనము వహించి, పెక్కుశతాబ్దులనుండి సౌఖ్యము దప్ప నన్య మెఱుఁగని కుంతల దేశమునకు గొప్ప యాపద ఘటిల్లెను. సిద్ధపురుషుఁడని మాన్య ఖేటోద్యానమున మెలఁగుచుండిన యోగి శ్రీహర్షుఁడు; మాఱు వేసముల నగరమున నడయాడుచుండిన జను లతని భటులు. పౌరులు వానిని యోగి యని నమ్మిరి. వాఁడే సంతర్పణవ్యాజ మున వారి కడుపులునిండ ముప్పూట లన్నమిడి వారి కొంపల కగ్గి దరికొల్పెను. వాని భటులిండ్లలోఁదూఱి జనులనుగొట్టి వస్తువులు చూఱగొని యిండ్లు గాల్పఁ జొచ్చిరి. నాయకుఁడు ఖొట్టిగునకుఁ జూపిన యగ్నిజ్వాల లవియే. నగరమందు గొప్ప కలవరము దలచూపెను. ఎచటఁజూచినను పౌరుల యార్తధ్వని! ఎచ్చటఁగాంచిన నసహ్యమగు నాభీలాగ్నిజ్వాలా జాలములు! అట్టియెడ, జక్కలదేవి యాపాదమస్తకము కవచములు దొడిగి దారుణకృపాణహస్తయై వెలుపలకు నిర్గమించెను. అట్టి తరుణ మందే శ్రీహర్షుని భటులు నగరులోఁ జొచ్చుచుండిరి. జక్కల దేవి, వారి కంటఁబడక తప్పించుకొని యొక యుత్తమాశ్వ మారోహించి పురము రక్షింపఁబాటుపడెను. అబల! ఆమె

యత్నమేమి కొనసాగును? అంత నాబిడ చక్రవర్తి కాసంగతి దెలుపఁగోరి శిబిరముఁగూర్చి వచ్చుచుండెను. మనమప్పుడు వినిన గుఱ్ఱపుగిట్టలధ్వని యాబిడ రాఁకవలనఁ గలిగినదే.

జక్కలదేవి యాచోటుఁ జేరునప్పు డెల్లెడలఁ జీఁకటులు వ్యాపించి యుండెను. ఆమె యశ్వావతరణముచేసి శిబిరములోని ప్రతి పటకుటీరముఁ జొచ్చి చూచెను. ఏమానవుఁడును గన్పించలేదు. కానవచ్చిన యొకరిద్ద ఱాజోటి యడుగు ప్రశ్నలకు బదులు పలుకరైరి; చక్రవర్తిజాడ గన్పట్టలేదు. హా! ఇదేమి వైపరీత్యము? రాష్ట్రకూట సామ్రాజ్యమున కింత త్వరలో నిట్టి యిక్కట్టొనగూడునని తలఁపనైతినే! దైవగతి యిటులుండె” ననుచు నాప్రదేశమంతటను దిరుగుచుండెను. కొంతవడికిఁ జీఁకటులు దెసలనుండి తొలఁగుచువచ్చెను. ప్రాణికోటుల నుద్బోధించుటకో యన ప్రాతఃకాల వాతపోతములును బక్షినికరకూజితములును బెల్లెసఁగినవి. జక్కలదేవి, చక్రవర్తి నిర్జీవుఁడై పడియుండుటను గాంచెను! దుఃఖమున కది తరుణము కాదు ; కసి తీర్చుకొనుటకు నుపపత్తిలేదు. కావున నేమియుఁ దోఁచక యొక గుట్ట నెక్కిపోవుచుండెను.

ఆవేళకు సూర్యుఁ డుదయించు సమయమైనది. వ్యాఘ్రశాలయమందున్న నాయకుని మూర్ఛ కొంచెము కొంచెము దీఱుచువచ్చెను. నిశ్వాసోచ్ఛ్వాసములు నిరోధములేక నిగుడఁ జొచ్చినవి; కన్నులు దెఱచి నలువలంకులఁజూచెను; రామన్న యొక్కఁడు తప్ప, తక్కిన వారంద ఱచటఁ గ్రొత్తవారు. అట్టియెడ, ప్రబలవిరోధి ఖొట్టిగుఁడు తనచేత మడియుట వానికి జ్ఞప్తి వచ్చెను. వెంటనే వానియవయవము లుత్సాహాతిరేకమున బల

సేమన్వితములు కాఁగా లేచి కూర్చుండెను. రామన్నను జూచి, "దాపునకు రమ్ము; త్వరలోనే యిందుండి తరలిపోదము" అనెను. రామన్న నాయకునిఁజూచి, "ఏలికా! ఇప్పుడు శరీరస్థితి యెటులున్నది?" అని యడుగఁగా నాయకుఁడు చిఱునవ్వుతో, "నాకేమియు లేదు; ఏల యిట్టులడిగితివి?" అనెను. "దేవరా! ఏమియు లేదు; మనమిప్పుడు క్రొత్తసంకటమునకుఁ జిక్కియున్నామని భావించెదను" అని రామన్న బదులు పలికెను. అంత నాయకుఁ డప్పటి పరిస్థితుల నించుక తలపోసి, "రామన్న! అట్టిదేమియుఁ దటస్థింపదని నానమ్మకము" అనెను.

నాయకునకు సామ్మదీజీస సంగతి తెలిసి తైలపయు శ్రీధరుఁడు నటకువచ్చిరి. తైలప నాయకునకు నమస్కరించి, "వీరవరేణ్యా! మీనివాస మిదియని భావించి యిందే యుండవలయు నని ప్రార్థించెదను" అనెను. అపుడు నాయకుఁడు, మందహాసముఖుఁడై "రామన్న! ఇతఁడు నన్నుఁ బాశములతోఁ గట్టునని కదా భీతిల్లితివి! హా, వానికంటె గట్టివైన ప్రేమపాశములతో నన్ను బంధించుచున్నాఁడు చూచితివా!" అనుచు, తైలపను బ్రీతితోఁ గౌఁగిలించుకొనెను. అప్పుడు తైలప నాయకునిఁజూచి, "వీరుఁడా! ఇతఁడు రామన్న కాఁడు, చాళుక్యచంద్రుఁడు" అనెను. ఆమాటలకు నాయకుఁడు మిక్కిలి యచ్చెరువొంది, "ప్రభుకుమారా! నీ విట్టివాఁడవని తెలియనైతిని" అనెను. అట్టియెడ చాళుక్యచంద్రుఁడు, "ఏలికా! ఇతఁ డాహవమల్లుఁడు; కల్యాణయువరాజు" అనెను. ఆమాటలువిని నాయకుఁడు, "నే నిదివఱకే యూహించితిని; నేఁడు సుదినము; నాయుద్దేశము లన్నియు ఫలించినవి" అనెను. అంతలో, పరిచారకు లుష్ణో

దకముల సిద్ధముసేసిరి. నాయకుఁడు స్నానముచేసి మితభుక్తి సలిపి, విక్రమాదిత్యుఁడున్న యాలయమును జేరెను.

రాజునొద్ద నుచితాసనములందు చేదిదళముల నాయకులును కల్యాణదళముల నాయకులును గూర్చుండి యుండిరి. అతని సమీపమందే దానార్ణవుఁడు నుండెను. నాయకుఁ డచ్చట దానార్ణవునిఁ జూచి చెప్ప శక్యముగాని సంతసమునకులోనై యతనికి మ్రొక్కెను. దానార్ణవుఁ డతనిని మనసారదీవించెను. పిదప, నాయకుఁడు విక్రమాదిత్యునకు నమస్కరించి యతనికిఁ గుడి ప్రక్కనున్న యాసనముపైఁ గూర్చుండెను. ఆసభయందున్న వారానంద పరవశులై కొంతప్రొద్దిష్టాలాపములఁ గడపిరి. పిదపఁ గార్యము వంకకుఁ జిత్తముమరల్చి భావికృత్యముల నుద్దేశించి, చేదిదళములకు శ్రీధరుని, కల్యాణపుర సైన్యములకుఁ జాళుక్యచంద్రుని, నాయకుని దండునకు మాలవ్యుని నధిపతులనుజేసి, సర్వసైన్యాధి పత్యము వహింపుమని నాయకుని వేఁడఁగా నతఁ డంగీకరింపక యాపనికిఁ దైలప యర్హుఁడనెను. ఆమాటలకు తైలప, "వీరోత్తుంగ! మీవంటి మహాయోధలయెదుట నే నేపాటివాఁడను? బాలుఁడను; అకృతాయుధపరిశ్రముఁడను; నాయెడ ననుగ్రహించి మీరే యీగౌరవము వహింపుఁడు" అని వినీతుఁడై పలికెను. నాయకుఁడు, "నాయనా! నేను పూనిన పని యీశ్వరానుగ్రహమునఁ గొంతవఱకుఁ బూర్తిచెందెను. అవశిష్టము గొనసాగించి ప్రఖ్యాతి నొందవలసిన భారము నీపైఁబడెను. ఇందులకుఁ దగిన వాఁడవు నీవే! ఈవిక్రమాదిత్య దానార్ణవమహారాజులవలెనే నేనును నీకు గురువగుదును. నీజ్ఞాతివర్గమునఁ జేరినవాఁడను. మీకూటస్థుఁడగు సత్యాశ్రయుఁడే నాకును

మూలపురుషుఁడని తెలియుము. ఈదానార్ణవమహారాజు నాకు సన్నిహితజ్ఞాతి యగును" అనెను. నాయకుని మాటలకు విక్రమాదిత్య దానార్ణవులు మిక్కిలి యచ్చెరువొంది యతఁడు తమకెట్లు జ్ఞాతియగునో తెలియక కొంతసేపు తొట్రిల్లిరి. నాయకుఁ డది తెలిసి, "సోదరులార! మీరు నా పేరు వినియుందురు గాని చూచి యెఱుఁగరు. నేనును నాతమ్ముఁడు తాళపయును బాల్యదశయంతయుఁ గర్ణాటదేశమునఁ గడపితిమి; నన్ను బాదపయందురు" అనెను.

ఆమాటలు వినఁగానే దానార్ణవుఁడు, "హా, సోదరా బాదప! నీవా యిట్టిద్ధమున నరణ్యమున నజ్ఞాతవాసము సలుపుచుంటివి?" అని జాలిగొని యడిగెను.

"ఔను - మీకును మీరాజ్యమునకును దోఁచిన యాపదను దొలఁగించు నిమిత్తమే యిన్నాళ్లు కష్టపడుచుంటిని. నాకుఁ బ్రాచీనవైదికమతమునం దెక్కుడు విశ్వాసము గలదు. ఎక్కడఁ జూచినను మతిద్వేషులు ప్రబలి వైదికమత మంతరించు కాలము తారసిల్లెను; దాని నుద్ధరింపఁ బాటుపడుచున్నప్పుడే వైదికజనుల కాలవాలమైన వేఁగిమండల రక్షణభారమును దానికొడయులైన మిమ్ముఁ బాపింపవలసిన యవసరమును ఘటిల్లెను. మతమునకుఁ బ్రబల ద్వేషియగు ఖొట్టిగుఁడు కూలుటచేతి నాయుద్దేశములు కొనసాగినవి. ఇఁక వైదికమతము మీ కుమారవీరునివలన వన్నెకెక్కును" అని తైలపను జూపిచెప్పెను.

అభిజల్లగ్నము దారసిల్లెను. బాదప పవిత్రతోయములు దెప్పించి సర్వసైన్యాధిపత్యమునకుఁ దైలప నభిషిక్తునిఁ జేసెను. అట్టియెడఁ బెనుసవ్వడితోఁ బురము దెసనుండి సేనలు పాటి

వచ్చుచుండినవి. "ఉన్నటులుండి యీసైనికులు మనయున్నెడ కిట్లేలవచ్చెదరు?" అని నాయకాదులు తొట్రిలిరి. సైనికులు క్రమము దప్పి పరుగిడుచుండుటను జూచి తమ్ముఁబోదువుటకై వచ్చుచున్నారను శంక వారికిఁ ద్వరలోనే తీఱెను; వారు రణభీరువులైన శ్రీహర్షుని సైనికులనియుఁ దెలిసికొనిరి. వారిని జేరిన యీవకుఁడొకఁ డందలిభటుల నడిగి నాయకుఁడున్న చోటుఁ జేరెను. నాయకుఁడు వానిని గూరుచుండుమని గౌరవించెను; కాని, వాఁడు కాలయాపనకోర్వలేక, "నాయకుఁడా! గొప్పయాపద ఘటిల్లినది. చేతికిఁ జిక్కిన దుర్గము చెదరిపోయినది. ఎందుండియో మల్లప దళవాయి వచ్చి కోట నాక్రమించుకొనెను. వాని దళములు సుస్థిరములై దుర్గరక్షణము సేయుచున్నవి. సేనానియైన కుమారవీరుఁ డొకఁడు మాలవ సైన్యముల నుఱుమాడి తఱుముకొని వచ్చుచున్నాఁడు; వాని ప్రతాపమోర్వలేక, ఇదిగో, మనదళములు పరుగిడుచున్నవి చూడుము! నీ యొడంబడిక చొప్పునఁ దోడ్పడుము" అని రోఁజుచు నచట నున్న వారెల్లరు వినునట్లు పలికెను. ఆమాటలకు బాదప కోపారుణిత నేత్రుఁడై వానిని జూచెను. అది తెలిసి చాళుక్య చంద్రుఁడు, "ముంజా! మా యేలిక యొడంబడిక ఖొట్టిగుని సంహారపర్యంతమే చెల్లును; అది కొనసాగెను; ఇఁక దుర్గసంపాదనము మీరాజుగారిపని" అనెను.

ముంజుఁడు—కావుననే, మారాజుగారి శాసనమును దెలిపితిని. తామసించిన ముప్పు దప్పదు.

వాఁ డాపన్నుఁడై పలుకు పలుకు లందున్నవారి కాగ్రహము పెంచెను. వారేదో వానికి బదులుపలుకనున్న సమయమున మాల్వదళములఁ దఱిమికొని గొప్ప దండొకటి వచ్చు

చుండెను. అందలి సైనికులు పగవారిని విటతాటనముగఁ బొడిచి కూల్చుచుఁ దఱుమఁజొచ్చిరి. ఆశ్చర్యము! వచ్చినవారు, వేఁగి మండలాంధ్రసైనికులు! వారిలో ముగ్వురు వీరులు త్రేతాగ్నుల వలెఁ బ్రజ్వరిల్లుచు తమ సైనికులను బ్రోత్సాహపఱచుచు వచ్చుచుండిరి. అందొక్కరుఁడు, "అభినవాభిమన్యుఁడో" యనఁ దగిన విమలాదిత్య చాళుక్యుఁడు. అతని పార్శ్వరక్షకులు గండ నారాయణుఁడును దాళపయు నగుదురు. ముంజుఁ డానందడిలో నెట్లో దప్పించుకొని పాఱిపోయెను.

కొంతవడికి శ్రీహర్షుని సైన్యములు దెసకొక్కరుగఁ బాఱిపోయిరి. వారిలో శ్రీహర్షుఁడు లేఁడు. అంత బాదప, ఆ శూరత్రితయమును దేవాలయమునొద్దకుఁ బిలుచుకొనివచ్చెను. అందలి శిబిరములందే యాంధ్రసైనికులును విడిసిరి. ఇవ్విధముగా, పూర్వాపశ్చిమచాళుక్యవంశజులైన ప్రఖ్యాతవీరులొక్క చోటఁ జేరునట్లు లీశ్వరానుగ్రహమున ఘటిల్లెను. చాళుక్యవంశ చరిత్రమునం దీ సమావేశ మత్యద్భుత సంఘటనము.

పాఠకులారా! విమలాదిత్యుఁడిటకువచ్చుట కెట్లుపొసఁగె నని సందేహింపకుఁడు. మల్లప, తూర్పుదెసను విమలాదిత్యుని దాఁకి పోరెను. ఆంధ్రసైన్యములను జయించుట కష్టమని తోఁచఁగా, మల్లప భీతునివలె సేనలను పిరిదికిఁ దివియుచు ననుకూల ప్రదేశమునుగోరి వచ్చుచుండెను. విమలాదిత్యుఁడు, అతనిని దఱుముకొని వచ్చుచుండెను. నగరమునకుఁ గొన్నియామడల దూరమునందు మల్లప విడిసి యుండునప్పుడు ఖొట్టిగుని మరణమును రాజ్యమన్యాక్రాంతమగుటను దెలిసి, హఠాత్తున కోటపైఁ బడి యందలి మాలవ సైన్యములఁ దఱిమి, తనసైనికులను దుర్గ

రక్షకులుగ నియమించి కోట స్వాధీనమునకుఁ దెచ్చికొనెను.

మల్లపను దఱుముకొని వచ్చుచున్న విమలాదిత్యుఁడు పగవానిబలములని భావించి, మాళవసైన్యముల దాఁకి పోరెను. శ్రీహర్షునిబలము లతనిప్రతాపమాఁగలేక వెనుఁదీయఁగా వానిని దఱిమికొనుచు వచ్చి వ్యాఘ్రారణ్యమును జేరెను; అట్టియెడ మననే విమలాదిత్యుఁడు తనవారిని జేరఁగలిగెను.

---

## ముప్పదిరెండవ ప్రకరణము.

### జక్కులదేవి

జక్కులదేవి నిస్పృహయై గుట్టనెక్కి పోవుచుండె నంటిమిగదా! ఆమె యెవరికంటఁబడక పోయిపోయి నెత్తముఁ జేరెను. అటనుండి కొన్నియడుగులు నడిచి యొక పెద్దబండయుఁ జుట్టుపక్కలఁ గొన్ని చెట్లునుగల యొక శీతలచ్ఛాయాప్రదేశమును జేరెను. అచ్చటఁ దన కవచములను వీడ్చియుంచి యొక చక్కఁ గూర్చుండెను. తన తాతి వీనుఁగును జూచినది మొదలు చేసి, తొంటివలెఁ దా నంతఃపురములో నెండ కన్నెఱుఁగక సుఖంతునన్న తలంపా యువతి డెందమునుండి తొలఁగినది. పలుమాటలేల? ప్రాణములపై నభిమానమువిడిచి, తన పెద్దల మతాచారానుసారము సల్లేఖనమొనరించుటకే యా లతకూన నిశ్చయించుకొన్నది; కాని, యువకుఁడు జ్ఞప్తిరాఁగా నట్టిచేఁతకు మన స్సొగ్గకుండెను. చుట్టుప్రక్కలఁదిరిగి పండిరాలిన ఫలముల నేరి తిని, బడియు నీరాని యాబిడ యించుక సేదదీఱెను. బండలో నొకవంకఁ జీలికవలె నేర్పడిన పగులును జూచి యది గుహగాఁ దెలిసి, తనకు మంచికాలము వచ్చువఱకచటనే నివసింపవలయు

నని యామె నిశ్చయించి కవచములను దెచ్చి యచటఁ బదిల పఱచెను.

జక్కులదేవి, తపస్వినివలె నాగుహాలో రెండుదినములు గడపెను. అట్టియెడ నంధోకమూల నొకసారంగ ముండుటఁ గనుఁగొనెను. దానిని జూడఁగానే యంచెట్టి క్రూరప్రాణి దాఁగి యుండెనో యని స్త్రీలకు సహజమైన భీరుత్వమును వహించెను. కాని, అటుపైని రెండుదినముల దనుక భయాస్పదమైన దేదియు గోచరింపక పోఁగా బాల్యచాపలమున మెల్లఁగ దానియొద్దకుఁ బోయి చూచెను. దిగువకుఁబోవు సోపానములు గొన్ని కానవచ్చినవి. అవి బండలోఁజెక్కఁబడి యున్నందునఁ జదునుగ నుండ లేదు. కాఱు చీఁకట్లు నెలకొని యుండఁబట్టి సోపానములెన్ని యున్నవనియు, నిట్టిచోటికిఁ గొంపోవుచున్నవనియు స్థూలదృష్టికి గోచరింపకుండెను. "సరి, చావునకు సాహసించియున్నాను; ఇదెందులకుఁ గొంపోవునో కనుఁగొనెదను" అని తెగించి యా బిడ దాదాపుగా మూఁడువందల సోపానములను దిగి యొక చదునైన సమతలమును జేరెను. ఆదారినే కొన్నిగజముల దూరముపోఁగా నెదుట గోడవెట్టినటు లొకశిల గానవచ్చి మార్గమునకు నిరోధమేర్పఱెను. కాని యాబండకుఁ జుట్టుప్రక్కల సందులనుండి వెల్తురు గానవచ్చుచుండెను. "ఇదేమివింత! ఇంతపాటు పడి కల్పించిన యీమార్గమిట్లు ముగియుట కేమికారణము?" అని యాస్థలముఁ బరిశోధించుచుండెను.

వ్యాఘ్రేశారణ్యమందున్న విక్రమాదిత్యాదులు, ఇఁకఁ దామెట్లు మెలఁగవలయునో యాలోచించుచుండిరి. తమ యత్నములు శుభకార్యముతో బ్రారంభింపవలయునని నాఁటికెనిమిదవ

నాఁడేర్పడిన శుభముహూర్తమునఁ జాళుక్యచంద్రునకును గళింగ కన్యకును బెండ్లిజరుప నిశ్చయించిరి. ఆ తరుణమందు మైత్రిని దెలుపు టెక్కెములు పట్టుకొని నగరమునుండి కొందఱు వీరు లాలయము నొద్దకువచ్చుచుండిరి. తైలప దూరమునందే వారి నాయకునిఁ జూచి యెదురేగి పిలుచుకొనివచ్చెను. వెంటనే విక్ర మాదిత్యుఁడు లేచి యతనిని గౌఁగిలించుకొని యుచితాసన మునఁ గూర్చుండఁబెట్టి గౌరవించెను. మల్లపతోడవచ్చిన యో ధులు తామువెచ్చిన యమూల్యములైన కానుకలను మహారా జునకు సమర్పించిరి. వాని నతఁడు స్వీకరించి, మల్లప వంకకుఁ దిరిగి" సేనానీ! ప్రకృతము మిమ్మీయెడకుఁదెచ్చిన ఘనకార్య మెట్టిదో సెలవిచ్చెదరా?" అనెను.

మల్లప—మహారాజ! తొలుదొలుత మీసందర్శన మప్పుడే విన్నవించియుంటిని. మనయాహవమల్లుఁడు (తైలప) చాళక్యారత్నమును స్వీకరించుటతోఁ దనపెద్దల నాటి కుంతల సామ్రాజ్యమును గైవసము గావించుకొన వలసియున్నది.

బాదప—మల్లపా! మన యాహవమల్లుఁడు సామ్రాజ్య పదవి కర్హుఁడగునుగాని నీపుత్రికకెట్లు వల్లభుఁడగును?

మల్లప—(చిఱునవ్వు మోమ మలరింప బాదపను జూచి) వీరుఁడా! దైవఘటనమట్టిది. దానినెట్లు నిరోధించుట?

బాదప—నేను దైవమును గూర్చిగాని పౌరుషమును గూర్చి గాని ప్రస్తావింపను, చక్రవర్తికాఁ దగినవానికి మనవంటి సామాన్యుల కన్యక యెట్లు పొసఁగియుండును?

మల్లప—ఔను, ఏకన్యక పరిణయముచేఁ జక్రవర్తి కాఁగలఁడో యట్టికన్యను గూర్చియే యిపుడు మందలించితిని.

చాళుక్యచంద్రుఁడు—ఖొట్టిగుని మనుమరాలిని గూర్చి యా యిపుడు ప్రస్తావించెదరు ?

మల్లప—కాదు ; నాపుత్రికనుగూర్చి విన్నవించితిని. ప్రకృతము దుర్గము నాయధీనమందే యున్నది. ఈయువకుని నాపుత్రికతోఁడ సామ్రాజ్యముకూడ నాశ్రయింపనున్నది.

బాదప—దుర్గరక్షకులందఱు సార్వభౌములా ? రాజవంశ ప్రసూతయగు జక్కులదేవినిగూర్చి మందలించితిని. ఆబిడయే యితనికిఁ బట్టమహిషియగుటకుఁ దగినది.

మల్లప—వీరుఁడా! జక్కులదేవిని వరింపవలదని నేను విన్నవింపను ; నాపుత్రికను వరించి సామ్రాజ్యము చేకొనుమంటిని. జక్కులదేవి యితని పట్టమహిషియగుటకు నాయభ్యంతరములేదు. దుర్గము నాయధీనముఁనకు వచ్చినది మొదలు రాజకన్య గానరాకున్నది. ఆబిడను వెదకించుచునే యున్నాను.

శ్రీధరుఁడు—జక్కులదేవి మన పగవాని యింటిబాలిక ; ఇప్పటిస్థితిలో దానినెట్లు సార్వభౌమునింటి కన్యయనఁగలము.

బాదప—శ్రీధరా! ఆబిడకెప్పటికిని లొచ్చుగలుగదు. నేటికొక యిక్కట్టు గలిగిన రాజరక్తమునకుఁగల మహిమ తగ్గునా ! ఆకన్యనిమిత్తమే యాహవమల్లుఁ డిటకువచ్చి యిన్ని యభ్యుదయములకుఁ బాత్రుఁడయ్యెను. మల్లపా ! ఆబిడలభించినచో మిగులవైభవమున నేను బెండ్లి జరిపెదను.

విక్రమా—(బాదపనుజూచి) వీరవరేణ్యా ! మీయభిప్రాయ మయుక్తమని యెవ రనఁగలరు ?

మల్లప—"వీరుఁడా ! నీయిచ్చ చొప్పుననే జరుపుము. వివాహము నుద్దేశించి పురమలంకరింపఁబడి యున్నది. సర్వము

సిద్ధపఱచియున్నాను. "రేపే మీరెల్లరు పురము ప్రవేశించ యుద్దిష్టకార్యము నిర్వహింపుఁడు" అని విన్నవించెను. అందులకుఁ రంగీకరించిరి. పిమ్మట, మల్లప విక్రమాదిత్యునివలన సెలవు పొంది పురమునకు మరలెను. తైలప యచటనుండి లేచి యా యోద్యానముఁజేరి యొక శిలావేదికపైఁ గూర్చుండి యేవో తలపోయుచుండెను. వానిహృదయ చక్షువునకు శాంతలగ జక్కులదేవియు మాటిమాటి పొడకట్టుచుండిరి. జక్కులదేవిని గూర్చి తలంచునప్పుడు, బాదప మల్లపల మాటలు వానికి జ్ఞప్తి వచ్చెను. బాదప నుడివినట్టులే తానా సుందరీమణిని బట్టపు రాణిగ నంగీకరించుట త్రిలోకాధిపత్యము వహించుట వంటిదని యాతఁడనుకొని యానందించెను ; కాని, మల్లపమాటలు తలంపునకురాఁగా, "హా! సుందరీ! నిన్ను బ్రాణేశ్వరినిగాఁ బడయ నైతినేని నాకిహాముతోఁడి తగులమేల? ఈగొప్ప విపత్తునకు జిక్కి క్రమ్మగ్గితివో, శత్రువులబారికిఁ జిక్కి పరితపించెదవో? నీ స్థితిగతులెట్లు తెలిసికొనఁగలను" అని చింతిల్లెను. అప్పుడు వాని గుండె జల్లని యొడలంతయుఁ జెమటఁగ్రమ్మెను. వానియంతః కరణమునకు ప్రపంచమంతయు మునిఁగిన విధమయ్యెను. అంతలో నొక, వాఁడు కూర్చుండిన చోటుకు దాపున నిట్రగాఁజెక్కు బడి ప్రహరివలెఁ బోలుపారుచున్న గుట్టనుండి యున్నటులుండు యొకబండ దబాలున దొర్లిపడెను. ప్రణయినీ ధ్యానపరవశుఁ డయిన తైలప హృదయ మాశబ్దమాకర్షింపఁగా నావంక దృష్టి సారించెను. హా! దివ్యమోహనయోషావతంసము! తనయంత స్తాపము దెలిసి తన్నుద్ధరింప శిలోచ్చయము భేదించికొని పొడ తెంచిన సౌందర్యవారాశిని, ఆజక్కులదేవిని జూచునప్పుడే

ంప యనుభవించిన రసమిట్టిదని వర్ణింప నెట్టికవికిని శక్యము
ను ; విరోధివర్గముచేనొచ్చి ప్రాణపరిత్యాగమునకే ప్రయ
ంచియుండిన జక్కులదేవికిఁ దైలప సందర్శనమెట్టి యానంద
ునఁగినదో చెప్పనలవిగాదు ; ఆబిడ దివ్యకాంతయో యన
ప్పపాటు వొఱఁగి యాబిలముఖమున స్తంభీభూతయైనిలిచెను.
ంతవడికి భ్రమదీఱి తైలప యాయువతినిఁజూచి, "ప్రాణేశ్వరీ!
్తలపోయుచుంటిని ; నిన్నే యిప్పుడు స్మరించుచుంటిని.
్నుఁజూచు భాగ్యమలవడెను" అనెను.

జక్కుల—ఔను, వీరుఁడా! నాకును నిన్ను సందర్శింప
ుయునను తమియుండెను. హా, దైవము ప్రతిఘటించినదే!

తైలప—ప్రాణేశ్వరీ! దైవమనుకూలించినప్పుడు ప్రతి
ంలించిన దనెద వేల? నీమాన్యఖేటాంతఃపురములు, నీ యిందలి
హారోద్యానములు నిన్నుఁదొలఁగినవికావు ; నీదాసదాసీజనులు
ేవకులు నీకు విముఖులుగారు. పలుమాటలేల? నీవె యీకుం
ుదేశమునకుఁ జక్రవర్తినివి" అనెను. ఆమాటలకాబిడ, "నేనీ
ావనవంతునెడఁ బొరపడలేదు ; ఇతఁడు కృతఘ్నుఁడుకాఁడు;
ుణఖని" అనుకొనెను. వారిరువు రాచోటువిడిచి, విక్రమా
్యుఁడున్న యాలయముఁజేరిరి. బాదపాదులు జక్కులదేవి
ంచినందులకు మిగుల సంతసిల్లిరి. జక్కులదేవియుఁ గళింగ
్యయున్న విడిదిఁజేరెను.

మఱునాడు మల్లప, బాధువులును బల్లిదులును బరివే
ంచిరాఁగా సువాసినులు శోభనవస్తుచయము పళ్లెములందుంచి
మ్చుచుండ మంగళవాద్యములతో నగరునుండి కదలి, మహా
భవమునఁ బెండ్లికొమరుని బిలుచుకొనిపోవ వ్యాఘ్రేఘేశాల.

యమునకువచ్చెను. అచ్చట, జక్కలదేవినిగాంచి పరమానందరస
భరితుఁడై యుచితరీతి నామె కూఱటలుపలికెను. తైలపయు, ద
జాళుక్యచంద్రుఁడును జక్కలదేవియుఁ గళింగకన్యయు బాగుగఁ
నలంకరింపఁబడిన దంతపుఁబల్లకీలఁ గూర్చుండిరి. తక్కినవా గా
వరువునకుఁ దగినవాహనము లధిష్ఠించి నగరుఁ జేరిరి.

వివాహదినము దారసిల్లెను; శుభలగ్నమునఁ గళింగ
తనయకును జాళుక్యచంద్రునకును, తైలపకును జక్కలదేవికి గ
బెండ్లిజరిగెను. ఆ మూహూర్తమునందే యాపీఠములమీఁద
తైలపను శాంతను గూర్చుండఁబెట్టి పెండ్లిచేసిరి. వివాహసమ
యమున మాన్యఖేటమందుఁ దానార్జించిన యావద్ధనమును
నాఁడు వ్యాఘ్రశారణ్యమునఁ దానుబట్టిచెఱయందుంచిన భట
వర్గమును బాదప జక్కలదేవి కాశీర్వచన పురస్సరముగ నిచ్చి
వేసెను. "నీకీర్తి దశదిశల వ్యాపింపఁగలదని దీవించి, చాళుక్య
చంద్రునకుఁ గీర్తివర్మయను నామమిడి వేఁగికిఁబట్టముగట్ట ను
కించెను; గాని, దానార్ణవాదులెల్ల రేకగ్రీవముగా, "బాదపా
వేఁగిపాలనము నీవు వహింపుము; చాళుక్యచంద్రుఁడు నీయేల
బడిని యువరాజుగ నుండనిమ్ము" అని యతనిని నిర్బంధించి
విధిలేక యతఁ డందుల కంగీకరించెను ; కావున బాదపు
వేఁగిరాజ్యమును బట్టముకట్టిరి. కుంతలమునకుఁ దైలపనుబట్టము
కట్టఁ బ్రయత్నించిరి; ఆతఁడందులకు సమ్మతింపక, నేను రాష్ట్ర
కూట కులాంతకుఁ డన్న బిరుదమును వహించునంతవఱకీయుద్యమ
మాపియుంచుఁడని వేఁడుకొనెను.

శ్రీవేంకటేశార్పణమస్తు.

Printed at the India Printing Works, Madras.

